శ్రీ

# తులసీదాస చరిత్రము

## భాగము ౧

(మద్రాసు యూనివర్సిటీ, బి. యే. పరీక్షకు పాఠ్యగ్రంథముగా)
నిర్ణయింపబడినది.

గ్రంథకర్త:

దంటు శ్రీనివాసశర్మ, బి. యే., బి. యల్.,

వకీలు, బెజవాడ.




మొదటికూర్పు 1000 ప్రతులు



కె. వాణీ ప్రెస్, బెజవాడ.

1938

# ఆమోదము.

శ్రీమదమృతానందనాథ చరణారవింద సేవాసమ
ధిగత విజ్ఞాన రసతుందిలములగు మిళిందము లానందసుందర
మైన గాన మాలపించుచున్నవి. అవి వియోగుల కసూయా
జనకములును యోగిజన మోహనములునై యలరారు నను
టలో వింత లేదు. అందుఁగన శాంబాకృతములగు జీవయాత్ర,
ఆనందసారము, అమృతసారము, హంసవిజయము ననునవి
కృతిరూపమునఁ బరిణమించినవి. అవి యనుభవమాత్రగమ్య
ములును, అగాధవిజ్ఞానమానితములును, శాస్త్రసమ్మితము
లునై, సామాన్యజన దురవగాహములుగా నున్నవి. గురు
కృపాకటాక్షచంద్రికా ప్రసారమున నిరాకృతావరణులగు
జిజ్ఞాసువులకే యట నిక్షిప్తమగు నర్థమనుభవమునకువచ్చును.

విజ్ఞానబీజములు కేవలశాస్త్రములు, పురాణములు,
కావ్యములు, గేయములు, (తత్వములు) నని వివిధరూప
ములుగా సారస్వతోపాసనా పరవశులగు భారతీయవేదాంత
వేత్తలనుండి వ్యాప్తినొందుచువచ్చినవి. వ్యాసుని సూత్ర
పురాణ నిర్మాణము, శంకరుని భాష్యరచనము, వాల్మీ
క్యాదుల కావ్యఫణుతులు, కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రో
దయకల్పనము, త్యాగరాజుని కృతిరచనము నందుల
కుత్తమలక్ష్యాంశములు. ఇందుఁ గావ్యశాఖకుఁ జేరినది యీ
తులసీదాసు చరిత్రము. కృతికర్త బ్రహ్మశ్రీ దంటు శ్రీని
వాసశర్మగారు.

కవి యీ గ్రంథమును బ్రధానముగా నాత్మవిజ్ఞాన విషయమై మననమునకుఁగాను వ్రాసికొంటినని వ్రాసెను. ఆ మననదశలో గురువాక్యము, దాని కుపకారకమైన యుపనిషద్వాక్యార్థము, నన్వయించుకొనుచు, సచ్చారిత్రియగు కనకాంబగారి జీవయాత్రాది గ్రంథములనుండియు ప్రత్యక్షము గాఁ "దాము గురుముఖమున నుండియు, విని" జీవయాత్రాపథమున ననుభవములోఁగనిన యుపమానములమూలమున సుబోధముగా జ్ఞానమును స్థిరపరచుకొనుటయే యీ గ్రంథరచనమునకుఁ గారణమను గ్రంథకర్త కంఠోక్తి గమనార్హము. ఇది సూక్ష్మదృక్కులగు యోగులధర్మము. పురాణములయందలి సత్రయాగాదిప్రశంసలు, నధ్యాత్మచర్చలు నిందులకు నిదర్శనములు.

సృష్టిచిత్రమును గాముకుఁడును, యోగియును సమముగానే పరిశీలింతురు. కాని కాముకుని పరిశీలనమతాత్త్వికము, బాహ్యము. యోగిపరిశోధన మట్టిదిగాదు. అతని దృష్టి వేరు. అది తత్త్వసమన్వయైకమూలము. ఆంతరంగికము. 'యోగః కర్మసుకౌశలమ్' అనుటచే నట్టి కర్మకౌశలమును, తత్సాధనమగు చిత్తనిరోధనమును యోగమని పిలువఁబడెను. అదియే సమాధి. సారస్వతోపాసనము నిపుణైకగమ్యమగు రహస్యము. అట్టియుపాసనాస్థితికి సమాధియే యుపాయమని పెద్దలనిరి.

॥సారస్వతం కిమపి తత్సుమహారహస్యమ్
యద్గోచరే చ విదుషాం నిపుణైకసేవ్యమ్

తత్సిద్ధయే పరమయం పరమోఽభ్యుపాయః
యచ్చేతసో విదితవేద్యవిధే స్సమాధిః."

కవికి సమాధి (ఏకాగ్రత) యెప్పుడు ప్రధానమంటిమో; తత్కార్యమగు కావ్యమునకు 'మోక్షము' ప్రధానఫలమని తెల్పినట్లే. మోక్షమానందరూపము, అది విగళిత వేద్యాంతరమును శాశ్వతమును. దానిఁ బొందఁగోరి యోగమార్గమున నడచువానికి దారిలోఁ దత్సదృశములగు నానందములెన్నో యానుషంగికముగ ననుభవమునకు వచ్చును. ఆరు రుత్తువున కవిసోపానములు. నాదానుభవగమ్యమగు గానము శబ్దార్థగమ్యమగు కవిత్వము మొదలగు కళారూపములఖండానంద తేజోమూర్తియగు నాత్మయొక్క కిరణలేశములు. వాని కంతర్లక్ష్యమున సమన్వయము వేఱు. ఇది తెలిసివ్రాసిన కవితయందాలక్ష్యములు మణిశకలములువలె మిణుకుమిణుక్కునఁ దేజరిల్లును. వానింగని రససిద్ధులు ముగ్ధులగుదురు. సూక్ష్మదృక్కులగు రత్నపరీక్షకుల పరీక్షల కవి నిలుచును. అవి లేనికావ్యము లసత్కావ్యములు. 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అను శాస్త్రమిట్టి కావ్యములనే నిషేధించుచున్నది.

నవిద్యతే సత్ బ్రహ్మ తదసత్ కావ్యమ్, (బ్రహ్మప్రతిపాదకముగాని కావ్య మసత్కావ్యము) అని వేత్తల హృదయము. బ్రహ్మప్రతిపాదకముగాని కళ కళయేకాదు. శాస్త్రము శాస్త్రమేకాదని మన్వాది స్మృతుల నిర్ణయము. ఇది భంగ్యంతరమున నీ గ్రంథమునఁగూడ యిట్లు దెలుపఁబడెను.

"భక్తిరసహీనశుష్క వాక్ప్రౌఢిచేతఁ
గమలజామోదగరిమంబు గలుగునెట్లు
వట్టివడగాలి తాకున వట్టివేళ్ళఁ
బుట్టునే తావి రసపరిప్లుతినిగాక"

జీవుఁడు తురీయావస్థయందున్న తటి 'మోక్ష' సాధనము లన్నియు నందేలయించును. అపుడు కేవల బ్రహ్మస్వరూపుఁ డగును. ఆదృష్టిలోఁ గవిత్వాదులనిత్యసాధనములే. అయినను యోగపథగామియగు వానికిఁ గవిత్వసిద్ధి యానుషంగికము కావచ్చును.

గురుపద పంకజరసమా
ధురిఁ జొక్కెడు యోగి ఝుంకృతులు సేయుడుబ?
భరమట్టు; లనుభవమువర
కరయన్ రోదసేయు శ్రుతులనాత్మారామా!

అనుటన హేతుకము. అదిగాక పానకరసాస్వాదన పరుండగు వానికి, తత్సంపాదనయత్నమున, నేలకులు, పచ్చ కప్పురము మొదలగు సుగంధద్రవ్యముల సౌరభానుభవ మవాంతర గమ్యమైనట్లు, బ్రహ్మానంద రసాభిలాషికిఁ దత్స దృశములగు కవితాదికళ లాత్మ వికాసజనకములగును. కావుననే కవిత్వము యోగసిద్ధులలో నొకటిగాఁ బరిగణింపఁ బడినది. అయాచిత లభ్యమైనయీసిద్ధి కభ్యాసి(ఉపాసకుఁడు) ముగ్ధుఁడగును. అవాగ్ధ్యి మొకప్పుడు పెడదారిం బట్టింపఁ గలదు. అపుడే యోగభంగమగును. ఆసమయమును నిపుణుఁ డుగమనించి తప్పుకొనును, అట్లుతప్పుకొనవలయునని యోగ

ఇది కావ్యమంటిని. కావ్యము కాంతాసమ్మితము. అగుచో నిందు వ్యంగ్యార్థమేది? అనునది చర్చకుఁ జిక్కినవిషయము. ఆలంకారికులందరు కావ్యసామగ్రీ నిరూపణమున వ్యంగ్యమున కుదాహరణముగా నొకొ్కక వాక్యము నుదాహరించుచువచ్చిరి. దానినిబట్టియే "వాక్యం రసాత్మకం కావ్యమ్" అనికావ్యమును వాక్యమాత్రముగా లాక్షణికులు వాకొనిరి. ఈలక్షణము యథావస్థితముగా నన్వయించిన భారత భాగవతాదులయు మఱియితరపురాణములయు, రచనములయందుఁ గావ్యత్వము ప్రసక్తముకావలసినదే. కాని యది రూఢమగు విషయముగాదు. కావ్యము వ్యంగ్యప్రధానమనఁగా, కావ్యము నందలి యఖండార్థమున వ్యంగ్యము ప్రధానముకాఁదగునని భావము. ఆప్రాధాన్యమునఁదరతమభేదమును బట్టి కావ్యముత్తమమధ్యమాధమ భేదముచే మూఁడు తెఱఁగులగుచుండును. తులసీదాసు చరిత్రము వ్యంగ్యప్రధానమగు నుత్తమకావ్యము. ఆ యంశమును గవియే "భక్తుని చరితమిషమున న్జెప్పువాఁడఁ ద్వచ్చరితంబున్" అనిసూచించెను. ఇందు 'మిషము' అనుపదము వ్యంగ్యత్వసూచకము.

తులసినిదొలుత "బ్రహ్మచారిఁగాఁబిమ్మట గృహస్థుగాఁ జిత్రించి, ధర్మార్థ కామ స్వరూపములఁజూపి, యావల వానప్రస్థునిగామార్చి యా ధర్మములకు మోక్షపర్యవసాయిత్వము గల్పించెను. ఇందుఁదులసి కథ ప్రధాన వాక్యార్థము. మోక్ష విషయమిందు ప్రధానవ్యంగ్యార్థము, ఈవ్యంగ్యబీజమే.

"తివిరి యోనమాలు దిద్దించు నాఁడెద్ది
మాణవకుఁడు నేర్చు మానులదియె

జపము సేయుచుండు) సంసారముక్తికై
మొదలై తుదియై నిత్యపూర్ణమునకు"

అనుపద్యమున నిక్షిప్తమైనది. ఇదియక్షరాభ్యాస బోధకమై యయ్యక్షరాభ్యాస మూలకమైనది. ఇందలిపూర్ణ పద మాత్మార్థకము. తక్కిశాస్త్రములకువలెనే గణితము నకుఁగూడ తత్త్వబోధము పరమలక్ష్యము. బిందు - సంఖ్య లచే నాత్మప్రకృతులను సూచించుచు 'సాంఖ్యశాస్త్రము' అను నొక దర్శనమును శ్రీవిరూపాక్షపీఠాధిపతులు శ్రీ శ్రీ బోధా నంద భారతీస్వాములవారు వ్రాసిరి. "ఓం పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అనునథర్వణ వేద శాంతిపాఠము నూఁ తగాఁగొని యీసిద్ధాంతము విస్తరింపఁబడినది. నిత్యపూర్ణమునకు మొదలై తుదియుననుట యీసిద్ధాంతరహస్యమే. అక్షరసంకే తమగులిపి యీకుండలీ రూపమునుండి యుద్భూతమైనది. ఇది కుండలీశక్తిసూచకము. ఇది సూక్ష్మదృగ్జ్ఞేయము. స్థూలదృష్టి కిఁగూడ ప్రాచ్యుల వర్తులాకారలిపులిందులకు సాక్ష్యము నిచ్చు చున్నవి. ప్రకృతమునఁ దులసికి దిద్దించిన ఓనమాలు శివమం త్రమును సూచింప, లిపిరచనమునకుఁ బూర్ణానుస్వారముల బోధించిరను నభిధేయముమూలమున జ్ఞానోపదేశము వ్యంజిత మొనర్పఁబడె. మఱియును 'శైశవేఽభ్యస్తవిద్యానామ్' అను నట్లు బ్రహ్మచర్యాశ్రమ ధర్మమిఁటసూచితము ఇట్లు "తొలుత నాటినబీజంబె మొలచి, పెఱిగి, శాఖయై, పుష్పఫలంబులొసం గు" వనుటలో, బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యావస్థలు,

బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ,యత్యాశ్రమములును వ్యంజితము లైనవి. "అతనిప్రబోధచంద్రుఁడు వదారుకళల దనుఁజెందఁబూర్ణుఁ"డగుటలో బ్రహ్మచర్యాశ్రమసంపూర్ణత సూచింపఁబడినది. పిమ్మట గార్హస్థ్యమునఁ దులసికిఁ గుల రూప వయోగుణముల ననుకూలవతియగు భార్యతోడి కాపురము వర్ణితము. యోగాంతరాయము కలుగకుండ గృహస్థునకు శాంతిరక్షణము ముఖ్యము; సంసారమునంటియునంటని యోగికిఁ దద్గుణదోషము లంటవనుటకు, సాగరముకంటె గొప్పది శాంతి' అను సూత్రముపై రాజభార్యకథ చిత్రింపఁబడినది. రాజాశ్రయాది గార్హస్థ్యధర్మములను బోషించి తులసికి వేశ్యా సహవాసము గూర్పఁబడినది. 'ముముక్షువున కంతరాయము లుకల్గును. అవి తాత్కాలికములు. వానివలన నించుక కాల భంగమైనను, ఆధ్యాత్మిక జ్ఞానసంస్కారమంతటఁ జెడదు. ధీరులు వానినుండి తప్పుకొందురు' అనునది యిందలి వ్యంగ్యార్థము. కులసతియెడ విరాగము, వేశ్యయెడననురాగమును వర్ణించుటచే, స్వధర్మవిరతి, పరధర్మరతి సూచితమైనది. ఇందవాంతరమగు గండకీచరిత్రము మమత ప్రాతివ్రత్యధర్మమును బోషించుటకుఁ జిత్రింపఁడినది. ఉత్తమసతికుండఁదగిన లక్షణములను నిరూపించుటలో నిటఁజూపఁబడినకవి నైపుణ్యము ప్రశంసా పాత్రము

పిమ్మటఁ దులసికిఁ దండ్రిచేసిన హితోపదేశము 'కడచినతిండి తావి త్రేపునకువచ్చినట్లు' క్షణక్షణమునను జ్ఞప్తికి వచ్చుట సంస్కారబలమును సూచించును. మరియు వేశ్యయెడవిరాగమునకు వేశ్యయే కారణమైనట్లు వర్ణించుటలో

చింతామణిప్రియుఁడగు లీలాశుకుని గాథ దలంపుకువచ్చుచు న్నది. ఉత్తమసంస్కారి కాలకర్మములననుసరించి విషయ లోలుఁడయ్యు నాదారినే మరలుననుటయిందు వ్యంజితము. ఊబిలో దిగఁబడినవాఁడూబినుండియే వెనుకకు రావలయునని పెద్దలనిరి.

తులసి 'కంలతఁజెంది యలంతఁజెంది, పెడచెవిఁబెట్టితి గురువులనుడువుల' నని వాపోవుట యాయుత్తమ సంస్కార మునకు సూచకము. అపుడాతఁడనుభవించు పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తమయ్యెను. మమతయెడనకృత్రిమమగు ప్రేమ మున, నమృతోపమానముగఁ బలికించిన.

"అమలంబు స్వార్థహీనం
బమాయిక మసూయ లేనిదై యెప్పుడు ప్రే
మము భూమానందప్రద
ము మోక్షదమునగును బుణ్యపురుషులకనుచుఁ "

"ఒండొరులఁ గూర్చు సతియునాథుండు గలియు
జగముతోఁ చునె కైవల్యమగు నిజంబు"

అనుమాటలు శృంగారరససర్వస్వ నిధానములై శాంతి రస నిదానములైయలరారుచు "కామిగాక మోక్షగామి గాఁడు" అను సిద్ధాంతమునకు వ్యంజకములై ,, యథా ప్రియయా సంపరిష్వక్తః న బాహ్యం వేదనాంతరమ్ " (ఒకఁడెట్లు ప్రియురాలు తనంత కౌగలించుకొన్నప్పుడు బాహ్య

భ్యంతరము లించుకయు నెఱుగకుండునో యట్లే బ్రహ్మవేత్త యగునాతఁడు బాహ్యాభ్యంతరముల నెరుంగఁడు) అనునుపనిష త్తాత్పర్య పర్యవసానమున విలీనములగుచున్నవి. క్రమ ముక్తికి గార్హస్థ్య మొక సోపానము. అది యొడుదుడుకు లేనిది. అందు నిలిచిన ధీరుఁ డిహమును బరమును 'దేహళీదీపవిధిన్' గాంచును. 'వనితాచందన మాల్యలేపములు' ఘనము, నిర్భరము, అఖండము, నిష్కామము, శాంతమునైన బ్రహ్మసుఖమునుస్థూలారుంధతీన్యాయమునఁ జూపఁగలవు.లౌకికుఁడగు నరున కలౌకిక బ్రహ్మానందము బోధకు రావలయునన్నచో విగళిత వేద్యాంతరమగు 'రస' స్వరూప మనుభవమునకు రావలయును. ఇదియే కామ పురుషార్థముయొక్క రహస్యము.

భార్యను దేవతామూర్తిగాఁజిత్రించి తులసికి హితోపదేశము సేయించుటలో నామెకు గురుస్థానమిచ్చుట కవి తాత్పర్యము. అది శ్రుతిస్మృతి పురాణాది తాత్పర్య పర్యాలోచనైకనిపుణులకు మాత్రమే గమ్యమగు రహస్యము.

"ఏకాంతబోధ మొసఁగెడు
నాకాంతయె ముక్తికాంత యాస్థానంబే
నాకము శూన్యస్థానము
శ్రీకామేశ్వరుఁడు గురుఁడుసిద్ధము జీవా!"

అని జీవయాత్రాదులును-

'విమలచారిత్ర శిక్షకాచార్యకంబు'

అని భారతమును, కాంతాసమ్మితతయోపదేశయుజే'
అను నాలంకారికుల వాక్యమును నిందులకు బలవన్నిదర్శన

ములు. ఇందు 'ఆచార్య' 'ఉపదేశ' పదములు స్త్రీయెడల వాడుటచేఁ బ్రాచ్యులదృష్టిలోఁ గాంతకీఁబడినగౌరవస్థానము మరెచ్చటను లేదని చెప్పవచ్చును. 'పుష్పేణాఽపినతాడయేత్', అనిమన్వాదిస్మృతుల యాదేశమును బట్టిచూడ గురుదేవతా మూర్తిగా స్త్రీ యుపాస్యయనియే తేలును. ఆ యంశమును వేదాంతజ్ఞు లెల్లరును జాటిరి.

శ్రీ శంకర భగవత్పాదులు—

> "శివశ్శక్త్యాయుక్తోయది భవతిశక్తః ప్రభవితుమ్
> నచేదేవం దేవోనఖలు కుశలః స్పందితుమపి।
> అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాదిభిరపి
> ప్రణన్తుం స్తోతుం వాకథ మకృతపుణ్యః ప్రభవతి"

అని ప్రశంసించుటలోఁ బైయర్థమిమిడియున్నది. సమరసమిథునము ప్రకృతి పురుషైక్యమును సూచించుననుట విజ్ఞుల పరిపాటియే.

కాంత కాధ్యాత్మికోపదేశాధికారమెప్పుడు లభించెనో, యప్పుడు కాంతాసమ్మితమగు కావ్యమునకు విజ్ఞానోపదేశాధికారములభించినట్లే. కాని యీగ్రంథమున నలౌకిక చిత్రముకూడ జరిగినది. కవి యిందొక కార్యమునఁ బ్రయోజనములను రెండిఁటిని సాధించెను. కావ్యము మొత్తముమీఁద మోక్షవిచారమును వ్యంజితమొనర్చుటయొకటి, కావ్యకథాంతర్భూతమగు మమత పాత్రమునుగూడ మోక్షవిచార సాధనముగాఁ జిత్రించుట మరొక్కటి. పర్యవసానమునఁ దులసినివాపప్రవస్థునిగాఁజిత్రించి కవి కృతకృత్యుఁడయ్యెనుఁ

కాంతాసమ్మితమగు నీ : కావ్యమునందు 'రసము'ను గూర్చి కొంత తెలుపవలసి యున్నది. 'రసో వైసః' అను శ్రుత్యర్థప్రతిపాదితమగు రసముగాఁ గావ్యరసము నాలంకారికులన్వయించిరి. ఈ సమన్వయ మభిమానమూలకము. రసము విగళిత వేద్యాంతరమే కావచ్చును. "ఎందేడెందముగందళించు రహిచేనే కాగ్రితన్ నిర్వృతిం జెందున్' అని పెద్దన ఈరసము నూఁతగాఁగొని యే ప్రవరునిబరీక్షించెను. సహజపూర్ణరసోఽస్మి సోఽహమ్" అని యలకారవేత్త లింద ద్వైతమును సూచించిరి. ఇదంతయు తత్వవేత్త దృష్టిలో నకించిత్కరము. ఈ మాటలకతఁడు చలింపఁడు. ఇది తాత్కాలిక సుఖలేశమే కాని శాశ్వతముగాదని యతఁడెఱుంగును. 'సద్యఃపరనిర్వృతయే.' (అప్పటికప్పటికి మాత్రమే యానందముకలిగించునది కావ్యము) అనుమాటలోని 'సద్యః' అను పదమునాతఁడు క్షణక్షణమునుసంధానించును. అతఁడేధీరుఁడు. అధీరత్వముతోఁడనే —

'చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁదేనియల్' అని యాంధ్రకవియపితామహుఁడీ యానందమును ద్రోసిరాజనెను. పెద్దన యిట్లునిరసించుట దేశకాలపాత్రాదులకనుగుణమై, సిద్ధాంతముగాఁ బ్రస్తుతముకావచ్చును; కాని యీ యర్థమునకే యిక్కవి

" చెకిముకిరాఁతను గల్గు శిఖకణముల వెలుఁగుతిరంబె? కృత్రిమయశః సతఁడా
చెకిముకి సాయమునను దీ
పిక వెలిగించి సుఖియించు వీతలముండ్రె"

అనియొక సవరణమును బ్రతిపాదించెను.

'తుచ్ఛసుఖముల్ మీ సాల ప్రేదేనియల్ చెప్పకుడీ యని పెద్దన, పరసౌఖ్యాచ౦బన మాల్య వేదనములు సంభావింప భావ్యంబగున్' అనిమనకవి, ఇట్లు వీరిరువురకు 'తాతామనుమల వరుస' కిది ఘట్టము. చెకుముకిరాతి నిప్పుకణములు పడును. అట్లే సంసారికిం దాత్కాలిక సుఖలేశము లంటును. ఆరంభ మాయుగములో న విశాశ్వతములు గాననియే కప తెల్పను కాని చెకుముకి సాయమునసే దీపము వెలిగించి పెతతము వైనట్లె. తాత్కాలిక సుఖలేశము గల వనితా చందనాదుల యనుభవమున శాశ్వతమగు నాత్మానంద రసము ననుభవగమ్యమగునట్లు రుచిచూచి ముముక్షువగునినియు, నపుడాతఁడు వీతతముఁడు (తమోగుణరహితుఁడు) అగుననియు, కావునఁ గ్రమము క్తిని గోరువానికి గార్హస్థ్యముపకరణమే కాని యుపకారము కాద నియు కవి సిద్ధాంతముచేసి గెలుపొందెను.

ఈ విషయము నే—

> సరస శృంగారరస సుధా సరసిఁ దేల్చి
> భేదభావము హరియించి విశ్వమెల్ల
> మఱవఁ జేయుచు వెతలెల్ల మాపనోపు
> తరుణిలేకున్న నరున కీశ్వరుఁడుగలఁడె?
> పటముకపటంబు బోఁద్రోచి బఁధురమగు
> బాహుబంధంబునను సర్వబంధము క్తి
> ననదృశంబగు లీలమై పొసఁగఁ జేయు
> తరుణి ...............గలఁడె?

ఆరురుక్షుండు దిగజారిక క్రమమున
నున్నతంబగు స్థానంబు నొందుపొంటె
గాలిబందంబుగా నోపుఁ గాంతయరయ
దరుణి.....................గలడె?
పాలలీలను జిత్తంబు భవమహాగ్ని
నుడుకఁ గైవల్య నవనీత మొందభువిని
ఆకుదియెత్తోడు వాస్తవ మరసిచూడ
దరుణి.....................గలడె?.........

అను పద్యములలో సమర్థించుట గాననగును. సంసార విష వృక్షమున కమృతతుల్యములగు ఫలములు రుచిచూచుట యన నిదియే. 'మమతాహంభావ స్తంభసంభవాద్భుతరూపా,' యనుటలోని రహస్యమే యిమిడెను. కాని యీ లౌకికానందమాత్రము బ్రహ్మానంద సాధనమని పలికి యూరకున్నచో, కేవలైహిక విషయోపభోగముల కున్నతస్థాన మిచ్చినట్లేయగును. అదియెంచి పర్యవసానమున దానిని గూడ త్రోసిరాజని, యభ్యాసి గురుకృపాకటాక్ష పాత్రుఁడగునని సిద్ధాంతము చేయుటలోఁ గవి యేమరుపాటుఁ జెంద లేదు. 'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్' అను వానప్రస్థాశ్రమ స్వీకార వైభవమునకు వలయు పునాది యిడుటలో కవినిపుణముగాఁ బ్రవర్తించెను.

'కాలిబందంబుగానోపుఁ గాంతయరయ' అనుతులసి వాక్యమును.

"ఆరురుక్షున కరయనీవన్నయట్లు
కాలిబందంబె యగునుపకారినిజము

బండమిఱుకొని క్రిందనే ప్రాకులాడ
నమగుసాగునె పడఁడె యాజడుఁడు చెడఁడె"

అని మమతమాటలఁ బూర్వపక్ష మొనర్చెను. మఱియు

"కైవల్య నవనీత మొందుపొంకు
ఆడుదియెతోడు" అనితులసియు,
"తోడు బెట్టినమాత్రాన దుగ్ధమందు
వెన్నఁబడయుంగవచ్చునె యెన్నఁడైన?
నిశ్చలంబుగ క్షీరంబు నిలుపవలయు
నాథ! యటుపైన గురుమథనంబువలయు"

అనిమమతయుగాఁవించిన పూర్వపక్షసిద్ధాంతములు యోగి జనహృదయంగమములు. ఇట నిక్షిప్తమైన 'భావ' మద్భుతము. ఇట్లుతులసివాక్యములయందు గార్హస్థ్య ధర్మమును, మోక్షసాధనముగా నిరూపించి, మమతగార్హస్థ్య ధర్మమునందే విశ్రమించుట మోక్షసాధనముగాదని 'గురుమథనంబు వలయునని' శ్లేషచమత్కృతితో సయుక్తికముగా 'బల్కించి' క్రమముక్తిసాధించుటలో విహంగ మార్గము ప్రమాదకరమనియు' నందులకు గురుచరణసమాశ్రయణము, వేదాంత తత్వవిచారము ముఖ్యములనియు తోఁపింపఁజేసి, తులసియొక్క వానప్రస్థాశ్రమాధికారమును వ్యంగ్యరూపముగా బోధించెను. తులసియొక్క తురీయాశ్రమ వైభవమును భవిష్యత్కథాపథమునఁ జిత్రింపనెంచి యందులకు బీజముగా గురుమథనంబువలయునని యిటమమత

సూక్ష్మలనిక్షిప్తమొనర్చుట గమనార్హము. ఈగురుమథనము ముందుభాగమున జరుగును. అపుడు కైవల్యనవనీతముపుట్టును. అపుడు. తులసితోఁబాటు భావుకులురసాస్వాదన మొనర్తురు. అపుడు వారమరు లగుదురు.

"అంభోజాక్షుఁడు మమతా
హంభావ స్తంభమందు నగపడును"

ఇక్కావ్యమునందలి ప్రధానవ్యంగ్యార్థము లివియ. అవాంతర వాక్యార్థములఁ బెక్కుచోట్ల వ్యంగ్యసంపదయిరవు కొనికవిని నిసర్గ సంస్కారిఁగారూపింపఁజాలియున్నది. విస్తరభీతినింతట సంక్షేపింపవలసె.

కావ్యమునఁ గథావస్తువు రసపాకశయ్యాదులు ముఖ్యములు. కావున నిందయ్యై విషయములఁగూడ స్థాలీపులాకముగానిరూపించి నా విమర్శనమునకు సమగ్రతను సంపాదించెదఁగాక.

నిసర్గకవికలంకారాది సామగ్రిసంస్కారలభ్యము. అభ్యాసమున నించించుక సాధింపఁజూచిన నది కృత్రిమముగానే గోచరించును. కామశాస్త్రపఠనమాత్రమునఁ గళానుభవము కాని యట్లు, కేవల శాస్త్రులు కవితాచిత్ర మలంకారపాత్రము నొనర్ప న్నాత్రపడిననది స్తుతిపాత్రముగాదు. అతని వాఙ్మయ ప్రవాహమున నవి నిసర్గ సుందరగమనమున దమంతవచ్చి యిరవుకొనవలయును. అప్పుడే యీ చిత్రమును జూచి "కిమివహి మధురాణాం మండనం నా కృతీనామ్" యని రసికుఁడు తన్మయుఁడగును. అవి యమత్సరులగు సూక్ష్మపరీక్షకులకే గోచరించును. అట్టి భావుకలబ్ధియు కవియదృష్టమే. అప్పు డిరువురును సంభావ్యులే.

"ఏకః పూర్వ్యతే కనకముపల
స్తత్పరీక్షాక్షమో న్యః।
కశ్చిద్వాచాం రచయితుమలం
శ్రోతుమేవాఽపర స్తామ్॥"

కథావస్తువు- తులసిదాసునుగూర్చి భక్తవిజయమున నొక గాథ వినవచ్చుచున్నది. ఆకథాచ్ఛాయ మాత్రగాఁగొని, రస పోషకములగు మరికొన్ని సంఘటనములను గూర్చుకొని కవి కవితారథమును నడిపించెను. ప్రసిద్ధుఁడగు నాయకుని గొని, యితివృత్తమును రసానుగుణముగా మార్చి పెంచి తగ్గించి, కావ్యము వ్రాయవచ్చునని లాక్షణికు లంగీకరించియే యున్నారు.

వర్ణనములు——కావ్యమున నష్టాదశవర్ణను లుండవలయు ననుట మొదలుగాఁ గొన్ని నియమములున్నవి. ఇందుఁ బదు నెనిమిది వర్ణనములును గానరావు. అందుచే దీని కావ్యత కొఱవడదు. కావ్యలక్ష్మికి వ్యంగ్యము ప్రధానమగుటచే తత్సహ కారి సామాగ్రికి వర్ణనములు ప్రధానములనుట శాస్త్రకర్తల హృదయముగాని యన్ని వర్ణనములు పూర్తిగానుండి తీర వలయునని కాదు

"వీనిలో నెవ్వియేని లోపించినంతఁ
జెడదు కావ్యం బుపాత్తముల్ చేవగలిగి
కావ్యహృదయజ్ఞతా విచక్షణులమదికి
సంతసంబు నొసంగఁగఁ జాలునేని"

—ఆంధ్రకావ్యాదర్శము.

గ్రంథము ప్రాచీన ప్రబంధలక్షణముల జాడ నేనడచి నను, నేటివారాక్షేపించు ప్రత్యంగశృంగార వర్ణనములకుఁ దావు గల్పింపని కతన నవనాగరికులనుగూడ యాకర్షించునని తోఁచెడిని.

రసములు—ఇందు శాంతము ప్రధానరసము. శృంగార, హాస్య, కరుణ, అద్భుతరసములంగములై, పరిపుష్టములైనవి. తులసికి సామాన్య నాయికాయోగమున శృంగారము గోచరించినను నది మమతా శృంగారరసపరిపోషమున కంతరాయముగా నుండుటచేఁదుదకాభాసమైనది. వియుక్తులగు మమతకును తులసీదాసునకును పునస్సంయోగప్రసక్తికలుగుటలో శృంగార రసరూపము సహృదయహృదయావర్జకమైనది. ఇవన్నియుఁ దుదకు మమతా నిరాకరణచరణములగు మమతాచతుర వచన రచనలలో జాలువారిన శాంతరసమున కంగములై కథాబీజమునఁజిందెడు శాంతరసస్థాయీభావమునకుఁ బరిపోషకములై యలరారుచున్నవి. వీరము, భయానకము భీభత్సము, రౌద్రము, ననురసములు ప్రధానరసపోషకములు కాకమీఁదు మిక్కిలి తద్వ్యంజకములగుటకవి వానికిందుఁదావు గల్పింకపోవుట వింతగాదు.

అలంకారములు:— శబ్దాలంకారములు: ఇక్కావ్యమున ననుప్రాసము విరివిగా గోచరించుచున్నది. నైసర్గికమగు పోకడయే యింపుఁగలదు. ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము 121 పుటలో 49–51 పద్యములు.

అర్థాలంకారములు— ఉపమ (2ఆ–82) దృష్టాంతము (2 ఆ – 85) ఉపమాలాంకారధ్వని (3 ఆ– 65) అప్ర

స్తుతప్రశంస (2 ఆ- 102) వక్రోక్తి (2 ఆ- 109 జాతీయ శ్లేష (3 ఆ-88) శ్లేషానుప్రాణిత మర్థాంతర న్యాసము (3 ఆ-114) పరిణామము 3 ఆ- 134.

వృత్తి: శృంగారకరుణముల కుపయుక్తముగ మధ్యమ కైశికియు హాస్యశాంతాద్భుత రసముల కుపయుక్తముగ భారతీవృత్తియు నిందు గోచరించుచున్నవి. సార్వత్రికముగాఁ బాంచాలి- వైదర్భిరీతు లిందు గోచరించును. పాక-శయ్యాదులు రసోచితముగా నున్నవి. ఏదియేనా యొక్క పాకమే సమగ్రముగఁ బోషింపఁబడెననుట సాహిత్యవేత్తలకు శక్యము కాదు. రసోచితములగు పాకాదులయ్యెడల భావుకులకు రుచిగొల్పుచునే యున్నవి.

గుణములు—ఇవి గ్రంథము మొత్తముమీఁద హృదయంగమములై యున్నవి. లక్ష్య లక్షణ సమన్వయమున విస్తృతియగు ననని దిఙ్మాత్రముగా సూచించుచున్నాను. భావుకులయ్యె పద్యములను దప్పక గమనింతురుగాక! ఓజస్సు, (1ఆ-2వ) అర్థవ్యక్తి, 1ఆ6వ ఊర్జితము 1ఆ-20 శ్లేషగాంభీర్యాది గుణములు 2 ఆ11వ. గాంభీర్యము 2-38, 3-9 ప్రసాదము 2 ఆ 73. సౌక్ష్మ్యము 2-99 ప్రేయము 2 ఆ. 103. 2-105. ప్రౌఢి 2-120. రీతి 2-120. భావికము 3-3. చాటూక్తి 5-44. ప్రసాదమాధుర్యములు 2-5.

ప్రకృతి శోధనసాధనమగు విశేషదృష్టియొకటి కవి యైశ్వర్యము. దానననుభూతవిషయములను సమయోచితముగఁ గుకురు పఱచి, రసమూర్తినారాధించు వైదగ్ధ్య మాతనిది. అట్టి సంఘటనములు నిసర్గకవుల రచనలలో సానఁదీరి

యుండును. ఆముక్తమాల్యద, పాండురంగమాహాత్మ్యము మొదలగు నుత్తమప్రబంధములనిట్టి కల్పనములు విరివిగా గోచరించును. లోకానుభవలబ్ధములగు నిట్టి భావరత్నములుకొన్ని యీగ్రంథమున నపూర్వవైభవమునఁ దేజరిల్లుచు గవిప్రతిభను బ్రదర్శింపజాలియున్నవి. దిఙ్మాత్రముగానిటనుదాహరించుచున్నాను.

గుణముప్రధానము- కులముగాదు. అనిసందర్భోచితముగ పలుకవలసి-

కస్తురియుఁబున్గు నాయమ్మృగమ్ములందు
బేరుకొనరాని నెలవులఁ బేరుకొనిన
గర్వ సేయుట రసికుల కర్వమగునె
గుణ గణముగల్గుచోఁగుల గణన మేల,

అని కూర్చుటలో భావసౌష్టవము, పేరుకొనరాని నెలవుల, యను జాతీయపదయోగము వ్యంగ్యమోహనమై యున్నది.

స్త్రీలకు సవతిపోరుకంటె దుస్సహమైనది లేదు. ఆదోనమును సహించుట మహాప్రతివ్రతధర్మము. అట్టి ధర్మనమన్వయముచే మమతపాత్రమును లోకోత్తరముగస్తుతిప్రాతమొనర్చుట కవికిఁదాత్పర్యము. అందులకు-

"పుణ్యగరిమను జంద్రు లావణ్యసుధను
దానెకోరి చకోరి యుద్ధతి వహింపఁ
బగవహించునె తొగకన్నె? పంకజారిఁ
గనులఁగాంచిన యంతనేకనదె ముదము"

అని మమత చేఁ బల్కించెను. ఈయుక్తియందలి యుప
మాన మనుపమానము. చంద్రులావణ్యసుధను గ్రోలుటలోఁ
దొరకన్నెకుఁ జకోరియు భాగస్వామియగు చున్నది. పైన
యాథార్థ్యమువహించుట (ఆకసమంటుట) మఱియొకటి. ఇన్ని
జూచియు దానియెడఁ దొరకన్నె పగఁగొనదఁట. సరికదా
నాయిక సందర్శనమాత్రముననే హర్షించునఁట ఇట్లనుటలోఁ
దొరకన్నె యెడధ్వనించు మాధుర్యమానందము నించుచున్నది.
"కనులఁ గాంచిన యంతనే" యనుచోఁ "కనులన్" యను
పదము తొలఁగించుటవసరము. 'ముఖము' కనదె యనుటలో
ముదమునకు మారుగ వికాసము అనుపదమిడ నధిక
సుందరమగునని తెలుపఁగోరెదను.

"దేవఁడవ్వలకు యినుఁ డుదాసీనుఁడగుచుఁ
గరము మెరయంగఁ దత్కరగ్రహణభాగ్య
గరిమ మోదింత్రు పద్మినీ కాంతలెల్ల
దక్షిణుండౌట తప్పునె దక్షునకిల"

అనియొక పద్యము కలదు. పతివ్రతకుఁ బతి యెడఁగల
చెడుగుకూడ మంచిగనే సమన్వయించును. అది యకృత్రిమము.
ఏకరససాధ్యము. ఆసమరసమున కాత్మతో నైక్యమొందిన
యోగివృత్తి కంటె మించిన పోలిక లేదు. అట్టి సామరస్యమునే
మమత పాత్రమునెడఁ బోషింపనెంచి కవియిందుఁ జూపినవనితన
ముగొప్పది. మమత తననాథుని వేశ్యాసహవాసమును దక్షిణనా
యకధర్మముగా నన్వయించుట యిందుఁ గానగును. అందులకుఁ
బద్మినీకాంతలు, ఇనునికరగ్రహణభాగ్యగరిమ మోదించుట

సాటిగాఁ గొనెను. పద్మినీకాంతలనుటలో, పద్మినీస్త్రీలయుని,
తామరలతనియు, ఇనుఁడనుటలో, నాయకుఁడు, సూర్యుఁడ
నియు శ్లేషింపఁజేయుట కవినైపుణ్యమునకుగుర్తు. అదిగాక
'ఉదాసీనుఁడగుచు' అనుటలో నొక చిత్రముగలదు. తుల్యో[illegible]
నేకత్రదక్షిణః, (అనేకనాయికలను సమానానురాగమున
రంజింపఁజేయువాఁడు దక్షిణుఁడు) లనులక్షణముంబట్టి ఉదా
సీనుఁడగుట, లాక్షణికముగాను. నాయికారంజకములగు హావ
భావాదులఁ గరంగింపవలయుఁగాని, తెల్లఁబోయిచూచుట
దక్షిణనాయకత్వమని పించుకొనదు. కావున 'ఉదాసీనుఁడ
గుచు' అనుటయుక్తముగాదని శంకించుట కవకాశము కలిగినది
సత్యమే; కాని యీయుదాసీనత రక్తినిచూపుటలోఁగాదు.
నాయికలు పలువురలో దేని కదియే ప్రియునిదనవలలోఁదగు
ల్లాగనఁ జేసికొనుటకై విశేషహావభావాదులు చూపగా నవి
చూచియు 'దేనఁదవులక' యొకేనాయిక యందత్యాసక్తుఁడు
గాక యుదాసీనుఁడై సమరసుఁడై యుండెననుట కవిహృదయ
మని సమర్థింపనగును. ఈయౌదాసీన్యమునరసికత ప్రసక్త
మగునేమో యని శంకింపకుండ, 'కరము మెఱయంగ' అని
వాడుటయు సరసమై మనసమర్థనమునకుఁ జాలియున్నది.
ఇదియిట్లుండె, ఉదాసీనుఁడు_ ఉద=ఉదకములయందు, ఆసీ
నుఁడు= ప్రతిబింబరూపము ఉన్నవాఁడు, ఇనుఁడు =
సూర్యుఁడు, అనియు, తత్కరగ్రహణ భాగ్య
గరిమను తత్కిరణప్రసార భాగ్యమున తత్పాణిగ్రహణ
భాగ్యగరిమను, పద్మినీకాంతలు మోదింతు, అనిరెండర్థములు
సద్భుతరీతిని సమన్వయించుచున్నవి. ఇటదేనియందును దవు

లకయను నర్థమాసించి, 'దేనఁదవులక' అనికవిప్రయోగిం చెను. కానియదియంత సువ్యక్తముగా లేదు. (దేనినేఁదవుల కినుఁడుదాసీనుఁడగుచు, ననుట సరి.

ఇట్టిఘట్టములను గల్పించుటలోఁ బరమార్థమునఁ దులసికిని మమతకును గల దాంపత్యధర్మమునందకృతిమ, ప్రేమరసమూర్తిని బ్రత్యక్షముసేయుట కవితాత్పర్యమనునది మరువరాని విషయము. అదిప్రకృతిపురుషులయైక్యమేయని కూడ వ్యంజితమైనట్లు తోఁచుతనే వాకొంటిని. అట్టి యైక్యసాధనకుఁ దులసియెడ వేశ్యాసహవాసాదులు వికార హేతువు లంతరాయములు. అట్టివియున్నను వికృతి నొంద కుండుట ధీరుల లక్షణముగదా! అట్టి ధీరత్వము గురువుల కుండును. మమతకు గురుస్థానము కవి యిచ్చినదే, అది

"తరుణులు స్తనజఘనములన్
గురుత్వము వహించుటొప్పగునుగానియిటన్
వరునకు గురువరు తెలుగునఁ
బరతత్త్వముబోదసేఁత భావ్యమె"

యని తులసి మమత నపహసించుటలో వ్యక్తము. ఇవి వేదనాసౌందర్యజ్ఞాన మాత్రమునఁ దృప్తుఁడగు కవికిఁ జేతనైన మాటలుగావు. అగాధవిజ్ఞాన విషయముల నిట్లతిసులభముగ నందించుటకు గంభీరమగు తత్త్వసమ న్వయదృష్టి కవికిఁ గావలయును. ఈ దృష్టితోఁ దిలకించి నపుడే—

భూతకాలంబు మదిఁదలపోయఁగాల
భుజగభూతంబై చుట్టుముట్టుకొనును;

ముందు వెన్క లఁతలఁపక పొందుటొప్పు
వర్తమానంబుతో నైక్యవర్తనంబు.

అను మాటలలోని యర్థ మమృతోపమానమై యమరత్వ సాధకముగాఁ జాలియున్నది. ప్రకృతిపురుష వివేకమూలమగు నీ భావమునే కవి,

ఉల్లిగడ్డఁజూపి యుపనిషద్గోప్యంబు
నెల్లఁదానఁజూపనెవ్వఁడోపె
నెవఁడు విశ్వమందు నెల్లెడఁబరతత్త్వ
మరయఁజాలెనట్టి గురునిగొల్తు

అని గురూపదేశస్మరణమున రహస్యముగా నిమిడ్చెను. ఈ యంశమే జీవయాత్రాదులందును వివరింపఁబడెను. ఈ ప్రకృతి పురుషుల వివేకమునఁగాని దృశ్యవిలయము గాదని యొకచోఁ గవి;

"మిథునమునఁగాక సాధ్యమే మీనవనయన
దృశ్యవిలయంబుసేసి సర్వ్ఫృతిని జెంద,
రెండుచేతులు గలియక యుండెనేని
కలుగునే చెలియ! లయసుఖంబు భువిని"

స్పష్టపఱచెను. 'దిక్కాలంబుల నెన్నక' దృక్కేశేషించి నట్టి ధీరవతంసులు లేరా? యనియు, సాంబా! దిక్కాలంబుల నెన్నక దృక్కే శేషించినట్టి ధీరులదిక్కే నీవుందువు అను నిక్కపుమాటలును,

దృశ్యమెందాకఁదోచు నవశ్యమతఁ
డనుక శాంభవి నభ్యసించిన నరుండు

దృశ్యఁగానిచ్చి శాంతిని నిక్కముగను
సాధుజనకల్పభూజ! విస్తార తేజ!

అని మఱి పెక్కు తావుల జీవసూత్రాదులును, నీ దృగ్దృశ్య వివేకమును వ్యాఖ్యానించుచున్నవి. ఇట్లు పోయినకొలఁదియు నుపనిషద్వాక్యార్థరత్నస్థగితమై యనవద్యమగు పద్య సోపాన పరంపర మనలను విజ్ఞానసౌధమునకుఁ గొంపోవఁజాలి యున్నది. అందందు దారిలోఁ గన్యాకుమారీస్తోత్రాది ఘట్టము లానందరససుధాసేచనమునఁ బాపవిమోచనములై యలరారుచున్నవి.

కవితాప్రవాహవేగమున నందందొండు రెండుదోసఁగులు దొరలు టస్వాభావికముగాదు. అవి సవరింపవలనుగానంత సూక్ష్మరూపములుగాఁ గవిని మోహపెట్టును. కానిసారగ్రాహులగు చదువరులు కవితాచిత్రము నేకాంతసుందరముగా గనుఁగొన నిచ్ఛగించినపు డవి యెదుట నే నటించును. అట్టివానిలో నొకటి,

సానులందునరుంధతీ సతినిభోలు
శీలవతులును గల్గరే?

అనునది. ఇట నశ్లీలదోషము వాటింపరాకున్నది. ఇట్లే

అబ్జబాంధవుసాహచర్యంబు నెఱపి,
మహిఁ బతివ్రతలకు నుపమాన మైన
ఛాయయే నాథుఁగనుఁబ్రాసి సంజవడిన
క్షుద్రదీపంబులను దగుల్కొనునయారె!

అనుపద్యమొకటిగలదు. పతివ్రతయని పేరొందిన దానియం

డును ధర్మలోపము గానవచ్చుచున్నదని సమర్థించు టకై కవి యీకల్పన మొనర్చెను. ఇందు ఛాయకు అభిసారికా నాయికాత్వము వర్ణించెను. అది చూచుటకుఁ జిత్రముగానేయున్నది. కానిమహాపతివ్రతల కుపమానమై, అబ్జబాంధవు సాహచర్యంబు నెరపు ఛాయ ఛాయాభిమాన దేవత; సంజవడిన క్షుద్రదీపంబులఁనుదగఁలొల్కొను ఛాయనీడ. ఇట్లారికముగా భేదము కనఁబడుచుండఁగా నా ఛాయయే క్షుద్రదీపంబులను దగఁలొల్కొనుననుట యెట్లు? అపుకలంకార లక్షణముపొసఁగదు. అట్లుగాక ఛాయయను నెడశబ్దమాత్ర ముగాగోచరించినయభేదమున కేత్పప్తివదుదమన్నను, 'మహా పతివ్రతలకు నుపమానమైన' యను విశేషణమద్భుతగఁలును. అది 'నీడ' యెడల నన్వయింపదు. అదిగాక ఛాయసూర్యుని భార్య; ఉపాస్యదేవత; అయ్యెడనిట్టికల్పన మాచితీదూరము. కావున నీపద్యమన్నివిధముల సవరణ మపేక్షించుచున్నది.

మొత్తముమీఁద నికావ్యముస్వతంత్రరచనమగుట, తత్త్వసమన్వయదృష్టికలిగియుండుట, యను రెండు ప్రధాన గుణములచే నాచంద్రికాకావ్యము సహృదయాకర్షక మగునని నావిశ్వాసము.

ఇరువదవశతాబ్దమున నిట్లు స్వతంత్రరచనారమణీయ మగు వినూత్నాలంకారమున భాషాయోష నలంకరింప సాహసంపడిన కవికి ధన్యవాదము లర్పించుచు నింతతో విర మించుచున్నాను.

విద్వాన్, కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు,
బెజవాడ, పురపాలకోన్నత పాఠశాల పండితుఁడు.

# పండితాభిప్రాయములు.



బ్రహ్మశ్రీ దంటు శ్రీనివాసశర్మ బి.యే. బి. యస్ గారిచే రచింపఁబడిన "తులసీదాసు చరిత్ర"మను గ్రంథరాజ మును పఠించి యమేయానంద మును నందితిని.

ఈ కృతియధునాతన కవివరుల ప్రాథమిక నిర్మితి యైయ్యు, సనాతనులగు పోతనాది కవిపుంగవుల లలిత కవితలతోఁ దులదూగుచున్నది. గురుకటాక్ష పరంపర నను కూరిన వారెంతటి మహిమాఢ్యులైన నగుదురు కదా! కనుడం కవితా సుమగంధమావంతయు నెఱుంగని వాల్మీకికి బ్రహ్మ నారద సరస్వతీ కటాక్షపరంపరచే నసమాన లావణ్యకవిత యగు ప్రాథమిక కవితాకన్యకకు జనకుఁడగు భాగ్యమబ్బ లేదా?

అటులనే ఈ శ్రీనివాస కవితిలకులకు బ్రహ్మస్వరూపు నమృతానంద నాథస్వాములవారు గురువులగుటను, ఉభయ కవితాధారేయులగు వైద్యరాజ సుబ్బావధానులు గారగ్ర జులగుటను, భారతీయువ తారమనదగు కవితిలక కాంచ నపల్లి కనకాంబగారు సారస్వత బీజప్రదాత్రి యగుటను, వీరి కవిత యమృతానంద సువర్ణ భారతి భాసురమై తేజ

రిల్లుచున్నది. ఈ విషయమును కవిగారు తమ కృతిలో "జ్ఞానబీజంబు నాగభూషణుడు నాకె" అను పద్యమున వెల్లడించి యున్నారు.

అసభ్య కవితా పరాగపటలములు చెలరేగుచున్న ఈ సమయాన నిట్టి పావనభావ బంధురమగు సచ్చరిత్రామృతమును వర్షించి, ఈకవిఘనులు త్రిలింగదేశమున కమూల్యభాగ్యమును సమకూర్చిరనుట అతిశయోక్తి గాదు. ఇంకను నిట్టి సత్కావ్యముల విరచించి సోదర సంఘమునకు, విజ్ఞానానందముల నందజేయుదురుగాక.

శ్రీ మహేశ్వర దేవతాయైనమః

(కవిసింహ కవీంద్రఘటా పంచానన నేత్యాది బిరుదాంకితులగు
బ్ర॥ శ్రీ॥ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారి
యభిప్రాయము)

బ్ర॥ శ్రీ॥ దంటు శ్రీనివాసులుగారికి

ఆశీః కుశలోపరి—మీరు తులసీదాసు పంపినారు.
అప్పటినుండిన్నీ నేను అనారోగ్యస్థితిలోనే వున్నాను. కాని
మీరు రెండేండ్లనాడు నాకు వినిపించి ఉన్నారు. అప్పుడే
అది చక్కని శైలిలో వున్నదని మీతో చెప్పి వున్నాను.
ఏమండిగాని నేనుకూర్చుండి ఏపనిన్నీ చూచుట లేదు. ఈస్థితి
లోనే అక్కడక్కడ చదివి చూచాను. మంచిగా రుచిం
చింది కవిత్వం ప్రస్తుతం ఆపిన ఆపుదల చాలాకాలం ఆపక
వెంటనే తరవాయి ప్రకటించండి. మీది విద్వద్వంశం మీతం
డ్రిగారు వైదిక లౌకికాలలో నిష్ణాతులు. మీ అన్నదమ్ములు
కూడా అందరు వారిపేరుకు వన్నె తెస్తున్నారు. సంతోషిస్తు
న్నాను. ఇంతే ఆశీర్వచనములు.

కడియం
10—4—38.

(Sd) చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి
శతావధాని.

శ్రీమత్పరదేవతాయై నమః.

# తొలిపలుకు.

---

ఆంధ్రవాఙ్మయమునకు శక్తికొలంది సేవఁజేయుచుఁ బరమార్థ తత్త్వబోధనామృతసారమును గ్రోలుచుఁ బరమ పవిత్రముగఁ గాలమును జీవయాత్రను గడుపుచున్న సుప్రసిద్ధ న్యాయవాదియు, మహాకవియునగు దంటు శ్రీనివాస శర్మగారీ పుణ్యగాధను ప్రబంధరూపమునఁ జక్కని కవితా గానముతో గానముఁజేసి లోకప్రఖ్యాతి నార్జించుచున్న శ్రీ తిరుమల శ్రీనివాస శ్రీలిఙ్గ మహావిద్యా పీఠమునకుఁ గానుకగ బెట్టి సాహిత్యలోకమున కందఁజేసిన పుణ్యపురుషులు. వీరి సారస్వత సేవాపరిణామము భక్తి, జ్ఞాన, వైరాగ్య ప్రబోధముల కాలవాలమై తత్త్వప్రధానమై యలరారుచున్నది. కవితాకళ లలితకళలయందగ్రస్థానము వహించుననియు, నయ్యది పురాకృతసుకృత తపఃఫలముచేగాని లభింపనేరదనియు విజ్ఞులెఱింగిన విషయమే. దైవదత్తముగ, నయ్యది లభ్యమై వేదవేదాంత బోధనామృతపూరితమై, భగవంతుని లీలావినోదములనుఁ జిత్రింపఁజాలినదై, మహాపుణ్యపురుషుల భగవద్భక్తుల శుభచారిత్రములను లోకాదర్శముగ నివ్వటిల్లజేయునదైయుండునేని మోక్షసాధకమగుననుటలో సందియము లేదు. అట్టి యనన్యభాగ్యము చక్కని గురూపదేశమున లభించును. ఇక్కవిగారు త్రిలింగ మహావిద్యాపీఠము

నకుఁ జేరినవారు. త్రిలింగ మహావిద్యాపీఠము సనాతన ధర్మ సూత్రములను, గీతావాక్యములను, వేదవేదాంత ప్రబోధ మును సర్వశాస్త్రరహస్యంబును, ఆర్యమత సిద్ధాంతములను సూక్ష్మదృష్టితో నెఱింగి సర్వసమర్థత్వమును గాంచుచున్న తత్త్వపీఠమని చెప్పనొప్పు "అమృతానందనాథస్వామి" వారనఁబడు బ్రహ్మశ్రీ పాలావఝ్ఝల నాగభూషణ మహాతప శ్శాలి యాపీఠమున కాదిపురుషుఁడన్న దని తత్త్వ సత్త్వ గుణ ప్రాశస్త్యమును చెప్పనేటికి.

ఇక్కవిగారీ గ్రంథమును నాధ్యాత్మికదృష్టితో రచించుటకును, నిందుఁగల భక్తిప్రబోధమునకును, సత్యవాక్ఛక్తిని వెల్లడించుటకును, మహాపురుషుని జీవితచారిత్రమునందుఁగల పరమార్థతత్త్వమును నిర్వచన మహాకావ్యముగ వ్రాయుటకును గల ముఖ్యకారణ మట్టి గురుమహానీయునిఁ గొల్చి చేర్చిన జ్ఞానభాగ్యమే.

గురుముఖమున నిహపర సాధకంబగు జ్ఞానసూత్ర మెఱింగిన వెనుక కవితారూపమున నయ్యది లోకమున వ్యాప్తిఁజేయ సంకల్పించి యీ మూలమునసైన జన్మజన్మములకును దీర్పరాని గురుఋణ మొకింతయైనను జెల్లుబెట్ట సంకల్పించి హంసవిజయ, జీవయాత్రానందామృతసార గ్రంథములను రచించి విజ్ఞానధన్యయనియు, బరమసాధ్వీమతల్లి యనియు నారీమణుల తలమానికంబయనియు, వాక్సిద్ధిఁగన్న పూతచరిత్రయనియు, విజ్ఞానలోకమునఁ బేరుగన్న కవితిలక కవితావిశారద, విద్వాన్ కనకమాంబగారియొద్ద సరస్వతీ మంత్రోపదేశమునుబొంది కవితారహస్యములను సంగ్రహించుటచే నిట్టికావ్యమును రచింపఁగలిగితినని కవిగారు వ్రాసి

కొన్న యీ దిగువ చాటుపద్యములే, సుధామాధురీభరితములై భక్తివిశ్వాస గుణప్రభావములును, ననర్గళ కవితాపాటవమును వెల్లడించి యుల్లము పల్లవింపఁజేయుచున్న వనువో నట్టి రసవద్వాగ్వైఖరిని వెదజల్లి యీ గ్రంథము లలితపదసంయుతంబై, ద్రాక్షాపాకమున మనోహరమగు శైలితో ధారాళమగు ధారతో నేర్పుకూర్పున నొప్పుచున్నదో రసజ్ఞులెఱుంగకపోరు.

కం. అక్షరమెఱుఁగనివారల
కక్షరతత్త్వంబు కరతలామలకముగా
సాక్షాత్కరింపఁజేసిన
దక్షున్ శ్రీకృష్ణగురునిఁ దలఁతున్ గొలుతున్. 1

శా॥ వధ్యుల్ గారుపితామహాదులనుచున్ వాపోవుశిష్యున్ జగ
న్మిథ్యాత్వంబెఱుఁగంగఁజేసి మదికిన్ ధీరత్వమున్ జొన్పి సా
రథ్యంబున్ బొనరించుమాధవుని విక్రాంతిన్ విడంబించు నా
రాధ్యున్ బన్నగభూషుసద్గుణసహస్రంబున్ భజింతున్ మదిన్. 2

కం. ఫణివార్థ స్ఫురణంబునఁ
బ్రణుతింగన్నట్టి కావ్యఘనుతులచేఁ బా
వనమైనచరితఁ గలమా
కనకాంబాదివ్యపదయుగంబు భజింతున్ 3

కం. సారస్వత బీజము ప్రియ
మారగనాయాత్మనాటి యాంధ్రకవులలో
గౌరవమే యమనాకున్
గూరిచెనా కనకమాంబఁ గొలుతున్ సతమున్. 4

చ॥ గురువరు దివ్యబోధనమకుంఠితగాంగఝుతీ సకాశమై
పరువులువారగాఁదన ప్రబంధనిబంధము లందు నాగి పా
మరజన మానసంబులనుమల్లగసంబును జాలువార్చు బం
ధురకవితావిశారదకు దోయిలియొగ్గి నమస్కరించెదన్.

బ్రహ్మసృష్టియందెట్టి పవిత్రతయు, నాకర్షణమును, నానందమును ప్రకృతి తత్త్వంబెఱింగిన తత్త్వజ్ఞులకు గోచరించునో యట్టి విజ్ఞానలావణ్యాతిశయ మీగ్రంథమునఁ బ్రతిఫలించు చున్నది.

ఇక్కవి జీవిక, కనుగుణ్యంబుగ నేర్పరచుకొనిన వృత్తికిని, జీవిత తరణోపాయమున కవలంబించి సాధించిన వృత్తికిని, హస్తిమశకాంతర భేదముగలదు. ఈ రెంటికిని సంబంధమెయ్యెడలఁ బొసఁగనే పొసఁగదు. కాని యిక్కవి మహాధీరుఁడుగనుకనే, శాంతి శమదమ సద్గుణ నికరంబులను దనస్వాధీనము న నుంచుకొనఁగల్గిన బలాఢ్యుఁడని ఈ గ్రంథరచనా సామర్థ్యమే చెప్పక చెప్పు, కవియందట్టిసత్త్వగుణము శోభిల్లని నాఁడు కవిత్వమట్టి గుణభూయిష్ఠమై యుండదు. కవి, బ్రహ్మస్వరూపుఁడు. కనుకనే ప్రకృతి చిత్రములను జిత్రముగఁ జిత్రించి విశ్వప్రేమచే బంధించి విశ్వమోహన మొనరింపఁగల సమర్థుఁడు. అట్టినిరుపమాన నైపుణ్యమీకవియందు నీకవిత్వంబునందు విరాజిల్లుచున్నదనియు, గ్రంథము సర్వజనప్రియమై మోక్షసాధకంబై, శాశ్వతానంద సౌఖ్యప్రదమై, వేయేల సమస్తమానవులకు జ్ఞానోపదేశముచేయఁ జాలినదై భూచంద్రార్కము వెలయఁగల నుత్తము గ్రంథమని నిరూ

పించుటకుఁ గొన్ని చక్కని కవితా చమత్కృతులతోఁ జిత్రిం
చిన భాగములను విశదీకరింతు.

కవితన్మయుఁడై కొన్ని యెడల విశ్వమును మఱచియుఁ
గొన్ని యెడలఁదన్నుఁ దామఱచియు, మఱికొన్ని యెడల
సర్వమును మఱచియుఁ బరమేశ్వర తన్మయతంగాంచుట
గోచరించు.

కం. భగవద్భక్తుల భజనమె
భగవంతుని భజనమగును భావింపంగా
భగవద్భక్తుల చరితలు
భగవంతుని చరితలగుటఁ బన్నగశయనా?

యనుపద్యముతోఁ బ్రారంభింపఁబడిన యీకృతి సుకృతిభూష
ణముకదా.

కావ్యము ఆగ్రాపుర వర్ణనముతోడను, నాఁటికిని నేటి
కిని తనమతములవారికేగాక యన్యమతస్థులకుఁ గూడ చిరస్మర
ణీయుఁడై ప్రియుఁడై, పరమపావన చరిత్రుఁడై వెలసిన అక్బరు
చక్రవర్తి రాజ్యరమా విభవముతోడను ప్రారంభమగుట,
శుభసూచకమగుటయేకాక, పాఠకులకు గ్రంథప్రారంభమున
నుత్సాహమును నాహ్లాదమును డెందమున హత్తి ముందునకు
లాగికొని పోవుచున్నది. కావ్యారంభ మాకర్ణనీయముగ
నుండుటలో కవిహృదయ మెట్టిదో తెలిసికొనుటకును నాతని
భావగాంభీర్యముల ముక్కలు పెట్టుచు నానందరసమును
గోలికవివలెఁ దన్మయుఁడై భగవంతుని లీలావినోదంబులను
నేఱుపఱుచుటకును నవకాశముకలుగును. ఉత్తమ తరగతికిఁ జేరు
కావ్యములన్నియు నిట్టులే శ్రావ్యములుగ నుండును.

"శ్రీరామాంఘ్రిసరోజచింతన సుధాసేవావిలోలుండును.

"అఖిలాగమాంత విదుండాత్మ త్రాణ పారీణుండాత్మా
రాముండు"ను. నగు బ్రహ్మకుల భూషితుండట్టి ధర్మప్రభువు
నకుందోడు నీడవలె మంత్రిగనుండుటయును బాదుషాకు
బ్రహ్మవిజ్ఞానమును గూడఁ దెలుపుచుండుననియుఁ జెప్పుటలో
నెట్టివింతయు లేదని చెప్పుటకుఁ గాబోలు నిక్కవి

"నిక్కమైనట్టి జిజ్ఞాస నెలవు కొనిన
జాతిమత భేదమెంతురే జ్ఞానివరులు"

అని సర్వసమత్వమును హృదయంగమముగఁ జెప్పి
సత్యవాక్స్ఫూర్తిని చాటిన ప్రేమమయుఁడని తెలియుచున్నది.
మనకథానాయకుండగు తులసీదాసుఁడాత్మారామరత్నాంబి
కాపుణ్యదంపతుల నోములపంటయై జనించిన లీలామానుష
విగ్రహుఁడే. తనయునకాత్మోపదేశము చిన్నతనాననుండియు
నుపదేశించి తనవలె బ్రహ్మజ్ఞానిగఁ జేయవలయునని సంక
ల్పించి మాయాపహారియగు హరియొక్కరుండే సత్యపదార్థ
మని తెలిసికొనునట్లు నిరూపింపనెంచి రాజయోగముచే నాత్మ
స్వరూపమును నెఱుగంగఁ బోధించె. రాజధర్మమెఱింగిన
మానవులకిలనసాధ్యం బొకండును లేదు. ఈ తత్త్వోపదేశమే
యికావ్యమునకుఁ బీజప్రాయము. ఈతత్త్వోపదేశ మొక్క
తులసీదాసుని కొరకుఁగాక లోకమంతకు నిదియే యాధార
మనియు, భవసాగరమును దాటుటకిదియే చక్కని నావయని
యు తెలుపవలయునన్న గొప్పయుద్దేశము మనమునదిడుకొని
సమస్తపామర జనములకు సులభంబుగ బోధపడునట్లాత్మ

రాముని ముఖమున నిక్కువి చక్కనికథ నొకఁడుగల్పించె. శాంతగుణమే ప్రతిమానవునకుఁ బెట్టని భూషణరాజమనియు, నరిషడ్వర్గమును జయించి జగమంతయుఁ దన స్వాధీనములో నుంచుకొనుటకిదియే ప్రధాన గుణరాజమనియు నిక్కుథాసం దర్భమునఁ గడు నాకర్షణీయముగఁ జిత్రించిన కవిసామర్థ్య ముగణనీయము. "సాగరముకంటె గొప్పది శాంతియనుచు" నుడివె, ఆమహావాక్యమొక ఋషిప్రోక్తవాక్యమువలె రామ రక్షగ సకలసంపత్తులు నీయఁజాలునని చెప్పి యొకతాళ పత్రి మును లిఖించి కుమారునకిచ్చుట దానినతఁడొక రాజున కిచ్చుట, రాజుదానిని తన కత్తిలోనిముడ్చుట కారణాంతర మున దైవమాయచే నిజభార్యయందు దోషముకలదని రాజు చంపఁబోవుటయు, నంతలో గత్తినుండి శాంతిపత్రము జారుట తన్మూలమునదాను. సంకల్పించిన ఘోరకార్యమునుండి విర మించుట, భార్యనిర్దోషియని మంత్రి తనసహజనైపుణ్యముచే నిరూపించుట. తాళపత్రికా మహిమమును గొనియాడుట, సీతాసతివలె రాజుభార్య యగ్నిపరీక్షకాగి తన పవిత్రతను వెల్లడించుకొనుట మొదలగు చక్కని విషయములతోఁగూడి కథను తులసీదాసునకు బోధించి శాంతిగుణ ప్రభావమును జాటిచెప్పె. ఈకథలో రాజసేవాధర్మమెట్టిదో, సచివునకుండ వలసిన గుణమెట్టిదో, పాతివ్రత్యమననెట్టిదో, మనకుఁదెలియ వచ్చెడిని. ఇన్నిగంభీర భావములతో నేర్చికూర్చిన కథ కవికౌ లము తద్దయు సంశ్లాఘ్యమనిచాటెడిని అనంతరమున నాత్మా రాముఁడు తనమంత్రిత్వపదవిని కుమారున కప్పగించి పుణ్య తీర్థసేవాఫలము నార్జింపనేగె. తులసీదాసుఁడు ప్రవరాఖ్యుని

ఎలెఁ బావన చరితుండై లోకులు తన్ను మెచ్చునట్లు సంచరించు చుండె. ఒకనాఁడా రాజసభయందు నగరాజకుమారి యను వేశ్యనృత్యము చేయుటచూచి దాని కళానైపుణ్యమునకు, దానిగానమాధుర్యమునకు పరవశుఁడై క్షణములోఁ దన దేహమును ధర్మమును మఱచి మోహాపరశుఁడై.

"కాసునకాసఁజేసి తనకాయము నద్దెలకిచ్చువారకాం తాసహవాసమే తులసిదాసుఁడు భాగ్యమటంచు నెంచి"

సఖ్యమున్ రోసికృశించుచుండె. చివరకు విధిప్రేరణమున నగరాజ కుమారికి తులసీదాసుఁడు దాసుఁడయ్యె. తన సర్వస్వమునుగాను కఁగఁబెట్టె. జననీహితబోధకుఁ బెడచెవిఁ బెట్టె భార్యపై నేవముఁబుట్టె. కులబలాచార ధర్మంబులు మంటఁబెట్టె. సతీత్వముగన్న సతికి పతిపై నెట్టివేళలయందును మారుతలంపుండదుగదా!

"గుణసాగరలుండరె వారకాంతలన్" అని యెట్లో తనమనంబున కించుక సమాధానము చెప్పికొని ధీరస్వాంతయై "పతిచర్యల రోయక" "సుతుని యవలక్షణముల కింతయుఁ గృశించు నత్తగారికి వారకాంతయగు గండకీ వృత్తాంతమును బూసగ్రుచ్చినయట్లు నచ్చఁజెప్పె వేశ్యయయ్యు నొక దీక్షా సూత్రముచే బంధింపఁబడి గండకి తన పాతివ్రత్యమును నిలబెట్టుకొనుట హరిహరాదులు మాయరూపములు దాల్చివచ్చి నను తన్నెంతగా వలచినను తన దృఢవ్రతమును వదలక వారి కఠినపరీక్షల కాగుట, త్రిమూర్తులచే వరముఁ గొంట.

కం. సాలగ్రామము నేనై
గ్రాలుదు నీగర్భమందు గండానదవ! యీ

లేలగా నీపుత్రుండనై
చాలగ నీసచ్చరిత్రి చాటెదమహిలో॥

నని హరి సాక్షాత్కరించి చెప్పుట మొదలగు వృత్తాంతమం తయుఁ బాతివ్రత్యమహిమ యిట్టిదని చెప్పదలఁచి కవి తులసీ దాసుని భార్యాముఖమున నీయితివృత్తమును గల్పించె. దీని మూలమున దులసీదాసుని భార్యకుఁగల నోరిమియు, సతీత్వ మును లోకమున కాదర్శముగ నుండెడిని.

అటఁ దులసీదాసుని తండ్రి పుణ్యనదీనదంబులం గ్రుంకులిడి పుణ్యక్షేత్రరాజముల సందర్శించి యాసేతుహిమా చలము తిరిగి యాయాస్థలమాహాత్మ్యమును గ్రహించి ప్రకృతి సందర్శనోత్సాహమునఁ దన్మయుఁడై దేవదేవుల మహిమాతి శయములను నోరూర నోరార,

౬౦. వ్యాపారాపారమహా
కూపారమునందుమున్గి కుందగ కయుండకన్
దేపైతరిమించకమున్
గాపాడుము దరినిజేర్చి గౌరీనాథా!

యని స్తోత్రముచేసి యిలుచేరె. ఒడలు పులకరించు నీ భక్తి స్తోత్రగీతములఁజూడ మనకవియగు శ్రీనివాసుఁడాత్మారాముఁ డయ్యెనేమోయని తలఁపునకు రాకమానదు. క్రమముగఁ గుమారుని దుశ్చారిత్రమంతయు నెఱింగె. తులసీదాసుఁడు తాను గావించుచున్న యకార్యమునకు సిగ్గుజెందె తండ్రి మొగమును జూడనోడి యెడమొగము పెడమొగము బెట్టు చున్నను గన్నకుమారుని మిన్నగ నాదరించి "పుత్రమోహా మెంత ముమ్మరంబో" యను వాక్యమునకు ప్రథమలక్ష్యమై తాఁ

డయ్యె. “నీకెక్కడదొంక కాఁడినిగ్రహామకటా” యని నయమునఁ బ్రియమున భయమున ననేకవిధముల సుమారుని బుజ్జగించె, “భోగులకీవిరాగమునచ్చునా? రామావ్యామోహ నిమగ్నమానసులకు వైరాగ్యమబ్బునా? వేదాంతబోధము మూర్ఖునకుఁ దలకెక్కునా?

కం. చెడఁగొట్టెడివాఁడొకఁడును
జెడిపోవు వాఁడొక్కరుండు శివ శివ! తలపన్
జెడఁగొట్టినఁ బడఁగొట్టిన
గడతేర్చిన సఖలమునకు గర్తవునీవే.

అను తత్త్వమెఱింగిన మున రామపదభక్తుండగు నాత్మారాముఁడిట్టి భవసాగర దుఃఖవిషయములకుఁ దన నిర్మల చిత్తమును గలఁతఁబెట్టుకొని పాడొనరింపనోల్లక మెల్లగ గృహముఁదాటి యానందవననివాసముఁ జేయనరిగె. తులసీదాసు తనకు తన తండ్రిపోరు తీరెనని చెలరేగె. నిజప్రాణసతినిరంతర దీనాలాపమైనను దులసీదాసుని కఠినచిత్తమును గరఁగించి మరలింపజాలనిదయ్యె. “రుచింతురే కులసతుల్ వారాంగనా భోక్తృకున్” యను మహాకవివాక్కు లీతనియెడ నిజమయ్యె.

ఇప్పట్టున కంసాలి రుద్రకవి ప్రణీతంబైన, నిరంకుశోపాఖ్యానాంతర్గత కథాసందర్భము దీనింబోలుకథ యగుటం జేసి జ్ఞప్తికివచ్చెడిని. ప్రేమపెంపునఁ దండ్రియిచ్చిన నవరత్నహారముగూడ “నీవేకొమ్ము ప్రాణేశ్వరీ” యని మనసారదనివిఁదీర సంబోధించి యారామామణీ కంఠహారముగఁ జేసి “త్రిదశపదంబునందినగతిఁ గడునుబ్బె” కామలోలునకు

ప్రపంచమంతయు గామాకృతిగనే కనుపించును. మంచి, చెడ్డగను-చెడ్డ మంచిగను కన్పించుటయునుగూడ గలదు. "తన సర్వస్వము ధారవోసి యిటు భృత్యప్రాయుఁడై కొల్చినన్" వనజాతేక్షణ వానికన్నొక్కఁగి విశ్వాసంబులేక" చరించుటలో నాశ్చర్యమేమి? కనుకనే "భోగినిపోకతిన్న నగుఁ బెంద్రైనన్ గనన్ వచ్చునే" యని మాయామోహపాశబద్ధమగు లోకమునకొక నీతిపాఠముగా కవి బోధించినాడు. ఈ బోధ తులసీదాసు తన యనుభవముచేఁ దెలిసికొనినవాఁడై పురాకృత సముపార్జిత బ్రహ్మజ్ఞాన శేషముచేఁ గన్గొని తన నిజధర్మ స్వరూపమును స్మృతికి దెచ్చుకొని,

కం॥ పెడచెవి బెట్టితి గురువుల
సుడుపుల నిల్లాలిమెడద నొగిలించితి సి
చెడిపకులో నైపడితిన్
జెడితిని నేరెంటనకట చింతింపంగన్.

అని ధృతిఁదూలి వలవల నేడ్చి యింకేమొగంబుతో నిజప్రాణసఖిని జూచు భాగ్య మొదవం గలదనియు, నిందనుకఁ గన్గప్పి సంచరించిన తనప్రవర్తనముపై నాప్త బంధుజనంబుల కెట్లు నమ్మిక ముదయింపగలదనియు, దనమూలమునగదా భూలోక దైవతంబులనంబడు తన జననీజనకులకు నార్పఁ దీర్పగరాని శోకాగ్ని దెందంబునఁ బ్రజ్వలించెననియు.

గీ॥ ఎందుముసిమెద నెవ్వరి నేమనియెద
సిగ్గు పోనాడి మదిగల చింతయెల్ల
నున్నదున్నట్లు చెప్పకొ నొప్పుకొన్న
దప్పు క్షమియింపఁగల మహోదారుఁడేడి.

యనియు నేమియుం దోఁచక దిక్కులఁ జూచుచు, గటగటం బడుచుఁ జేయునది లేక యెట్టకేలకు ధైర్యంబుఁ జిక్కఁబట్టుకొని

కం॥ క్షమియింపుమనుచు నే దీ
నముగా నోరు వేడ నేల! నయ మొప్పంగా
క్షమియింపుము రమియింపుము
మమతా నీవాఁడనన్న మానిని వినదే.

యనియు.

కం॥ పశ్చాత్తాపముగల్గి వి
పశ్చితులకు నాప్తులొద్ద బల్కుటయే ప్రా
యశ్చిత్తమనుచు నెఱుఁగుము
నిశ్చయముగ ధర్మ సూక్ష్మ నిర్ణయమిదియే.

యని తొలుదొలుత తనతండ్రి బోధించిన వాక్యంబులు తన మనోనిశ్చయంబునకు మఱికొంత బలంబునీయఁ దన కాంతామణిని గూడ నిశ్చయించుకొనిన వాఁడయ్యె.

అగ్నిసాక్షిగ వివాహము చేసికొనిన భార్యాభర్తల కన్యోన్యానురాగ మేనాఁడును నెట్టి సంయోగ వియోగ విపద్ఘటములయందును దరుగనిది ప్రేమ పదార్థముగదా: స్త్రీ హృదయము సహజముగ నవశిరీషకుసుమమువలె కోమలమై మృదువైయుండు. అందు పతివ్రతయగు తనభార్య తన తప్పులను సైచి యాదరింపకపోవునాయను దృఢసంకల్పముగూడ తులసీదాసుని హృదయమునకుఁ దట్టె. భర్తపై భార్యకుండు బాధ్యత మరెవ్వరికిఁ దుండు. భర్తకు భార్యపైనుండు ప్రేమాతిశయమును, జనువును, స్వాతంత్ర్యమును మరెవ్వరిపైనుండును.

ఆ యీ నమ్మకమే తులసీదాసుని గృహాభిముఖుంబునకు ముం దంజ వేయం బురికొల్పె.

కం॥ మును జేసిన యపరాధం
బున కిదె నిష్కృతియటన్న బోధిమనంతస్,
దన హాస్తపద్మములన
వ్వనితామణి పాదపల్లవంబులం బట్టన్॥

జేసె. అంతలో సౌదామినీలతవలె మెఱయు

"సాధ్వీరాయెడిలోన మమతాయటంచు వ్రాలివిసంజ్ఞం డయ్యె"

ఇట॥ "ఒండురులంగూర్చు సతియు నాథుంకుగలియ,
జగముతోంచునె కైవల్యమగు" గాక.

యని యొక ప్రేమ ఘంటానాదంబు కవివాక్కునుండి వెడలుట కావ్యమునకు నూతన వికాసమును గల్పించి కావ్యము శుభాంతముగ ముగియునట్లుచేయుట యొక సంతోషకరమగు వార్త. ఇంతలో మమతతల్లి వచ్చి మమతకు

"కం॥ పతికింగూరుచు బంధు
ప్రతతిని మిత్రాళి నుచితవైఖరి నెపుడు
న్నతి సేసి ప్రీతిగొల్వుము
పతివశ్యంబగుట కిదె యుపాయముతల్లీ."

యని పతివ్రతాధర్మం బుపదేశించె. ఈ సందర్భమునం జెప్పం బడిన పద్యభాగమెల్ల నుద్యోగపర్వాంతర్గతమగు సత్యభామా ద్రౌపదీ సంవాదమునందలి పద్యభాగముతో నిం మనించు భావగాంభీర్యమునందును, పాత్రౌచిత్యమునందును, పదలాలిత్యమునందును సరివచ్చు ననవచ్చు ననురీతిగ, చిత్రింపంబడిన

దని చెప్పుట సాహసోక్తిగాదు భగవత్కరుణాకటాక్షవీక్షణ దీక్షితులు తమయందు ప్రసరింపుచుండుటం జేసి యీ పుణ్యదంపతులు "పోక బోడెనెనసి యల్లుకొనియెడు నాగవల్లిబోలె" కలసి మెలసి రాగ రసమూర్తి మెఱయం గవితాగానమునం బ్రకాశించి సుఖముగనుండిరి. కవితారసాస్వాదన నిపుణులగు పుణ్యదంపతుల కిదియె పెట్టనిసొమ్ము.

కం. ఎన్నమనోహారిణియగు
వన్నెలమిన్న తన వెంటనమరినగాదే
వన్నెయొసంగును గవితకు
దిన్నని సంగీతమునకుం దెన్నుఘటించున్ ॥

అని చాటిన కవివాక్యములయందలి యథార్థ మనుభవైకవేద్యము. తులసిమమతాసంభాషణము, తత్త్వరూపమున వెలువరించుటలో గవి యాశయము కావ్యప్రశస్త్యమునుం దెల్పుచున్నది. కవిసామర్థ్యమన్నిరసములయందు నొకేతీరున మనోహరముగ దొలుకాడుటయును భాగ్యవిశేషమే. కాంతతన్ను విడచి పుట్టింటికేగినవార్త విని విరహవేదన సహింపలేక, వెనువెంటనేగి. "తరుణి లేకున్న నరునకీశ్వరుండు గలండె?"

యని ప్రణయకలహారహస్యమంతయు విప్పిచెప్పె. ఈ తత్త్వవాక్యములతో గ్రంథము ముగిసె. తులసీదాసుని తదనంతర పవిత్ర జీవితమునకీ యమృతవాక్యములే దోహదములయ్యె. ఇంతటిలో నశాశ్వతంబగు భౌతికశరీర వ్యామోహమంతయు నాతనికి నంతరించె. అంత తులసీదాసుండు శ్రీనివాసుడయ్యె. ఈ కావ్యము శృంగారరసప్రధానమైనను నియతి . . కావ్య

వాలమై జ్ఞానమునకు మూలకందమై, వైరాగ్యమునకు మార్గదర్శమై భక్తికి నెలవై యొప్పుచున్నదనుట నిర్వివాదాంశము.

ఈ కను త్తరార్ధమున తులసీదాసుని భక్తివైరాగ్యము పేర్కొనుచుండగా మన శ్రీనివాసకవిగారు పరమపోతన్నయను బిరుదమున కెంతమాత్రము దీసిపోవని వైఖరి పాఠకుల డెందంబు కరగించు చందాన గ్రంథము నడపించగలరని యీ క్రిందనుదాహరింపబడిన యుత్తర భాగములోని పద్యముల ధోరణియే చెప్పుచున్నది.

క॥ స్మరలీలాసౌఖ్యంబుల
స్మరణము రానీకు నాకు స్మరహరయింకన్
స్మరణా స్మృక్తియ నెడుభవ
హరమగు వాక్యార్థబోధమర్థింతుసదా॥

క॥ మానినులందలప కేయను
మానసము రానీకనిరభిమానవ్రతినై
మానసమందిరము న రా
మా! నీపదపద్మయుగము మానక కొలుతున్॥

శా॥ రామా! మారవినోదలంపటుడనై రామాపరీరంభమే
భూమానంద దమంచు నెంచి మదివ్యామోహంబునుం
బెంచిసు
త్రామాదిత్రిది వేశపూజిత భవత్పాదాంబుజధ్యానమా
ధ్వీమాధుర్యము గుర్తెఱుంగనయితిన్ దేవేశమన్నింపవే

ఉ॥ కైతయొకింత నేర్చి నిజకైతవ మంతయుఁ గప్పిపుచ్చియా
రీతినినీతిమార్గమురరీకృతమయ్యెనటంచు నేర్పుమై

సీతఁడువల్కు నోయనియుపేక్షయొనర్పకురామచంద్ర! నా
చేతమునీకుఁ గైవసము చేసితి జీల్చి పరీక్ష చేయుమీ॥

ఉ॥ గానుగఁద్రిప్పనట్టి తిఁఘూతకు నెద్దువితానగమ్యమున్
గానఁగలేక యింతదనుకన్ భ్రమియించితి రొప్పవచ్చెనా
చె నికగాదు నీకు సిదెచేతులు మోడ్చి నమస్కరింతురా
మానుజ! నందగోవ్రజమునందు రహిఁ నను జేర్చి
కావుమీ॥

ఉ॥ అక్షికి పక్ష్మలంబటులహర్నిశమున్ననుభక్తిగొల్చున
స్వక్షుఁడు లక్ష్మణుండతనివై ఖరిసాధ్యమెనాకునీకృపా
వీక్షణమబ్బినన్ భరతువీక భజించెద నయ్యపాదుకా
దీక్షనొనంగ వేవసుమతీతనయాహృదయాధినాయకా

సీ॥ దశరథుండయ్యె నిన్నుఁ సీతండ్రిసీరథు
జేసిరాకాసి మూఁకలఁ జెనకబంపె
నామనోరథమిత్తురా రామ! రార!
యధివసింపుము ధశకంఠునణచి వైవ॥

శా॥ సాకేతాధిపపాదపద్మమధుకోశంబైన వాల్మీకిక
స్తోకాలంబమొసంగి సంయమిజనస్తోమంబు సేవింపను
శ్లోకత్వంబునుగాంచి నారహహ! ముల్లోకంబులన్
మీరుప
శ్మకోత్తఁసములార! తెల్పరొకో సౌమిత్ర్యగ్రజస్థాన
ముల్

సీ॥ వేణురూపముదాల్చి గోపీసనాథు
ధనువుచంధముంనొంది కోదండరాము

సతతము భజించి నట్టివంశంబు మీది
వంశమా! రాముఁడెంమన్న వాఁడె చెపుమ॥

రమణీయార్థ ప్రతిపాదకమును రసాత్మకమును పద లాలిత్యమును, నర్థగౌరవమును, నలంకారచమత్కారమును, రసానుభవసామ్రాజ్యమందఁ జేయఁజాలు చక్కని యుపమానములును, సూచించి నిరతిశయానంద సంధాయకమగు నిట్టి రసవత్కావ్యమును రచించిన కవి యెంతయు ధన్యుఁడు, కల్పనాకౌశలమున వెనుబడక నింత సరసముగ నిట్టి యక్షరధారతో సర్వజనామోదముగాఁ గావ్యము వ్రాయువారరుదు. "పుణ్యశ్లోకస్యచరితం ఉదాహరణ విర్ద్వతిః" యను ప్రతాపరుద్రీయవాక్యమందు లక్ష్యముంచి యిట్టి యుత్తమ చరితము వ్రాసి కవిలోకమున కందఁజేసిన మనకవిగారి ధీరత్వము గొప్పది.

"గీ॥ జ్ఞానబీజంబు నాగభూషణుఁడునాటె
శాఖగాఁబెంచె పెద్దన్న శ్రద్ధమెఱయ
నరికనకాంబచేసె దోహదముదాన
ఫలముగంటిని నాజన్మ ఫలమదంటి"

యని వ్రాసికొనిన కవిగీతమే, వారి ప్రజ్ఞావైభవములకుసాక్షి. వంశమా విద్వద్వంశము. తాతతండ్రులా నిఖిలవేద వేదాంత కోవిదులు. జ్ఞానబీజమా నాగభూషణకృపావలోకనము పోషణమా, వైద్యలోకమునఁ గవిలోకమున నుతిగన్న వీరి పెద్దన్నగారగు సుబ్బావధానిగారి హస్తప్రావీణ్యము, దోహదమా, కనకమాంబికాకృపాకటాక్షము కావ్యవస్తువా, సర్వజనాభిలాష సమాపాదకమగు భక్త తులసీదాస చరిత్రము. కృతిపతియా.

లోకావనసమర్థుండగు శ్రీ వేంకటేశ్వరుఁడు. ప్రాయదలపెట్టు శ్రీనివాసచిత్రమా, భక్తిరసపరిపోషిత సరోజపేశలము, అభివృద్ధిహేతువా, త్రిలింగమహావిద్యాపీఠము. ఇఁకఁ గావ్యము శ్రావ్యముగ నుండకపోవునా, ఇంతటిమహావైభవము కవిగారి పూర్వపుణ్య ఫలమున లభించె.

ఇతోఽధికభక్తిరస కావ్యము లనేకము లిట్లే రచింను సామర్థ్యమునుత్సాహము చిరాయురున్నతశ్రీల నిచ్చి భగవానుఁడు మన కవిగారిని సర్వదా రక్షించుగాతయని ప్రార్థించుచు నిట్టి యుత్కృష్టకావ్యమునకు తొలిపలుకు వ్రాయు భాగ్యమును, నవకాశమును నాకుఁ గలుగఁ జేసినందులకు కృతజ్ఞతాశీర్వాదమును గవితారూపమున గానుకగాఁ బెట్టి విరమించుచున్నాను.

కం॥ శ్రీతులసీదాసుని ప్ర
ఖ్యాత మహాతత్వమెల్ల నద్భుతకవితా
చాతుర్య ప్రతిభఁదెలుపు
రీతిన్ వ్రాసితిగదయ్య కృతకృత్యుఁడవై.

చ॥ కలమును జేతఁబూని కవికాండము తద్దయు మెచ్చురీతి స
ల్లలితపదార్థ సౌరభ విలాస వికాస మనోజ్ఞభావముల్
నలుదెసలంటురీతి పదిలంబుగ వ్రాసెదు నేర్పుతీర్పు నీ
కలవడె నాపరాత్పర మహామహిమాదరణంబునన్ సఖా!

ముద్దులుమూటఁగట్టు రసమున్ గురిపించుచుఁదర్కవ్రాతలన్
వద్దనిరద్దుసేయఁగల షక్కిని తీయదనంపుమాటలన్
దిద్దుచుఁదీర్చుచున్ మిగులఁ దేజముఁగాంచగఁదే నతేటలో
నద్దుచునుంటి వాకలము నాదర మొప్పఁగఁ జెప్పుమో కవీ!

వినవింపైరమణీయమైసు కవితావేశంబునై యర్థగుం
భనమై భక్తులకెల్ల కల్పకమునై భవ్యంబునైజాహ్నవీ
ఘనవేగప్రతిమానమై లలితమై కన్పట్టు నీ కావ్యమో
యనఘా! శ్రీయుత శ్రీనివాస! కవిచంద్రా! కీర్తిధారేయమై.

॥ శ్రీలావణ్య విలాసవైభవగుణశ్రీలన్ ప్రకాశించు స
త్యాలోలాక్షి యురుక్మిణీసతియు నిత్యానందమున్ గొల్వ న
వ్వేళన్ సత్కరుణాకటాక్షతతులన్ వేడ్కన్ బిసాళించు గో
పాలస్వామి చిరాయురున్నతులచే బాలించు నిన్నెప్పుడున్.

ఇట్లు
బుధజననిధేయుడు

కొల్లాపురం
జటప్రోలుసంస్థానము
15—12—37.

వాజపేయయాజుల
రామసుబ్బారాయుడు
బి. ఏ. బి. ఇడ్.,
స్నేహలతాకవితాసంఘాధ్యక్షుడు.



శ్రీ

# శ్రీ తులసీదాస చరిత్రము

## ప్రథమాశ్వాసము



నాథా! గురునాథా!
నానా కల్యాణ గుణసనాథా! వ్రజకాం
తానాథ! విశ్వనాథా!
మానీంద్ర హృదబ్జనాథ! మాయానాథా!

చం॥ కరివరదా! భవార్తిహర! కంజదళేక్షణ! శ్రీనివాస! ము
ష్కర దనుజాదినాథ బలగర్వవినాశక! భక్తభక్త! శ్రీ
కర! కరుణాలవాల! కలికల్మష ఖండన! నాగభూషణా!
హరిహర ధాతృరూప! యభయప్రద! శాశ్వత! వేంకటేశ్వరా!

కం॥ నిమిషంబేమఱకయెనీ
విమలాంఘ్రి సరోజయుగము వీక్షించుచుని
ర్మముఁడౌ నీభక్తుని పరి
తమిషమునం జెప్పువాఁడఁ దచ్చరితంబున్.

కం॥ భగవద్భక్తుల భజనము
భగవంతుని భజనమగును భావింపంగా
భగవద్భక్తుల చరితలు
భగవంతుని చరితలగుటఁ బన్నగశయనా॥

కం॥ హృత్కమల మందు నిన్నెపు
డుత్కంఠను దలఁచి కొలిచి యుష్మత్కథలన్।
సత్కవుల తెరువుఁబట్టి చ
మత్కృతి మత్కృతినిఁ దెల్పి మహిఁగృతి నగుదున్॥

ఆ॥ సుకవినికరమునకు జోహారులర్పించి
కుకవిజనులఁ బేరుకొనక విడిచి
శౌరి! నీకు నిత్తుసహృదయ మధువంబు
లలరఁగావ్యమసఁగనలరు దండ॥

గీ॥ భక్తిరసహీన శుష్కవాక్ప్రౌఢివలనఁ
గవుల జామోదగరిమంబు గలుగునట్లు
వట్టివడగాలి తాఁకునవట్టివేళ్ళఁ
బుట్టునే తావి రసపరిపుష్టిగాక॥

కం॥సారాసార విచారము
భారతి, వ్యర్థప్రపంచ వాంఛావిరతిన్
శౌరి భజించెదనా మన
సారఁగ భారతిని సరసిజాసను రాణిన్॥

కం॥ఏకరదనుఁ గొల్తునెపుడు
లోకవశీకరణు నాత్మలోన సుకవితా
ప్రాకట సింహాసనమున
శేకర శేకరముల నభిషిక్తుం జేయున్॥

గీ॥ ఆయువారంబునను జీవయాత్రఁ గడపు
వాఁడునిఁ బార్వతి వరియించినటులుసాధు
జనుల పంచల విజ్ఞాన శకలములను
ఏఱుకొనువానినన్ వరియించెఁగవిత ॥
గీ॥ అచ్యుతునిచేత భూషితుఁడయ్యె నెవ్వఁ
డెవఁడు భూషణమైయొప్పు నిందుధరున
కట్టి నాగేశ్వరుని భక్తినభినుతింతుఁ
జిత్తమందున నెపుడు వాక్సిద్ధిఁగోరి॥
కం॥ పరమేష్ఠిగురుని మల్లా
దిరామశాస్త్రి బరమగురుధీరున్ నాగే
శ్వరుఁగోరాడన్వయహిమ
కరు గురువరు నాగభూషుఁ గరమర్చింతున్ ॥
సీ॥ బాలులీలను శిష్యజాలంబుతో వేడ్కఁ
గ్రీడించు గోపాలకృష్ణమూర్తిఁ
బ్రీతిమై శ్రితజన వ్రాతంబు కోరకే
వాంఛలొసఁగు శ్రీనివాసమూర్తి
విమత పాషండాది భేదవాదంబులఁ
జీల్చి చెండాడు నృసింహమూర్తి
కపట భక్తుల యహంకారంబుఁ ద్రొక్కించి
పాఱఁదోలెడు వీరభద్రమూర్తి
గీ॥ సకల దైవతమయమూర్తి సాధుకీర్తి
నవరసస్ఫూర్తి సచ్చిదానంద మూర్తి
సర్వసమవర్తి బుధలోక చక్రవర్తి
పుణ్యమూర్తిని నాగురుమూర్తిఁదలఁతు ॥

కం॥ ఏషణ శోషణములును మ
నీషాజనకములుఁదత్త్వనిష్ఠులకున్ సం
తోషణములు శ్రీవిద్యా
పోషణములు నాగభూష బుధ భూషణముల్॥

కం॥ శీధువును మించఁగల్గెడు
మాధుర్యముతోడ వెలసి మమతనహంతన్।
శోధించి నాగభూషణు
బోధము స్వాస్థ్యంబునిడు, ముముక్షులకెల్లన్॥

కం॥ ఉపమాన సహస్రములని
రుపమంబగు శైలిలీల నుపనిషదర్థం
బుపదేశించి ముముక్షుల
కపవర్గమొసంగు ప్రోడయహి భూషణుఁడే

ఆ॥ ఉల్లిగడ్డఁజూపి యుపనిషద్గోప్యంబు
నెల్లఁదానఁజూప నెవ్వఁడోపె
నెవఁడు విశ్వమందు నెల్లెడఁబరతత్త్వ
మరయఁజాలె నట్టిగురునిఁగొల్తు॥

గీ॥ కాంచినట్టివియెల్లను గాంచనముగఁ
జేయఁజాలిన యారససిద్ధు నటులు
గన్నదెల్లను బ్రహ్మంబుగాఁగఁదెల్పు
సముఁడు తత్త్వఘనుండు నిర్మముఁడు గురుఁడు॥

ఆ॥ తాత తండ్రులెంత దాఁచియిచ్చిరయేని
స్పర్శవేధి కలిమి సాటియగునె
శాస్త్రసంచితంబు జ్ఞానమెంతైనను
స్వానుభూతి భూతికౌనె సాటి॥

ఆ॥ చేతఁగాని రీతిఁ జేతులుజోడించి
స్థాణువటులు గురుల దరినిఁగొలువఁ
దరిని తరుముకొని కదంబ కోరకముల
సరణి సకలసిద్ధు లరుగుదెంచు॥

ఆ॥ గురుఁడు శిష్యవరునిఁగరుణించుచందంబుఁ
దాఁచి కఠినునట్లు తోఁచుదొలుత
రాత్రిచరులఁజంప రాము గోరినమాని
సీత పెండ్లిమాటఁజెప్పడయ్యె॥

గీ॥ పర్ణములడాఁగుతీఁగ సంపంగిలీల
బ్రహ్మవేత్తలు జ్ఞాన సౌరభమునింత్రు
కానరాకుండ గూఢులై మానులగుచు
నేర్పు నోర్పునుగల్గు తన్నిష్ఠులెవరొ
వెదకి సాధింత్రు వారిఁదద్విదులుబుధులు॥

ఆ॥ చెంతనున్నఁ జాలుఁజింతలెల్లనుమాని
చేరఁదీసి గురుఁడె శిష్యునిఁదన
యంతవానిఁజేయుఁగాంత మాకర్షించి
తనదుశక్తి లోహమునకునీదె॥

గీ॥ అనుభవంబునఁ గాంచనియట్టి వట్టి
దంటమాటలు పల్కెడి దంటులెప్పు
డంబుజోదరుపదము సూదంటురాయి
నినుము చందానఁదన్మతి యెనయుచుంట॥

ఆ॥ న్యాయవాదివృత్తి కాయవారము మేలు
కలియుగమున నిజము కంజనాభ!

క్రోడమైన నీదు క్రీడను దలపోసి
బురదయనక యందె పొరలుచుందు॥

కం॥ కనకమున కంగలార్చుచుఁ
గనుకని జరియించునన్నుఁగని, కరము, మదిన్
గనికర మొసఁగఁగ నిన్నున్
గనకాంబర! చూపినాఁడు గనకాంబరహిన్॥

గీ॥ జ్ఞానబీజంబు నాఁగభూషణుఁడు నాటు
శాఖగాఁ బెంచెఁ బెద్దన్న శ్రద్ధ మెఱయ
నర్థిఁ గనకాంబ చేసె దోహదము దాన
ఫలముగంటిని నాజన్మ ఫలముదంటి॥

కం॥ బ్రహ్మీభూతుని పౌత్రుఁడ
బ్రహ్మవిదుసుతుఁడ నదృష్టవశమున సాక్షాత్
బ్రాహ్మీపరివస్యను నే
బ్రహ్మణ్యుఁడనైతి శ్రీశ! ఫణిభూషకృపన్॥

గీ॥ సత్యపథవర్తి సాహిత్యచక్రవర్తి
దర్పకోపమమూర్తి విస్తారకీర్తి
దాంతుఁడనఘుఁడు నిఖిలవేదాంతవిదుఁడు
జనకుఁడగు వేంకటప్పయ్యశాస్త్రి మాకు॥

కం॥ పుణ్యచరిత్ర పతివ్రత
పుణ్యకథాసక్త పూర్వపుణ్యోదితసా
ద్గుణ్య ప్రభావబంధు శ
రణ్యయు, దుర్గాంబయంబ రాజీ వాక్షా!

కం॥ అగ్రజులు నాకు బ్రహ్మవి
దగ్రేసరు లిద్దరాప్తుల లఘుమతులు నా

కగ్రాహ్య ధర్మసూక్ష్మము
నుగ్రహమునఁ దెలియఁబలుకు నుతచరితులిలన్॥

కం॥ బుధలోక మాన్యులును నవ
బృథ పరిపూతాత్మలార్య విద్యాకుశలుల్
విధిచోదిత పథవర్తులు
మధుసూదన! సూరివరులు మాతామహులై॥

గీ॥ వెలయుదురు వారిలోపల నలఘుమతులు
సూరిజనవంద్యుఁ డౌ రామసుబ్బశాస్త్రి
శ్రితజనావనరతుఁడు నృసింహశాస్త్రి
మాన్యులీయిద్దరును మేనమామలైరి॥

గీ॥ ఆత్మబోధంబుకొఱకు నహర్నిశంబు
భక్తవర్యుల చరితముల్ భావమునను
నిలిపికొనుటకు నిది మంచి నెఱయఁటన్న
యాప్తవాక్యంబు భక్తిమైనవధరించి
పల్కితిని తులసికథ ప్రబంధశైలి॥

## షష్ఠ్యంతములు.

కం॥ నిష్కపటహృదయ సదనా
నిష్కృతకల్యాణరూప విభవోన్నతికిన్
నిష్కలునకు నిష్క్రియునకు
నిష్కించనభక్తలోకనిధికిన్ విధికిన్॥

కం॥ జననమరణ రహితున కజ
జనకునకున్ దుష్టదనుజసంహారికి న

జ్జన రక్షాదీక్షితునకు
జనార్దనునకున్ విభునకు శార్ఙ్గధరునకున్॥
కం॥ సంకల్ప ప్రేరకునకు
శంకరమిత్రునకు భావజజనకునకు వ
ప్పంకజనాభునకహిప
ర్యంకునకచ్యుతునకుఁ గనకాంబరునకునున్॥
కం॥ సురవర సేవితునకు భూ
సురరూపున కాత్మ భక్తసురభికి హరికిన్
గరివరదున కరిగణ భీ
కరునకునజ్ఞానతిమిరకమలాప్తునకున్॥
కం॥ పురహర శరరూపునకు నృ
హరికిన్ లక్ష్మీమనోవిహారికి నింద్రా
వరజునకున్ గురురూపున
కరవిందాక్షునకును భువనాధారునకున్॥
గీ॥ విన్నపంబుగ బుధలోకవిశ్రుతుండు
భక్తిసామ్రాజ్యపద పట్టభద్రుఁడైన
తులసిదాసుని చరితమిటులను వినుతుఁ
జిత్తగింపుము దేవ! దాక్షిణ్యభావ॥!

# కథా ప్రారంభము.



కం॥ కాపురమై సిరులకు నల
కాపురిఁబురుడించి రత్నకాంచనమయసౌ
ధోపేతయగుచు భువినా
గ్రాపురివిలసిల్లు నగ్రగణ్యంబగుచున్॥ ౧

కం॥ పావన యమునాభంగ
ప్లావితకుట్టిమ పదములు స్వర్లోకధునీ
సౌవర్ణాంభోజవరా
గావిలవలభీస్థలంబులా పురిమేడల్॥ ౨

కం॥ వెలలేని మానికమ్ముల
నిలువెల్లన్ స్థగితమగుచు నింగినొరయుచున్
వెలయున్ దుర్గము శత్రునృ
పులు చేరఁగ నలవిగాని బురుజులతోడన్॥ ౩

గీ॥ భారతీయులమేటి శిల్పంబునొఱపు
నెఱపఁగా నింద్రనీలమణీ వికార
ములుగజంబులు దిగ్గజములొయనంగఁ
గోట తూరుపువాకిట నీటుఁగులుకు॥ ౪

కం॥ పురుహూతుని పురమునకున్
బురుడనఁదగు నాగ్రపురిని భూదేవులుడె
ప్పరములఁగుడుచుచు నకటా
పరతంత్రతఁ దేజమేది బ్రతుకుదురెటులో॥ ౫

గీ॥ యవనదౌరాత్మ్య మారుతాహతిననేక
భూసురప్రాంశు భూజముల్ ద్రుంగిపోవఁ
జిక్కినక్కడ కుబ్జకోశీరములటు
కొలఁది బాపలుమిగిలిరి గూఢవృత్తి॥

సీ॥ యజ్ఞోపవీతముల్ యవనులుగనకుండ
షేర్వాణి మేనఁగై సేయువారు
తురకలు బల్మిమై పెఱకకుండఁగజుట్టు
తురికీ కుళాయిలోఁ దుఱుముువారు
మొగలులకాతిథ్యము నొసంగనిండ్లలో
హుక్కను గుడిగుడి నుంచువారు
నుద్యోగములఁ గోరి యుర్దుభాషను నేర్చి
యులుపాలఁగొంపోయి యొసఁగువారు

గీ॥ నగుచునవ్వేటి భూసురులార్య వేష
భాషలను మాని వైదిక పథమువిడిరి
ఉండెనో లేదొ నూటికినొక్కరుండు
నిజకులోచిత ధర్మంబు నెఱపుద్విజుఁడు॥

కం॥ సామాగమ గానంబుల
నేమఱచుచుఁగోరాను పాడియుంపొదవంగా
నోమరుఖాయమఁ జదివిరి
భూమీసురులార్ష కావ్యములువలదంచున్॥

కం॥ సుక్షత్త్రియులై బహుసమ
రక్షత దృఢగాత్రులయ్యుఁ బ్రారబ్ధమునన్
రక్షింపుమనుచుఁ గటా! యవ
నక్షితిపతి భృత్యులైరి నగరపురాజుల్॥

కం॥ కులధర్మము వదలకజ
క్కులరాయని నిధులనైనఁ గొనఁగల్గిసిరిన్
దులఁదూగుచుంద్రదు పురివణి
జులుసంతత దానరతులు సుకృతముకలిమిన్॥ ౧౦

గీ॥ అగ్రవర్ణాల వారలేయవిధిఁ బడగఁ
బాదజులమాటవేఱ చెప్పంగనేల
మాననీయులు పురిపుసల్మానులగుటఁ
గడఁగి యెల్లరు వారికింకరులైరి॥ ౧౧

గీ॥ యవనపాషండులీగతి నార్వ సంప్ర
దాయములకెల్ల దాయలై తనరమాను
షాకభూపతియైన ప్రహ్లాదునటులు
యవన సింహాసనంబున నక్బరొప్పె॥ ౧౨

కం॥ శూరుఁడు ధీరోదాత్తుఁడు
సూరిజనవిధేయుఁడు పరిశుద్ధాత్ముఁడహం
కార విదూరుండక్బరు
భూరమణుఁడు శ్రేష్ఠతముఁడు మొగలునృపులలోన్॥ ౧౩

కం॥ నవ్వఁడు పరులమతములన
నెవ్వగమదిజెందఁడెట్టి నెగులుగలిగినన్
గ్రొవ్విన యపరాధులనే
నవ్వసుధాధిపుఁడు కరుణనరసిక్షమించున్॥ ౧౪

గీ॥ అరుణుఁడు దయించువేళ మధ్యాహ్నమందు
సాయమందున నడిరేయి జనవిభుండు
నిజమతోచితమైనట్టి నియమమునను
భువన కర్తకు భక్తిమై మ్రొక్కుచుంను ॥ ౧౫

గీ॥ చూడని వియన్ని యాపరంజ్యోతి కళలె
యంచు దీపంబులను, సూర్యు, నబ్జు, ననలు
భక్తిఁబూజించుచుండు నాప్రభువరుండు
దినదినమ్మొక్క ప్రొద్దుండు దీక్ష మెఱయ ॥ ౧౬

గీ॥ తనివితీరని జిజ్ఞాసజనవిభుండు
శ్రవణ మొనరించు నెపుడుసద్గ్రంథములను
కడఁగి నేర్పరులైన లేకరుల నేరి
ప్రతులు వ్రాయించు సద్గ్రంథ రాజికెల్ల ॥ ౧౭

గీ॥ భారతంబును శ్రీరామ భద్రుకథయు
నిషధ నాథుని చరితంబు నేర్పుమీఱఁ
బారసీ భాషవ్రాయించి పేరుగన్న
చిత్రకారులచే తరసి కవరుండు
తత్కథోచితమైన సందర్భములను
చిత్రపటములు వ్రాయించి చేర్చెనందు ॥ ౧౮

కం॥ నలుదెసలు కలియ వెదకిస
కలులను రావించియంతికమున సతతమున్
నిలుపుకొని వారిగోష్ఠిన్
దెలియున్ సకలంబు నతఁడు ధీచాతురిమై ॥ ౧౯

శా॥ శ్రీరామాంఘ్రి సరోజచింతన సుధాసేవా విలోలుండు స
త్కారుణ్యాంబుధి పాపదూరుఁడు మహాగంభీర చిత్తుండు నా
త్మారాముండఖిలాగమాంత విదుఁడార్తత్రాణపారీణుఁడా
త్మారాముఁడననొక్క విప్రవరుఁడయ్యాగ్రాపురిన్ భాసిలున్॥

సీ॥ ఆత్మయే బ్రహ్మవిష్ణ్వాది దేవతలెల్ల
నాత్మయే నిత్యమైనట్టి వస్తు

వాత్మ యే సత్యమానాత్మ యే తారక
మఖిలవిశ్వంబులు నాత్మమయము
లాత్మ యే బ్రహ్మ మానాత్మ యే మూలంబు
ప్రణవాది సర్వమంత్రములకెన్నఁ
దత్త్వమియ్యది దీనిదర్శింపఁగల్గిన
వారెగెల్చెద రహంకార, మద్ది

గీ॥ చచ్చినంగాని భవబంధజాలమూడ
దనుచు నెల్లప్పుడాతఁ డవ్యాజకరుణ
బోధసేయుచునుండు సమ్మోదమెసఁగఁ
గదిసియాచించు నట్టి జిజ్ఞాసువులకు॥ ౨౧

కం॥ ఆత్మారాములు గండీ
యాత్మేతరవస్తువింతయైనను లేదం
చాత్మజ్ఞానముఁ దెల్పుట
నాత్మారాముఁడతఁడ నఁగనవనిన్ బఱఁగున్॥ ౨౨

ఉ॥ ఆతని సత్ప్రవర్తనము నాతనిపాండితి సూక్ష్మబుద్ధియున్
జేతమునందు నారసి ప్రసిద్ధ మొగల్ ధరణీధవుండు ప్రే
మాతిశయంబునం బిలువ బంచి స్వరాజ్యమునందు మంత్రిగా
నీతివిశారదుండతఁడు నిల్పె బృహస్పతినింద్రుఁడు చాడ్పునన్॥

ఉ॥ లౌకికభోగవాంఛలనలంపటుఁడై మురవైరిపాద చిం
తాకలితాత్ముఁడయ్యును గతస్పృహుఁడయ్యును రాజ కార్య మెం
తో కుశలత్వ మొప్పనతఁడుత్సుకతన్ నెఱవేర్చుచుండు నే
గా! కరణీయకార్యములఁ గౌశలమే సుమి యోగమారయన్॥ ౨౪

గీ॥ తిఱుబడిగల్గినపుడెల్ల ధీయుతుండు
బ్రహ్మవిజ్ఞానమును దెల్పుఁ బాదుపాఁకు
నిక్కమైనట్టి జిజ్ఞాస నెలవుకొనిన
జాతిమతభేదమెంతు రే జ్ఞానివరులు॥ ౨౫

కం॥ జనకుఁడు రాజ్యంబట్టులు
జనవల్లభు దండనుండి సచివాగ్రణియై
జనపరిపాలనలీలన్
జనవంద్యుఁడతండు శాంతి సలుపుచునుండున్। ౨౬

కం॥ పాయక యెప్పుడు రత్నా
బాయి యనంబఱఁగు సాధ్వి వాల్లభ్యమునన్
దీయము పెంపై తనరెడు
తోయమునంగొలుచు భక్తితోడుత నతనిన్। ౨౭

ఉ॥ తారకమూర్తియైన వసుధాతన యాధవు పుణ్యగాథలం
గూరిచె నాదికావ్యమునఁ గోవిదుఁడెవ్వఁడతండె యీశ్వర
ప్రేరితుఁడౌచు భాగవతరీతులు దెల్పఁగఁబుణ్యదంపతుల్
వీరని రత్నగర్భమున లీల జనించెను నోమువంటయై॥ ౨౮

కం॥ రాముని మఱి మఱి యాత్మా
రాముఁడు స్తుతియించె సుతుని రాకేందుముఖున్
రామా జనమనసిజునభి
రాముంగనుఁగొనుచు మదిని రత్న చెలంగన్॥ ౨౯

కం॥ ఇచ్చెను గోభూ కనకము
లెచ్చుగ ధరణీ సురేంద్రులెంతయు మదిలో
మెచ్చఁగఁ, దులసీదాసని
యచ్చోఁ ఋతకునామకరణమ్మొలిఁ జేసెన్॥ ౩౦

గీ॥ శుక్లపక్షంబుచంద్రుని చొప్పుమెఱయు
దినదినంబును బాలుండు తేజరిల్లి
తల్లిదండ్రుల మనసు రంజిల్లుచుండ
వరుస నైదేండ్లప్రాయంబు వాఁడుగాఁగ॥ 30

కం॥ భవవరమై భవహరమై
భువినెయ్యెడ నుపాస్యమయ్యె మునివృషభులకా
శివపంచాక్షరిఁ జూపిసికి
నవితథముగఁ జేసి రక్షరాభ్యాసంబున్॥ 31

ఆ॥ తివిరి యోగసూత్రాలు దిద్దించునాఁడెద్ది
మాణవకుఁడు నేర్చె, మానులదియె
జపము సేయుచుంద్రు సంసారము క్రిక్కి
మొదలెతుదియు నిత్యపూర్ణమునకు॥ 33

గీ॥ అక్షర జ్ఞాన పూర్ణుఁడైనట్టి తండ్రి
యక్షరాభ్యాస మొనరించెనతనికిట్లు
తొలుతనాటిన బీజంబె మొలచి పెఱిగి
శాఖయై పుష్పఫలము లొసంగుఁగాదె॥ 34

కం॥ తులసీ దాసంతటని
స్తులమా విజ్ఞానగరిమతోడుత వేదం
బులును దదంగంబులునన
ఖిలమగునితి హాసచయముఁ గ్రీడన్ నేర్చెన్॥ 35

చం॥ అతని ప్రబోధచంద్రుఁడు పదారుకళల్ దనుఁజెందఁ
[బూర్ణుఁడై
యతులితలీల నొప్పెను పదారవయేటి కనంతరంబునన్
మతిఁదలపోసెఁ దండ్రియనమాన సురూప సుశీలసంపదు

న్నతి వెలుఁగొందునట్టి యొకనాతినిఁగూరిచి పెండ్లిసేయఁగన్

గీ॥ కులము గోత్రంబు గుణమును దెలియరాని
వింతపడుచుల కాసించి వెతలఁబడక
మేనమామ కొమారిత మేలఁటంచు
మమతయను కన్యకామణి మమతఁదెచ్చి
పరిణయముఁజేసె జనకుండు వైభవమున॥ ౩౭

గీ॥ ప్రతిదినంబును దనతోడ రాజసభకు
సుతుఁగొంపోయి లోకము వితముఁజూపి
చెంతనాసీను గావించి చెప్పుచుండు
రాజనీతి రహస్యంబులోజ నిటులు॥ ౩౮

ఉ॥ భామలచిత్తవృత్తులటు పార్థివచిత్తములోకు మూరకా!
ప్రేమముఁబైకిఁజూపిరని పీఁగుచునేమఱుపాటుఁ జెందియా
గాము లెఱుంగకుండ నధికంబుగనమ్మి చరించుటొచ్చెమౌఁ
బాములతోడఁజెల్మిసుమి,పార్థివ సఖ్యము లెంచిచూడఁగన్॥

కం॥ వాద ప్రతివాదంబుల
భేదము మదినరసిచూచి విజ్ఞతతోమ
ర్యాదా తిక్రమణము లే
కౌదార్యముతోడఁ దీర్పనౌ వాదంబుల్॥ ౪౦

కం॥ హితులైననహితులైనను
మతిలోపలఁ బక్షపాతమాలిన్యము లే
కతిశుద్ధబుద్ధి న్యాయం
బతులితగతిఁ జెప్పసచివుడాప్తుఁడు పతికిన్॥ ౪౧

గీ॥ ఉల్లమందునశాంతిఁ బూర్వోత్తరముల
నరసియధిపుఁడు తన్నడ్గునట్టిప్రశ్న

కు త్తరంబీయ నొప్పను త త్తరంబు
హానిఁదెచ్చును మంత్రికే నధిపునకు నొ॥ ౪౩

గీ॥ దయయు ధర్మంబు విడనాడి ధరణివిభుఁడు
ప్రజల కపకార వరుఁడౌచుఁ బఱఁగెనేని
యుచితరీతుల బోధించి సచివవరుఁడు
మంచితోవకు నతనిఁదే నెంచవలయు॥ ౪౪

చం॥ సచివుఁడనేను నాకెవరు సాటియటంచు మదంబు పెంచి నీ
చచయముఁజుట్టుఁ జేర్చుకొని సాధుల బాధలఁ బెట్టకుండఁ బా
పచకితుఁడౌచు న్యాయపరిపాలన చేసెడు మంత్రిసత్తముం
డుచిరముఁ గీర్తిగాంచుచుఁ గడుంబగమందునఁ బెంపుఁ
జెందెడున్॥ ౪౫

గీ॥ సాధుసేవయె సంసార సాగరమున
మునిఁగి తేలెడు గేస్తులౌ జనులకెందుఁ
బరమతారకమల్లాట భాగవతుల
స్థితిగతులు గనిపెట్టి పూజింపవలయు॥ ౪౬

గీ॥ అష్టగజములుగావు శేషాహిగాదు
భువనభారంబుఁదలపైన మోయుటరయ ౪౭
సాంద్రకాననములయందు జపము సేయు
తాపసియె నిల్పుధారణి ధర్మమెల్ల॥

గీ॥ దట్టమైనట్టి యడవి సుధర్మయగును
సౌధశోభితనగరంబు సంద్రమగును
సాధుజనము ల మహిత తేజంబువలన
వారినొప్పించి రాజులు బ్రతుకఁగలరె॥ ౪౮

కం॥ ఎన్ని గుణంబులు గల్గినఁ
బున్నెములెన్నెన్నొ చేసి పొగడితఁగన్నన్॥
సున్నయగునన్ని కన నో
యన్నా! యొక శాంతిలేని యాప్రెగ్గడకున్॥ ౪౮

సీ॥ శాంతియే సర్వార్థసాధకంబగు విన్మ
కలదు ప్రాక్తనమైనకథ యొకండు
వసుధలోపల మున్నవంతియన్ పురియందు
విప్రవర్యుఁడొకండు వెలయుచుండు
నాతండు గృహమేధి యయ్యును సతతంబు
నధ్యాత్మతత్త్వంబునందు నిలిచి
యచ్యుతంబైన బ్రహ్మానందమనుభవిం
చుచు నంత్యదశయందు సుతునిఁ జూచి

గీ॥ సాధుసేవయు నబ్జాక్షుచరణసేవ
పరమవైరాగ్యమును భవవార్ధి దాఁటఁ
బంచజనులకు నెంచ నుపాయములని
బోధసేసినఁ దెలియని మూఢుఁడతఁడు॥ ౪౯

ఉ॥ నాయన! నీవుపోయినను నాగతియేమగు నాకుఁ బెండిలిం
జేయునెవండు కానయినఁ జేర్చి యొసంగవయింక నెట్టులేఁ
జేయుదు జీవనంబనుచు సిగ్గరియగ్గలమైనరీతి వా
పోయెనుదండ్రియున్ సుతునిబుద్ధికొకించుకనవ్వి
యంతటన్ ౫౦

గీ॥ తాళపత్రంబుఁ దెప్పించి దానిపైన
సాగరముకంటె గొప్పది శాంతియనుచు

వ్రాసి కొనిపొమ్ము దీనిని రాజుకడకు
ధనమునతఁడిచ్చు నీ దరిద్రతయడంగ॥ ౫౧

కం॥ అని చెప్పి విప్రవర్యుఁడు
ఘనబోధము మదిని వెలయఁగా శాంతిం గై
కొనెఁ గైవల్యపదంబును
ధనసుతదారాదులందుదాసీనుండై॥ ౫౨

చం॥ జనకునియుత్తరక్రియలు సర్వముఁదా నెఱవేర్చియంతనా
తనయుఁడు తాటియాకుఁదనతండ్రిపచించినరీతి తేనికిన్
వినయముతోఁ బనీయఁగన్బ్రతినిఁ గైకొని దీని నెవ్వరో
ఘనులు లిఖించిరంచుఁ గడు గౌరవమొప్పఁగఁదాళపత్ర
ముల్॥ ౫౩

కం॥ తన కత్తియొఱనునిడుకొని
మనుజేశుఁడు విప్రబాలు మన్నించి తగన్
ధనమిచ్చి యనుప నాతఁడు
చనెజనకుని మెచ్చుకొనుచు సంతోషమునన్॥ ౫౪

కం॥ అంతట వేడుక నా భూ
కాంతుఁడు వేటాడఁజనియెఁ గానన సీమన్
శాంతాత్ములైన తాపస
సంతానమునొంచు జంతుసంతానములన్॥ ౫౫

సీ॥ వన్యమృగముల వెనుకొని పార్థివుండు
తఱుమఁ దఱుమంగఁ గానలోఁ దరణి గ్రుంకె
మర్లుమాతంగి మెట్టెనో మనుజవిభుఁడు
దారిఁదప్పుచుఁ గానలోఁ దారితడసె॥ ౫౬

గీ॥ రాజుతడసిన యవ్వేళ రాజశయన
మందిరంబున శయ్యనమరుచుచుండి
యచటి శృంగార వైభవమంతఁజూచి
చాకియొక్కఁడు మదిలోనఁజాలమెచ్చి॥ ౫౭

చం॥ జతనముతోడనిత్యమును చక్కఁగనీశయనీయమేనయా
యితమొనరింతురాజునకు నెన్నఁడెఱుంగనుదీనిపాయి నీ
యతలమునందుఁబైనతిణమైనను నామెయిఁజేర్చితీర్తు నా
కుతుకమటంచు నావెకలికొంకకపాన్పున మేను
వ్రాల్చినన్॥ ౫౮

గీ॥ మేనువ్రాల్చినయంతనే మింటికెగసి
నట్టులయ్యెనుబ్రాణము లంత,రాణి
తోనికేతెంచి మృగయావిలోలుఁడగుచు
తేఁడుశ్రమఁజెంది నిద్రించినాఁడటంచు॥ ౫౯

ఉ॥ పానుపుపైన నారజకుప్రక్కనె మెల్లన మేనువ్రాల్చి య
మ్మానిని లోనొకింత యనుమానము నూనక వానితోడనే
తానునునిద్రపోయెనటధాత్రిధవుండు నిశీధవేళకుం
గాననసీమనుండి యధికంబుగ డస్సి గృహం
బుఁజేరుచున్॥ ౬౦

ఉ॥ అంతిపురంబులోనికి రయంబున నంతట నేగి యాత్మనా
వంతయుశంకలేమె సుఖాశిశయంబున వింతవాని య
త్యంతికమందుఁ దాశయితయై తనరాణినాత్మపత్ని భూ
కాంతుఁడు చూచి యిర్వురను ఖడ్గమునం దెగవ్రేయ నెం
చుచున్॥ ౬౧

గీ॥ క్రోధఘూర్ణితనేత్రుఁడై కువలయేశుఁ
డసినిఁయొఱనుండి పెఱుకుచు నదయుఁడగుచు
నఱుకగమకించునంతలో నాటి తాటి
యాకు వ్రాలెను వింతగనతనిముందు॥ ౬౨

గీ॥ తాళపత్రంబునద్దాని ధరణిసురుఁడు
తనకునిచ్చిననాటియుదంతమంత
విస్మృతంబైన కతమున వేల్పులెవరొ
దీనిఁ బడవైచిరంచు భూజానిదాని॥ ౬౩

గీ॥ విస్మయంబున దీపంబువెలుఁగులోనఁ
జదువఁబోయెడు నంత నాగదివెలుపల
వేచియున్నట్టి సచివుండు వేగిరమునఁ
బఱచెలోనికి విభుని సంభ్రమముఁజూచి॥ ౬౪

గీ॥ మంత్రిరాకను గాంచి యమ్మనుజవిభుఁడు
చదువమానుచు రాణి దుశ్చరిత మెల్ల
బట్టబయలయ్యెఁదడసినఁ బరువుదక్క
దనుచు నఱుకంగ నసిదూయునవసరమున॥ ౬౫

చం॥ తటుకునమంత్రియడ్డమయి ధర్మముగాదిది రాజచంద్ర! నీ
విటులవిచారతక్ సతినహీన గుణాఢ్యనునిద్రలోననే
వటుకరవాలధారఁ దెగవైచెదె? తాళుమయీతఁడెవ్వఁడో
యటమట కాఁడురాజసతి యందొకదోసము లేదు చూడఁ
గన్॥ ౬౬

గీ॥ పరువునకు నీవు భూమీశ! పరువులెత్తి
చేయఁబోకుమకార్యంబు బోయచాయ

శాంతచిత్తుండవగుము రాజా! యటంచు
నతనిచేనున్న యాకుఁ దానందుకొనియె॥ ౬౭

గీ॥ సాగరముకన్న గొప్పది శాంతియనుచు
వ్రాసిరరయుము దీనిభావంబుమదిని
దైవయోగంబుసుమ్మ యీ తాళపత్ర
మిట్టియదనున నీకుఁ గన్పట్టుటెన్న॥ ౬౮

కం॥ ఇందలి యాథార్థ్యము నీ
కుందెలియఁగఁ జేయువాఁడ కువలయనాథా!
కొందలమందక యీ తెర
సందునఁగూర్చుండుమొక్క క్షణమని యట్లుపై॥ ౬౯

గీ॥ సచివ వర్యుండుచప్పటుల్ చఱవ రాజ్ఞ
మేలుకొని సిగ్గుఁ గోపంబు మేళవింప
నెంతపనిగల్గినను నిట్టులంతిపురికి
రాత్రివత్తురె మంత్రివర్యా! యటంచు॥ ౭౦

కం॥ మేలుముసుంగిడికొని యా
లోలేక్షణ సంభ్రమమున లోనికిఁజన భూ
పాలుఁడువచ్చెనె చెపుమా
చాలంబనిగలదటంచు సచివుఁడు వెంటన్॥ ౭౧

గీ॥ చనఁగఁగోపంబుగదుర నా సరసిజాక్షి
పనులుగలిగిన బరిచారజనులు లేరె
వారిఁబంపక మీర లేమేరమీఱి
చొరఁగదగునయ్యశయనమందిరమునందు॥ ౭౨

గీ॥ మించిపోయెఁడు పనియున్న మేదినీశుఁ
గాంచనేరవె సెజ్జనిద్రించువాని

లేవుకొనుమీ వెయ్యందుల కోపు దేని
ననుచు నిష్ఠుర భాషలనాడ మంత్రి॥ ౨౩

ఉ॥ దోసము లేదు రాణిదెస దుష్టుఁడెవండో నృపుండు లేనిచో
మోసము చేసె నీసతిని భూధవు వేసము వేసె నేమొయిం
చీసెద మోసులెత్తఁగ నహీనబలంబున మంత్రిసత్తముం
డేసెను పిప్తైమఱచు హీన కులుండగు చాకిఁ జేతి
తోన్॥ ౨౪

కం॥ దద్దఱిలి రజకుఁడంతట
నిద్దుర మేల్కాంచి సచివునింగని యెదుటన్
ఉద్దవెఱ బుద్ధి గదురఁగ
మొద్దైశయనంబు డిగ్గి భూమింబడియెన్॥ ౨౫

కం॥ కొంతవడి కంత తెప్పిఱి
యంతకనిభుడైన మంత్రినారసి మదిలో
నింతింత యనఁగఁ గూడని
చింతా సాధ్వసములోలయఁ జేడ్పడి యాపై॥ ౨౬

కం॥ గజగజ వడఁకుచు మదిలో
గజిబిజిగదురంగ మంత్రికాళ్లను బడియా
రజకాధముండు "సామీ
నిజభృత్యుంగావు" మనుచు నగులునఁ బొగులన్॥ ౨౭

గీ॥ నిజము చెప్పితివేని యోనీచ నిన్నుఁ
గాచి విడిపింతు నటుగాక కల్లబొల్లు
మాటలాడిన నీమేని తోఁట లొలిచి
యుప్పుకారంబుఁ బట్టించి యూరవైతు॥ ౨౮

ఉ॥ దారితవైరి వీరుఁడగు ధాత్రితలేశుని పట్టుపాన్పుపై
స్వైరత నెట్లు రా?రజక పాంసన పండుకొనంగ గుండియల్
ధీరతగూరె నీకు బల తేజసమున్నతుఁడైన ఱేఁడుని
న్నారసినట్టులైన తిలలంతలుతున్కలుగాఁగఁ గోయఁడే॥ ౨౯

గీ॥ నిక్క మెఱిఁగింపు పాన్పున నీవు ప్రక్క
పండుకొని నిద్రఁజెందిన వార లెవరొ
యనుచు గద్దించి సచివుండు తనునడుగఁగ
వినయ వినమిత గాత్రుఁడై యనియెఁ జాకి॥ ౩౦

ఉ॥ వెకలితనాన నే నృపుఁడు వేఁటకుఁ బోయిన వేళ వేచి పా
యక మదిఁ బొంగు కౌతుకము నాఁగఁగఁ జాలక మంచి వేళ మి
న్నక కడవంగఁ బెట్ట మఱినాకు లభింపదటంచు నెంచి నే
నొకత్రుటి విశ్రమింతునని యుబ్బునఁ బాన్పున మేను వ్రాల్చి
తిన్॥ ౩౧

గీ॥ ప్రతిదినంబును నిచ్చోట రాజు సెజ్జఁ
జక్కఁ జేయుచు నామది నొక్క నిముస
మేనిదీనను బండిన మేను గలుగు
ఫలము గల్గునటంచునుదలఁ చితలఁచి॥ ౩౨

గీ॥ సెజ్జపైనట్టె నా మేనుఁ జేర్చినంత
మత్తుమందును జల్లిన మాడ్కి విగత
చేతనుండైతి నిపుడు నీచేతిదెబ్బ
తగులు నంతకు నెఱుఁగ నేతగుల మనఘ॥ ౩౩

గీ॥ ఒంటినుంటిని సెజ్జపై నొఱగు నపుడు
నిదుర మేల్కాంచి యెదుటను నిన్నుఁ గంటి

ఏడుకొండల వెంకన్నతోడు స్వామి
యింతకంటెను దెలియనే సుంతయైన॥

గీ॥ చాకిలేకిని మతిమాలి సచివవర్య
తప్పు సేసితి మనుపుమ దయదలిర్ప
ననుచు మ్రొక్కంగ యాథార్థ్యమును గ్రహించి
సేవకునిఁబిల్చి బందిలోఁ జేర్పు మితని॥ ౮౫

కం॥ అని వానిఁబంపి సచివుఁడు
మనుజేశునిఁ జేరి రజకుమాటలు వింటే
కనరాదు దోస మింతయు
ననుమానము మాను రాజ్ఞి యనఘాత్మ సుమీ॥ ౮౬

గీ॥ అనుచు సచివుండు చెప్పిన నవనిభర్త
వినియు విననట్టులుండిన వితము రాజ్ఞి
ప్రక్కగదినుండి కనిపెట్టి వనటఁజెంది
విభు నిదరిఁ జేరి వెల్లనవిన్న వించె॥ ౮౭

మ॥ అనుమానింపకు మయ్య! నాయెడల రవ్వంతైన దోసంబుగ
ల్గునె? సామ్రాజ్యరమా సతీరమణ! నీకుం గూర్చుపట్టంపు రా
జ్ఞిని నీ చాత్ముని వానినంటుదునె నీనిస్త్రింశధారాక్షతం
బనఘా! చాకినఖాంక పాళికిని మే లౌనింతని నిక్కం
బునూ॥ ౮౮

గీ॥ నిదుర యదనున నీ రేయిగదికివచ్చి
పాన్పుమీఁదను బండిన వానిఁజూచి
నాదు పాపంబు పండెనో నాథ! నీవె
వేఁటబడలిక నిద్రించితో టటంచు॥ ౮౯

మ॥ ధరణీనాథ! వచింతుసత్యమును నిద్రాభంగముం జేయునో
డిరవం తేనియు సద్దుసేయక యె నిర్భీప్రాత్మనై శయ్య ని
ద్దురకుంజొచ్చితి నంత కాపకుఁ డు ప్రత్యూహంబునన్ లేచినా
పౌరపాటున్ గ్రహియించి శీఘ్రలేచనా మూఢత్వమున్ సై
పవే ౯౦

కం॥ అని మనవిసేయ విని యచె
మను జేశుఁడు మానిని! విసుమనకున్ వళ మే
జనములనోళ్లం గట్టఁగ
జననిందకులోకువయ్యె జాగకిట్లైనన్॥ ౯౧

గీ॥ రజకుసరసను నిద్రించె రాణి యనుచు
సైఁచె రాజది కనులారజూఁచి యనుచు
నింక నేమేమి యాడరు శంక మాని
తెల్లవారిన తోడనే యెల్లవారు॥ ౯౨

ఉ॥ శారదచంద్ర చంద్రికల స్వచ్ఛత నవ్వెడుచారుకీర్తి పెం
పారుగుణోన్నతిన్ బఱఁగ పట్టెదె జన్మమనంగనౌదురా
చారపరాయణత్వము నశింపరలేనున్న మనుష్య జన్మమే
లా? రసమేలుగాపుకో? లలాయకు లాదిగ గల్గు జన్మ
ముల్॥ ౯౩

గీ॥ సకల వర్ణాశ్రమాచార సరణి ధరణి
నిలుపు భారంబు వహియించు నేతనైన
నేనయెట్లులు నీదుదుర్నీతిదాఁచి
నాఁచికొందును నాకీర్తినాతి! చెపుము॥ ౯౪

చం॥ పలుకులు వేయునేలయిఁక భామిని! నీ చరితంబులోపలన్
గలుషత సుంత లేదనుచుఁగల్లవచింపవ యేని చెప్పెద న్

నిలుపుము రేపు రేపకడ నీదగుశీలము నిండుకొల్వులోఁ
గళవెళ గ్రాఁగు తైలమున గాయమపాయము లేక చొన్పు
చున్॥ ౯౫

చం॥ అనిక ఠినంబుగా నృపతి యాడిన పల్కులుముల్కులైమ
నం
బునఁ జెను శోకవహ్నిని రవుల్కొనఁ జేయఁగఁగొంత సేపువి
న్నని వదనంబుతోడ నయనంబులఁ గ్రమ్మెడు బాష్ప
రాజితో
బెనఁగి పెనంగి యాపయినిఁ బెన్పడు శోకముడిగ్గఁ గ్రావు
చున్॥ ౯౬

ఉ॥ పావనమై మహిన్ వెలయు వంశమునందుఁ గళంక లేశమే
నావలనన్ జనించుటకునాథ! సహింతునె? భక్తిసీదునా
జ్ఞావశవర్తినౌచు వెసఁగ్రాఁగెడు తైలమునందుఁ జొచ్చెదన్
దైవము మున్నువ్రాసిన విధంబున సర్వమునిర్వహిల్లె
డున్॥ ౯౭

ఉ॥ పావకుఁడంత నిర్దయుఁడె! పాతక లేశము లేని నన్నుఁదా
గావఁడెచల్లనై యటులుకాక దహించిననేమి పోవు? నీ
కేవము నాపయింగలుగ నేబ్రతుకంగల లాభ మేమి? యో!
భూవర నాకు నెట్లయిన మోదమెసుమ్ము తలంచిచూ
డఁగా॥ ౯౮

గీ॥ ఉడుకునూని యంద్ర బాణంబులడఁగెనేని
యడఁగు నవమానజంబగు నడలుతోనె
బ్రతుకుఁ గంటినయేని యో ప్రార్థివేంద్ర
సీతరీతిని లోకప్రసిద్ధిగాంతు॥ ౯౯

కం॥ వినయముఁ బ్రణయము శోకం
బును మనమున సందడించి ముప్పిరిఁ గొనన
వ్వనజాక్షి రాజుతోసి
ట్లను భావముతోఁ బ్రమాటలాడెడు వేళన్॥ ౧౦౦

కం॥ పాపము! పాపధ్వాంతం
బేపారదు రాజ్ఞిమదిని నెంతయు ననుచున్
భూపునకుఁ జెప్పనోయన
వ్యాపించెను వెలుఁగు తెల్లవాఱెను దిశలున్॥ ౧౦౧

ఉ॥ శైలకటాహ మందల సుధన్వునిపోలిక రాజ్ఞి నేఁడున
చ్ఛీలము ధారణీస్థలిఁ బ్రసిద్ధికి నెక్కఁ బ్రతిష్ఠఁ జేయఁబే
రోలగమందుఁ గాంతునని యుత్సుకుఁడై వెసఁ దూర్పు
గొండపైఁ
గ్రాలెనుగర్మ సాక్షి నిజకాంతుల ధ్వాంతముఁ బాఱదోలు
చున్ ౧౦౨

ఉ॥ అంతటమేది నీశుఁడు సభాంతర సీమకునేగుదెంచిసా
మంతపురోహితాదుల నమాత్యులఁబిల్వఁగఁ బంచిచెప్పని
శ్చింత నొకింతయేనియు విస్మృష్టము సేయక యాత్మపత్నివృ
త్తాంతము సభ్యులెల్లఁదన ధర్మరతిన్ బళి! యంచుమెచ్చఁ
గన్॥ ౧౦౩

కం॥ మెచ్చుకొను సభ్యులెల్లరు
టెచ్చువడంబలికె నంతతేఁడుగనుండీ
చిచ్చునఁగాఁగెడు శైలముఁ
జొచ్చెడు నాభార్య తన విశుద్ధతఁదెలుపన్॥ ౧౦౪

కం॥ అని యనుచరులను బనిగొని
మను జేశుఁడు భైరవముగ మసలఁగఁ జేసెన్
బెను బానలోన నూనియఁ
దనపత్నిఁ బరీక్ష సేయ ధైర్యయుతుండై॥ ౧౦౫

సీ॥ గ్రీష్మర్తువునఁ గడునూష్మ చే వసివాడు
లతకూన వితమున శయ్య్య దాని
వర్షకాలంబున వనదంబులట్టులు
కన్నీటిబిందువుల్ గార్చుదాని
మోడులౌ శిశిరర్తుభూజంబులట్టులు
భూషణంబులనూడ్చి పొలయుదాని
శరదబ్జచంద్రికా స్ఫార తేజము వ్రాలె
నకలుషంబగు చిత్తమమరుదాని

గీ॥ రచ్చకెక్కంగ నెట్టొర్తుఁ బ్రజలయెదుట
ననుచు సీతున వడఁకెడు ననువుదోఁపఁ
గంపమొందెడుదాని నక్కాంతనంతఁ
గొల్వుకూటంబునకు రాజు పిల్వఁబంచె॥ ౧౦౬

గీ॥ మగని యాజ్ఞానుసారియై మగువమిన్న
నిండుకొల్వున కేతెంచి నివురుగప్పు
నిప్పుచందాన నిలుచున్న యొప్పుఁగాంచి
మంత్రియిట్లనె రాజుతో మంతనమున॥ ౧౦౭

ఉ॥ విన్నప మొండునీకుఁ బృథివీవర! చేసెదనల్ల, తాటియా
కున్నదిగాదె నీకడ మహోన్నత సత్త్వముదానఁగల్గు నం
చెన్నుదుఁదైలభాండమున నిప్పుడు దానిని వైచి చూతమీ
యన్నులమిన్నదానసఘుమైనను నయ్యది కాలకుండెడున్॥

కం॥ కానిమ్మట్లే యని భూ
జానియు నందులకు నొప్ప సచివుం డంతన్
నూనియ గ్రాఁగెడు బానను
బూనికతోఁ దాటియాకు భూపుఁడు సభ్యుల్॥ ౧౦౯

గీ॥ చూచుచుండఁగ నద్దాని వైచి యనియెఁ
బుణ్యచారిత్రయా నేని భూపువత్ని
తైలవహ్నికి నిప్పుడు తాటియాకు
కాలకుండఁగ స్వచ్ఛమై క్రాలుఁగాక॥ ౧౧౦

గీ॥ తాళపత్రంబు నటుపైనిఁ దైలమందుఁ
గొంతవడియుంచి విస్మయాక్రాంతుఁడగుచు
సభ్యులెల్లరు వినఁగనా సచివవరుఁడు
పలికె నిట్టులు విస్పష్టభాషణముల॥ ౧౧౧

ఉ॥ చిత్రమయారె! మంబరము నేయదు మండెడు తైలవహ్ని యీ
పత్రముఁ జూడుఁడీ సభికవర్యులు రాజ్ఞి సతీత్వమెన్న సా
విత్రి ధరిత్రిజాతముఖ విశ్రుత పుణ్యసతీలలామ చా
రిత్రలఁ బోల్పనౌనిఁకఁ బరీక్షలతోఁ బనియేమి చెప్పుఁడీ॥ ౧౧౨

గీ॥ అని యమాత్యుండు పలికెడు నంతలోన
నంతఁ దనుకను వంచిన యాననంబు
మెల్ల మెల్లనఁ బైకెత్తి మేదినీశుఁ
గాంచి యిట్లనిపల్కె నక్కాంచనాంగి॥ ౧౧౩

ఉ॥ ఇంతకు వచ్చినంతట మహీవర! చాలునె తాటియాకునా
స్వాంత విశుద్ధతన్ సభికవర్యుల ముందటఁ జాటిచెప్పనీ
చెంతను మిన్నకుండిన విశృంఖలవృత్తిని వీరియిండ్లలో
మంతిరి, యాకుపైఁ బసరు, మందెదొ పూసెనటంచు నాడరే॥

క౦॥ అనియంత నారికేళముఁ
గొనిరమ్మని దాని నూనెఁడను వైవం
గను, బెటిలున నదిపగులం
గనిక్రచ్ఛుఅరాణి నూనెతాఁపన దుమికెన్॥ ౧౦౩

గీ॥ కంఠదఘ్నంబుగా నాపె గ్రాఁగ్నుత్రైల
మందు నిలుచుండి కండక చుంగిగంచె
నీటమున్గిన తామరతూఁటిపైనఁ
జేలి వికసించు కెందమ్మి తెఱఁగునోఁప॥ ౧౦౪

శా॥ చేతుల్ మోడ్చి నమస్కృతుల్ సలిపిరాశీతాంశు
బింబాస్యకున్
జేతోవీథుల భక్తిపొంగఁగ సభాసీనుల్ ప్రహృష్టాత్ములై
మాతా! పూతములయ్యె జన్మములు యుష్మద్దర్శనప్రాప్తివి
ఖ్యాతింబొందుము సీతరీతినని యుత్కంఠన్ బ్రశంసించు
చున్।

చం॥ అకలుష చిత్తయౌ మగఁనాఅడి వెట్టితినంచు సిగ్గునన్
వికలమనస్కుఁడై యుపుడ ప్రేయసిమోమునుజూడలేమి
న్నకసమితో త్తమాంగుఁడగు నాథునిజూచి సతీలలామచెం
తకుఁజని వానిపాదములఁదగ్గయు భక్తినిప్రాలె నంతటన్।

ఉ॥ అచ్చుపుఁ గూర్మి వెల్లివిరియ నరపాలుఁడు లేవనెత్తిదాఁ
గ్రుచ్చికవుంగలించుకొనికూఁతలముల్ సవరించిమానినిన్
మెచ్చుచు మంత్రిసత్తమున కియ్యముదంబునఁజేరబిల్చియే
మిచ్చిన దీరునీఋణమహీనగుణాకరయంచు మ్రొక్కెనన్॥

ఉ॥ రాణనురాజ్ఞిబాష్పములురాల నమాత్యుని పాదపద్మముల్
పాణులనంటి మ్రొక్కుచు నపారకృపాకరఁ నేడు నీవునా
ప్రాణముమాన మొక్కవడి రక్షణఁజేసితి తండ్రివౌచు వి
న్నాణముఁ జూపియంచును బ్రణామముఁ జేసెఁ గమ్మఱఁ
నెమ్మిమై॥ ౧౨౦

కం॥ వింటే యీకథ పుత్రక!
కంటివృకోశాంతి వలనఁగల్గు ఫలంబే
వెంటన్ నీమదిఁ దత్తర
మంటఁగనీకుండ సల్పుమా కార్యంబుల్ ౧౨౧

గీ॥ స్వతమమందున నభినివేశమును విడక
పరమతంబులు సైరింపభావ్యమగును
దత్వమొన్నంగఁ బరదైవతం బొకండె
విశ్వమంతటఁ బూర్ణుఁడై వెలయుకతన॥ ౧౨౨

కం॥ అనియిటు లాత్మారాముఁడు
తనయునకుఁ రాజనీతి తత్త్వము మదికిం
పొనరఁగఁ దెలుపఁగ శ్రద్ధన్
విని సునిశితబుద్ధి యతఁడు విజ్ఞుండయ్యెఁ॥ ౧౨౩

కం॥ వేంకటనాథా! నిజపద
కింకర కైంకర్యలోల! కితవవిదూరా!
శంకర! దురిత తమోనా
శంకర! సకలార్ధసాక్షి! సర్వేశ! హరీ!॥ ౧౨౪

మా॥ భుజగపతికలాపా! భూరికల్యాణరూపా!
నిజజనపరిపాలా! నిర్వికారాత్మలోలా!
అజహరిహరమూర్తీ! ఆర్తరక్షాచ్ఛకీర్తీ
విజయరథకుటుంబీ! విజ్ఞపక్షావలంబీ! ౧౭౫

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహా విద్యాపీఠ స్థాపనాచార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతోపాసనాసాధిత నవరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీజాన చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము
ఓమితి శివం.



శ్రీ

# శ్రీతులసీదాస చరిత్రము

## ద్వితీయాశ్వాసము



విద్యోపాసక హృద
యావాసా! వాసవార్చితాంఘ్రిసరోజా!
భావాతీతా! అభవా!
గోవిందా! కంసదమన! కుంజరవరదా!॥

గీ॥ తనయుఁడిట్టులఁ బ్రాజ్ఞుఁడై తనరమెచ్చి
తనదు మంత్రిత్వపదవి నతనికి నిచ్చి
పుణ్యతీర్థంబులను జూడ బుద్ధిపొడమఁ
బయనమయ్యెను రాముఁడు ప్రమదమెసఁగ! ౨

కం॥ తలలోపల నాలుకవలెఁ
దులసీదాసుండు నృపతితో మెలఁగుచుఁ దా
సలిపెన్ సచివత్వముని
స్తులనైపుణిఁ బుడమిజనులుస్తోత్రము సేయన్॥ ౩

సీ॥ వైరిరాజన్యుల వశవర్తులను జేయు
మంత్రమాదేశించు మంతనమున

నధ్యాత్మచర్చల మాధ్యస్థ్య మొనరించి
సిద్ధాంతములఁ దేల్చి చెప్పుచుండుఁ
బండిత కవులతో వాక్యార్థములు సేసి
తారతమ్యము లెంచి గౌరవించు
సంగీత నృత్య ప్రసంగంబుగల్గుచో
మేలుకీడుల నెంచి మెచ్చుకొనును

గీ॥ ఆటపాటల వేఁటల మాటలందు
రాజసత్తమునకు బహిః ప్రాణమగుచు
నొక్కక్షణమేని పాయకయుండు నెపుడు
సకల విద్యాప్రవీణుఁడా సచివవరుఁడు ౪

ఉ॥ అంతట సార్వభౌముఁడుమహావిభవంబునఁ బేర్చియొక్కనా
సంతదినాంతమందు దొరసానులు చుట్టుచుఁ జేరికొల్వన
భ్యంతరమందిరమ్మున సుఖాసనమం దధివంది భోగపుం
గాంతయొకర్తుదా భరత గానకళాగరిమన్ వెలార్పఁగన్ ౫

కం॥ రాణులుఁ దానును నత్తఱి
రాణదలిర్పంగ మదిని రసవంతంబౌ
నేణీలోచన నృత్యము
నాణెము గానంబునందు నయగారంబున్॥ ౬

గీ॥ మెచ్చి యచ్చెరువంది యమ్మచ్చకంటి
పాట వినుపించు వేడుకఁ బార్థివుండు
మంత్రిసత్తమునచటికా మంత్రణంబు
సేయఁబంచెను దగినట్టి సేవకులను॥ ౭

చం॥ నరపతిపిల్పునందుకొని నర్తకిఁజూడనమాత్యుఁడంత సం
బరమున రాఁగ, వేశ్య కని, బాపురె! యీనవమోహనాంగు సుం
దరవదనారవిందరుచి, దర్పకుదర్పమధఃకరించు; నీ
నరసునిఁగూడకున్న నిఁకజన్మముదేలని చాల మెచ్చుచున్॥

గీ॥ కేలుఁదమ్ములు మోడ్చి యవ్వాలుఁగంటి
నిటలతటమున ఘటియించి నీటుగులుక
మ్రొక్కి కేగ్రంటిచూపులఁడక్కులాడి
చూచి సచివుని చిత్తంబుఁజూఱఁగొనియె॥ ౯

గీ॥ పార్థివుండంం సచివునివంకఁజూచి
వేడుకయ్యెను విబుధేంద్ర నేఁడు మాకు
దీని విద్యాతిశయమును దేల్చిచూడఁ
దరిచిచూడుమటన్న నాదరము మెఱయ॥ ౧౦

సీ॥ కళ్యాణిరాగంబుఁ గాన్పింపుమొక్కింత
బయలుపరుపు చక్రవాకమింక
నీలాంబరమొకింత నేర్పుమై నవరించి
మోహనాకృతిఁ జూపు ముద్దుగుమ్మ!
భూపాలరాగంబు పొసఁగదిత్తఱిఁ దన్వి
దర్బారెఱుంగవే తరుణి! నీవు?
కోకిలధ్వని చాలఁ గువలయాక్షి! మేలు
'ధన్యాసి' మెచ్చితి తరళనయన!

గీ॥ చాలనొప్పెఁడు బాలవసంతమిట్టి
తతిని సుఖమిచ్చు మలయమారుతమదెంతొ

మదికి నింపరెన్నో సింహేంద్రమధ్యమనుచుఁ
గొనరఁ పాడించె సచివుండు ఓసువు లేక॥ ౧౧

గీ॥ గానముచేసి యారీతిఁ గానలహరి
లాస్యశృంగార లీలావిలాసములను
అభినయాభ్యాసనైపుణీ విభవము లను
గాంచి లాహిరి గ్రమ్మినకరణిదోఁచ॥ ౧౨

కం॥ పరవశుఁడై యతఁడుండిన
పరువము దాఁ గాంచి వారభామిని నావా
గురఁ దగులుకొనియె నితఁడని
మురిసెను మదిలోన సచివముఖ్యుండంతన్॥ ౧౩

గీ॥ ఉర్వినాథుండుదన దండనుంటఁ దెలిసి
తెప్పిఁ దెలిసానిదానికి నప్పనంబు
లొప్పు విధమున నిప్పించి యూహఁ గలఁగి
వేదురుం గొన్న విధమున వెడలు తఱిని ౧౪

కం॥ సామీ! పనివినియెదనని
చామీకరగాత్రవాని సరసకుఁజన, నీ
నామంబేమీ? మీనా
క్షీ! మాకెఱిఁగింపుమన్న సింగారముగన్॥ ౧౫

కం॥ నగరాజకుమారీ! యని
నగరంబునఁ బిల్చుచుంద్రు నన్నందఱు నా
సొగసును విద్యయు సరసుఁడ
మిగులఁగ శోభిల్లెనీవు మెచ్చినకతనన్॥ ౧౬

కం॥ రచ్చలఁ బాడెడు పాటల
మెచ్చెదవు నె? సచివవర్య! మీదయయున్న న్

విచ్చలవిడిమాయింట వి
యచ్చరగాయనుల మింతునశ్రమలీలన్॥ ౧౭

కం॥ అనిజాణ తనముమెఱయం
గనుబలుకఁగ సచివుఁడంతఁ గాని మ్మిట్టుపై
నశువగున త్తఱిఁగనియెద
ననఁబోఁడిరా! నీదుగాననాట్యశ్రీలన్॥ ౧౮

గీ॥ అనుచుసమయోచితంబుఁగ నాడి వార
కాంత సెలవిచ్చిపంపి విభ్రాంతుఁడగుచు
విశ్వమెల్లనులో వెలి వేశ్యగాఁగ
సేవకులుదారిఁ జూపఁగఁ జేరెగృహము ౧౯

చం॥ అరమర లేనిప్రేమ నయనాబ్జయుగంబునఁజిందు లాడఁగా
సరసకువచ్చుభార్య విరసంబుఁగ నావలఁద్రోసి లోఁకికిన్
సరసర నేగిశయ్య నవశంబుగ వ్రాలుచు నుస్సురంచునున్
జ్వరితునిపోల్కిఁజేఁపవలఁ బడ్డవిధంబునఁ దాపమొందు
చున్॥ ౨౦

సీ॥ పరమపావనమైన బ్రహ్మవంశంబునఁ
బ్రభవించి సర్వశాస్త్రముల నేర్చి
స్నానసంధ్యాద్యనుష్ఠానతత్పరుఁడనై
యార్జవంబునకుదాహరణమగుచు
సార్వభౌమునియొద్ద సన్మానములనంది
ధీరశాంతుఁడనన్న పేరుఁగాంచి
వరసనాతనధర్మ పక్షపాతినటంచు
నార్యసన్నుతుఁడనై యశముఁబొంది

గీ॥ వెలయుచుండెడు నేన యిబ్బాల వెలది
వలదగులోన వెలికేగు వలనులేక
కలఁగి వళవంత మించంగ సొలయుటరయు
నానప్పుబెడు నాలోన నాకెయకట! ౨౧

కం॥ నగుబాట్లుకాదె నాకీ
నగరంబుననింక మీఁద నర్తకియానీ
నగరాజకుమారిని నే
తగిలితిననువార్త పెదవిదాఁటిన యేనిన్॥ ౨౨

గీ॥ నాదునడవడి తెలివియు నాదువిద్య
నెంచిమదిలోన నెంతోహర్షించుతండ్రి
యెంతచింతిల్లునో కొవారకాంత కేను
వశుఁడనై బైసిమాలిన వార్తవిన్న॥ ౨౩

ఉ॥ నవ్వినవవ్వనీ బుధులు నాయనయున్ మదిఁజింతఁజెందనీ
పువ్వులుకాని తీవ్రశరపుంఖహతిన్ ధృతిఁదూలిశూలియున్
గవ్వకుఁగాక జవ్వనికిఁగాయము సామిడెనన్న నింక నే
నెవ్విధిఁ జివ్వకోర్వఁగల నిక్షుశరాసనధన్వితోడుతన్॥ ౨౪

గీ॥ చెప్పుటకు నేమి యొరులకుఁజెప్పినంత
చేయఁగలవారలుండిరే చింత సేయ
ధరఁబరాశరుఁడాదియౌ తత్త్వవిదులె
కాయజునికోడి కాంతల కాళ్ళఁబడరె?॥ ౨౫

ఉ॥ జావళిఁబాడుచోఁ జెలిరసస్ఫురణంబొలయంగఁజూపు నా
హావములందలంప నహహా! పులకాంకురముల్ జనించెడిన్
బావశపాదపద్మముల పైఁదొలుకాడగలాస్యమాడు లీ
లావతికన్ను బెట్టుఁదలంపఁగ మంపెసఁగున్ మనంబునన్

ఉ॥ ఎందఱసుందరీమణుల నీమహిఁజూడము వారి యందు నీ
చందము సోయగంబు సరసత్వము జాణతనంబులున్న వే?
యిందుశిలావిధంబున మదీయమనంబలినీలవేణి పూ
ర్ణేందుముఖద్యుతిన్ గఱఁగె నేమి యనంగలనింకనద్దిరా!॥

కం॥ దురితంబౌఁ బరభామల
సురతంబను ధర్మశాస్త్రసూక్తి యెఱున్నన్
ధరవారకాంతఁ గూడుట
పరభామారతియటంచుఁ బలుకంజను నే॥ ౨౮

ఉ॥ కష్టము లెంచకుండ బహుకాలముఁదిండికిమాని నిష్ఠతో
నిష్టియొనర్చి వేదముల నెప్పుడుఁదప్పక వల్లెవేయుచున్
శిష్టులమంచు వీఁగెడు వశిప్రవరుల్ వివశాత్మలౌచుఁ ద్రై
విష్టప భోగకామినుల వెంబడి లోఁబడి సంచలింపరే? ౨౯

మ॥ వనితారత్నము రూపనైపుణులఁదా వర్ణించి భావించి త
త్ప్రణయోద్యోతితచిత్తుఁడై తవులఁగా వాంఛించునాలోననే
జననిందాభయరూపమౌ పెనుపిశాచంబడ్డమైనిల్వ నా
ఘనుడార్తుండయి సెజ్జపైఁబొరలుఁగింకర్తవ్యతామూఢుఁడై

కం॥ తులసీదాసివ్విధమున
వెలవెలఁదినిఁ గూడుటకును వీడుట కైనన్
వలనింత లేక చింతా
జలనిధిమునుఁగంగఁజూచి సాధ్వసమొలయన్॥ ౩౧

ఉ॥ ఆతనిజాయ యంతట రయంబునఁజేరఁగవచ్చి నిల్చి యే
మీ!తడవాయె లేచి, శుచియింపఁగరాఁగఁదె యెన్నఁడిట్టి చిం
తాతిశయంబు నీమొదలనక్కట కానఁగరాదు నాథ! నీ
యీతెఱవెల్లఁజూడ మదినెంతయు శోకమునందడిల్లెదన్॥

కం॥ ఆరోగ్యమొసఁగ నీకు వి
చారంబిది యేల మాకు సౌఖ్యంబున్నె
దూరంబేగిరి వారిలు
సేరుటకేఁక సెంతతపస్సు సేయఁ బరోకదా?     ౩౮

చం॥ స్థిరమగు కూర్మి రాఘవప స్వప్రభపోలికరాజు నీవు నే
యరమరలేక సర్వవిషయంబుల వర్తిలుచుందు రాధరా
వరుఁడెటు యేకతంబ సమజబ్ధునర్పుఁడుగా! వసుంధరా
మరులకు సెంతవారు సవమానము సేసినఁ జెంపుఁగాంతురే!

సీ॥ సద్వంశమునఁ బుట్టిఁ జన్మించి తలిదండ్రు
లల్లారుముద్దుగా నరయఁ బెరిఁగి
సర్వశాస్త్రంబులశ్రమ లీలమై నేర్చి
సార్వభౌముని ముఖ్యసచివుఁడగుచు
సౌందర్యలావణ్య చాతుర్యఖనివౌచు
సర్వదిక్కుల సద్యశంబు పర్వఁ
బాడిపంటలతోడఁ బైడిరాసులు తవ్వి
తండంబులైయుంటఁ దనరుచుండ

గీ॥ నెందు నొక్కొంత లోటు లేకసఁగునీకుఁ
జిత్తమందిట్టి గాటమౌచింత గూరు
టరయరనియందు దట్టమౌ నిరులు బలియు
నట్లు తోఁచెడిఁగద మనోహర! తలంప॥     ౩౯

చం॥ అరయమిఁ జేసి నేనవినయంబొనరింపఁ ద్వదీయచిత్తమీ
వరుసనుక్షోభమందెడునె ప్రాణపతీ! భవదీయదాసినె
ప్పరుసున శిక్షసేయుటది భావ్యమొ యట్టులు చేయకివ్విధిఁ
బురపురఁబొక్కుచుంటయిది పోలునె నన్గరుణించి కావవే॥

గీ॥ యుక్తమనినీకుఁదోఁచిన యోజనెట్టి
కఠినశిక్షలకేనోర్వఁగలనుగాని
తమముపైఁబడ్డ దేజంబు తఱుఁగుచంద్రు
ననుకరించిన నీమోముఁగనఁగఁజాల॥ ౩౭

గీ॥ మచ్చలేనట్టిచందురు మాడ్కి వెలయు
నీదు నెమ్మోమురుచి శోకనీరదములఁ
విహితమైపోవ నానాథ! విశ్వమెల్లఁ
గాఱుచీకట్లు గ్రమ్మిన కరణిఁదోఁచు॥ ౩౮

గీ॥ మాఱుపలుకవునాథ! వేమాఱునిన్నుఁ
బలుకరించిన నిదియేమికలఁత యొక్క
మాఱు మోమిడినామోము నోరగంట
నేనియొకమాఱుఁజూడవే నేమియందు॥ ౩౯

ఉ॥ భ్రాంతియెకాని కల్గదుత్రివర్గసుఖంబులశాంతి యంచునీ
స్వాంతమునందునెంచి యపవర్గ నిరర్గళమార్గ మార్గణ
క్లాంతినిలోకమంద రతిఁగాంచితివే హృదయాధినాథ! యా
వంతయు నీమనంబు తెఱఁగారయరాదిఁక నేమిసేయుదున్॥

చ॥ మమతఁబరిత్యజించియవమానము మానమునాత్మలోపలన్
సమత గణించి ప్రాప్తమగుసౌఖ్యతతిన్ భుజియించి నిర్విచా
రమునఁజరించి, నేన నగరాజకుమారిప్రియుండనంచుశాం
తముగ రమింపరాదె యిటుదైన్యమునొందమనీషకల్మియే॥

చం॥ తనువిడనాడి వారవనితామణిఁగూడుమటంచుఁజెప్పరీ
తినినిజభార్యదాఁబలుకుటీతు చెవింబడ దద్దఱిల్లి, యే

చం॥ అనితలపోసి నాథునిపదాబ్జములల్లన నూరుసీమపైఁ
గొని,వనితాలలామ నిజ కోమలపాణులఁబట్టియొత్తుచున్
మనమునఁ బొంగుశోకమును మాత్రమఁబైకిబుకంగనీకచ
ల్లనిలలితోపచారముల లాలనసేయుచు భర్తకిట్లనున్॥ ౪౮

చం॥ మనమునసేమిచింత యిదిమన్మథమన్మథ! పుణ్యరాశియా
పనిత యెవర్తెయేనినిజభక్తిసుశీల సురూపసంపదన్
మనముహరింప నీకిటులు మన్మథమార్గణపుంఖసంహతుల్
బనుపడునోకొ నిన్ను వలవంతఁగలంచెడుకాంతలుందురే॥

మ॥ నినుమెప్పించి మనంబుఁజూఱకొనునా నీరేజపత్రాక్షివి
న్ననువ్రన్ వర్ణనసేయఁగాఁదరమెకో నాథా! తగన్ నీదుమ
న్ననకర్హంబగునట్టిపుణ్యసతి యెన్నన్ నాకునుంబూజ్యయా
ననుమానంబిఁక నేలనోయనఘ! యయ్యబ్జాక్షిఁ రప్పింపుమీ

గీ॥ పుణ్యగరిమనుచంద్రులావణ్యసుధను
దానెక్రోలిచకోరి యుద్ధతివహింపఁ
బగవహించునె? తొగకన్నెపంకజాళిఁ
గనులఁగాంచిన మాత్రనేకనదెముదము॥ ౫౧

గీ॥ జేసఁదవులకయినుఁడు దాసీనుఁడగుచుఁ
గరముమెఱయంగఁ దత్కరగ్రహణభాగ్య
గరిమమోదింతుపద్మినీకాంతలెల్ల
దక్షిణుండౌట తప్పానెదత్పుకల॥ ౫౨

చ॥ అనుచుఁబతివ్రతాతిలకమా సతి యీగతిఁజాలసేవు దా
ననునయవాక్యసంతతులనాతనిఁ దేర్చఁగ నేర్పుసూపినన్
జనపరివాదభీతిమది సందడిసేయఁగ లంకఁ దేరఁ గా
జనునుతుఁడార్తుఁడౌటఁగని సర్వముఁదెల్పెఁదదంబకంతటన్॥

కం॥ తల్లియు నుల్లములోపలఁ
దల్లడపడియవుడు వేగఁదనయునిదరికిన్
మెల్లమన ప్రీతిమైఁజని
సల్లలితాలాపములను సాంత్వనమొనరన్॥ ౨౪

గీ॥ ఎంత చెప్పిన నాతఁడొక్కింతయేని
చింతవీడక కన్నమ్మ పలతగింప
నమలి యుమియుచు నేఱుచు నలిపి నలిపి
మెతుకులొకకొన్ని యెట్లొట్లొ మెసవె విసివి। ౨౫

కం॥ నగరాజకుమారీమణి
నిగనిగలను మంత్రివరుని నేత్రద్వయమున్
మిగులఁగ మిఱుమిట్లుగొని
జగమింతయుఁ గానరాక జాలింబడియెన్॥ ౨౬

ఉ॥ అంగజరాజ్యలక్ష్మియగు నాగణికాగణనీయ చారుప్ర
త్యంగముఁ జిత్తమందున మహాకుతుకంబున నెంచినిల్పి త
త్సంగతిఁగోరి పూజనముసల్పి తదేక నిరీక్షదీక్షమై
నింగియు నేలయుంగనఁడు నిస్పృహఁజెందినయోగికైవడిన్

ఉ॥ కాసునకాసఁజేసి తనకాయము నద్దెలకిచ్చు వారకాం
తాసహవాసమే, తులసిదాసుఁడు భాగ్యమటంచు నెంచి యా
యాసముఁజెంది దానివయివాసఁద్యజింపఁగ లేకలోకమున్
రోసి కృశించె నత్తరి ననూనమనోజ శిలీముఖవ్యథన్॥ ౨౭

గీ॥ హాళిమీఱఁగ వెలయాలి కేళిఁగోరి
యాలిరోసెను రాజకార్యాళిరోసె
లోకపరివాదభీతిఁ జీకాకుపడుచుఁ
దావమొందుచు నున్నట్టికన్నిరోసె॥ ౨౮

గీ॥ కొన్నివారంబులిరీతిఁ జన్[illegible]

సచివుఁ [illegible] నుమానమును

రాక తడసిన విస్మయా[illegible]

బిలువనంపించె భూమి[illegible] ౬౦

సీ॥ పంతులు పిల్వంగ బడికేగఁ [illegible]

బాలులీలను నా[illegible]

జాగారమునఁజేసి జే[illegible]

గణికపైఁగల[illegible]

దన్యాంగితోనేకతను[illegible]

నుపవాసకృశ[illegible] యొడలుఁదెల్పు

మదిరాక్షిసౌందర్య మది[illegible]

తడఁబాటుఁజె[illegible]నక దెలుపఁ

గీ॥ బుడమియొడయని పిల్పునఁ [illegible] లేక

యూర్పువడగాలి సభయెల్ల నుష్ణగల్ల

రాజునాస్థానమును జేరె [illegible]

విరహదండవ్యామానుఁడా[illegible]వరుఁడు॥ ౬౧

గీ॥ చేరవచ్చెడు సచివుని దేఱిచూచి

రాగపీడితుఁడని యనరాదు [illegible]ని

రోగపీడితుఁడని యనురా[illegible] మెప్పుఁ

జెంత నాసీనుగావించి సేమమడిగి॥ ౬౨

చం॥ అవసరమైనయట్టి వ్యవహారములిత్తరిఁ జర్చసేయ వి

ప్రవరనినుఁ సభాస్థలికి రమ్మనిపిల్వఁగ లేదునాకు నీ

యవనిరుచింపదెద్దియు వయస్య! నిజంబుగనీవురానిచో

భవమిది దుర్భరంబుగద ప్రాతులు మిత్రులు లేనివారికిఁ॥

ఉ॥ స్వోదరపూరణార్థమయి సోదరభావముఁ జూపిసన్నిధిన్
బాముకొనంగ నిచ్చకపుమాటలు వల్కుచుఁ జిత్తమందుఁ బే
రాదటపొంగిపొర్లి నటులాదరమున్నటియించు వారి మ
ర్యాదలు వెక్కసంబయి ప్రియంబున నిన్బిలువంగ నంపితిన్॥

గీ॥ నీకు స్వస్థత లేకుంట రాకయుంటి
వనుచుఁ దెలిసిన నేన, నిన్గనఁగవత్తుఁ
గాక పిలిపింతునే రాజ్యగర్వమునను
పోయి సుఖమునరమ్మంచు భూభుజుండు॥ ౬౫

గీ॥ తులసిదాసున కీరీతి నెలమిమీఱ
సెలవొసంగిన మఱుమాట పలుక కతఁడు
పరిజనంబుల నరయక పాదచారి
యగుచు రయమున సభనుండి యరిగెనంత॥ ౬౬

గీ॥ కర్ణధారుఁడు లేనట్టి కలముపగిది
త్రాడుపీడినఁ దట తటలాడుగాలి
పడగ వడుపున నిలుకడఁ బడయక వెర
వేఁకి వీథులఁ దిరిగె వివేకమేది ౬౭

గీ॥ ఇంటికేగంగమనమున నిచ్ఛ లేదు
ఇచ్చవచ్చిన యెడకేగ ధృతియు లేదు
ఎచటికేగుచునుంటినన్ స్మృతియు లేదు
ఆటకత్తియ పైఁగల యాసఁ జేసి॥ ౬౮

ఉ॥ పాటలగంధిమున్ సభను బాడినపాటలు నాడుమాటలున్
నేటికి వాని చిత్తమున నెక్కొని మాటికిమాఱు మ్రోగ శృం
గాటక మందు, రావతిమకై వడి సిగ్గిడి యట్టె నిల్చి మా
ర్గాటనముఁ బల్కకుండుఁ బదిమంది తనుంబడఁ ద్రోసి యేగినన్॥

కం॥ అడుగులు తడఁబడ జడుసటు
నడయాడుచు నచివుఁడిటులు నగరమునందున్
బడలిక తెలియక తిరుగఁగ
నడురాతిరియయ్యెనంత నభమునఁ బెలుచన్॥ ౭౦

సీ॥ మోహాంధకారంబుఁ బుడిసిపి కార్మబ్బు
లుడురాజకాంతుల నడఁగఁద్రొక్కె
భోగంపు మెఱుఁగుల పోలుపుల్ చూపుచు
క్షణికంబులౌ తటిత్కాంతు లాలసె
వ్యర్థులౌ విటకాండ్ర నడలించు వేశ్యమా
తల బొబ్బలట్టుల స్తనిత మొప్పె
అలఘు బుద్ధులనైనఁ జులుకఁ జేసెడు మాత్స
యౌవనోద్ధతిరీతి పవనులుఁ జెలఁగెఁ
గీ॥ గట్టుతెగియెనో యేమొ యాకాశగంగ
భూత నివహంబులెల్లనుభీతిఁ జెంద
మిట్టుపల్లంబు లేకమై మేళవింప
భయద నిర్ఘాత యుతముగ వానగురిసె॥ ౭౧

చం॥ అలజడి వానలోఁ దడిసి యా ధరణీసురవర్యుఁడాత్మలో
నలజడిఁ జెంది యింటితెరు వారయుఁ బోవను నేరక త్తఱిన్
జలమయమైన వీధులను జాఱుచు మున్గుచు నీఁదులాడుచున్
విలవిలఁ బోయి యొక్క తుటిలో విశ్రమమొందఁగఁ దావుఁగో
యుచున్॥ ౭౨

గీ॥ వాడవాడలఁ దిరిగి యవ్వాడవదిని
మేడదరిఁ జేరి మొగసాల జాడఁగాంచి

'బ్రతుకు జీవుఁడ'యంచు నా బ్రాహ్మణుండు
వడిగఁ జొరఁబారి వివశుఁడై పడియెనంత॥ ౨౩

సీ॥ సాయంతనపువేళ సానిమేళముఁగట్ట
నాయింటి వేశ్య దా నరిగియపుడు
వర్షంబు శమియింపఁ బరిజనంబులతోడ
నేతెంచి యింటికి నెదుటఁబడిన
మంత్రివర్యునిఁగాంచి మదిలోన విస్మయం
బావహిల్లఁగ లోనికతనిఁ జేర్చి
వలువతోఁ దడియొత్తి చలువలు మైఁగట్టి
సెజ్జపైఁ జేర్పించి చెంతఁ జేరి

గీ॥ యుచితమైనట్టి యుపచార రచనవలన
మూర్ఛవాయఁగఁ జేసి యమ్ముద్దుగుమ్మ
నిలిచి చేతులు జోడించి నెయ్యమెసఁగఁ
బలికెనిట్టులు మధుర సంభాషణముల॥ ౨౪

ఉ॥ పావనమయ్యె నాగృహము; పండెను నాదగు పూర్వపుణ్యమున్
వావిరి యయ్యె భావభవ భవ్య మనోహరరూప! నాదు వి
ద్యా విభవంబు; భూస్ధలిని నచ్చర లేమల పెంపుగాంచితిన్
గేవలమా కృపోన్నతిని నీవిటవచ్చుట భూసురాగ్రణీ॥ ౨౫

చం॥ నృపవరదుర్లభంబయిన నీదగుదర్శనభాగ్యలబ్ధిచే
నపరిమితంబుగా మదిని హర్షముగల్గెడుఁగాని నేటివ
ర్షపుఁ బెనువెల్లువం గడు భరంపడి నీవిటవచ్చుటెన్నఁగా
రెపరెపమంచులోగుబులు రేఁగెడు రాగమహాత్త్వ
మెట్టిదో ౨౬

ఉ॥ ఇంతటిసాహసంపుఁ బనులేల యొనర్పఁగ దాసురాలి కా
వంతయునన్ మనంబు రసికాగ్రణి! తెల్పఁగ వార్తనంపినన్
గంతునవచ్చినీదు పదకంజయుగంబున వ్రాలినీ కెటుల్
సంతసమట్టులూడిగము సల్పక యుందునె? భక్తియుక్తనై॥ ౭౭

కం॥ అనియిటు లాగణికామణి
వినయము నటియించు నేర్పువీఁకఁగని త
జ్జననియు జాణతనంబున
నను నిట్టులు వినఁగ సచివుఁడాదరమొప్పన్॥ ౭౮

ఉ॥ ఈనలినాస్య నాదుహిత యేమి యెఱుంగని ముద్దరాలు లో
కానుభవంబు లేనిది మహామహులౌ మిముఁ బోటివారి స
మ్మానము సేయురీతులన మాత్యవతంసమ! నేరనట్టిదీ
మానిని సైచి యేలుము ప్రమాదవశంబున నెగ్గు సేసినన్॥ ౭౯

చం॥ అనవరతంబు గీతనటనాభ్యసనంబులఁ జారుకావ్యపా
ఠనపఠనంబులందవిలి డాయదొకప్పుడుఁ దన్నుఁ జూడఁగాఁ
జనవునవచ్చునారసిక సత్తములన్ మొగమెత్తిచూ
డదున్
దనకెనయైననాయకుఁడు తారసిలండని చెప్పు నెప్పుడున్॥ ౮౦

సీ॥ కలహాభోజనమౌని గర్వంబు శమియింపఁ
బాటఁ బాడఁగ నేర్చెఁ బద్మగంధి
నటరాజు మెచ్చంగ నాట్యకౌశల్యంబు
దర్శింపగాఁ జాలు ధవళనయన
పలువకేనక్కజంబౌలయు నట్టులు చిత్ర
మును వ్రాయ నేర్చె నీపూవుఁబోఁడి

పలుకుఁదొయ్యాలి కూర్మి చెలికత్తెయోయనఁ
గవితఁ జెప్పఁగ నేర్చుఁ గాంచనాంగి

గీ॥ ఎన్ని నేర్చిన నేమి యోసన్నతాంగ!
మెచ్చి మెప్పింపఁ జాలెడు మేలువాఁడు
గలుగకుండిన నేమేమి కలుగ నేమి
యడవిలోఁ గాయు వెన్నెలయగును గాదె॥ ౮౧

గీ॥ వెఱ్ఱిగొదనేయు రోలంబవిసరమునకుఁ
బొందరానట్టి సంపంగిపువ్వుఁబోలె
నోటలేక యెతిరిగెడు వీటివిటులు
కదియఁగ మకింపరానిది కాంచనాంగి॥ ౮౨

కం॥ మాపడుచు పుణ్యసంపద
లేపారఁగ నాటి సభమహీసురవర్యా!
భూపాలవంద్యమా నీ
శ్రీపాదద్వయముఁగాంచుసిరి సమకూరెన్॥ ౮౩

కం॥ నినుఁగనిన నిముసమాదిగ
మనసిజ సమరూప! బాలమనమున నిన్నే
యెనయఁగ ననయముఁగోరుచు
గనగనఁ దపియింపఁ జొచ్చెఁ గంతుని కాకన్॥ ౮౪

గీ॥ నెయ్యమది యేడ బోగంపునెలఁత యేడ
వనుచు నెల్లిదముగ నెంచఁ జనునె యనఘ!
బురదలోపలఁ బుట్టియు సరసిజంబు
భాస్కరునిఁ గాక కాంచునే పరులసేరి॥ ౮౫

గీ॥ దేవదాసీవతంస మీపూవుఁబోఁడి
యరయమీకన్న దేవతలవనిఁగలరె

నీదు దాస్యంబునకు నొప్పు నెయ్యమెసఁగ
దీని నేలంగవలదె భూజానివంద్య॥ ౮౭

చం॥ అనియిటు వేశ్యమాత తనయావినయాదిగుణ ప్రశంసలన్
బనివడియింపు సేయుచు ననంగకుతూహలమేపుఁ జెంద నా
తనిమనముం గలంచుచు సుతంగని బేల! యికెప్డు నేర్తువే
కనుమిదె సామివారలతిగాఢముగా శ్రమఁజెందిగందుటల్॥

కం॥ కస్తురిపిడియం బిచ్చుచు
నిస్తంద్రత స్వామిచరణనీరజయుగముల్
హస్తములఁబట్టి యొత్తి ని
రస్తశ్రమముఁ జేయకుంట ప్రాజ్ఞత తెఱఁగే॥ ౮౮

కం॥ అని కనుసైగను దనతన
యను మంత్రివరేణ్యుపైన నట్లు ప్రయోగిం
చి నయముమీఱఁగ దేవా!
పనివినియెద విశ్రమింపు బడలికదీరన్॥ ౮౯

కం॥ ఈపగిది పలికి మోహా
కూపారమునందు విప్రకుమారునిముంపన్
నా పూర్వపుణ్యఫలమిటుఁ
జేపడె ననియతఁడు సంతసించుచుననియెన్॥ ౯౦

గీ॥ వానవంగుళ్లఁదడిసి దుర్భరపుశ్రమను
దారిఁగానక నాతలదాఁచుకొనఁగ
వచ్చియిటఁజేర నిది నీ నివాసమయ్యెఁ
బడఁతి తన్నినఁ బూసెజ్జఁబడినయట్లు॥ ౯౧

కం॥ అని తన నిలయము వెలువడి
చనుదెంచినపిదప నాఁడు జరిగిన సర్వం

బును ప్రియురాలికిఁ దెలియం
గను బలుకుచు నిట్టులనియెఁ గామవశుండై॥ ౯౭

ఉ॥ మోదముతోడఁ జంద్రముఖ! భూధవుసన్నిధిఁ జూచినంతనే
నీదగురూపుపాదుకొనె నెమ్మనమందునఁ; జాతకంబు వ
క్షోదయమాత్మఁగోరుకొనుచుండునటుల్ నినుగోరి లోకమ
ర్యాదనతిక్రమింపఁగ భయంపడి నీదెసరాకయుండుదున్॥

గీ॥ శాంబరీవిద్య మనకది సాధ్యమేని
యాడిపోసెడు లోకంబు చూడకుండ
నిచ్చవచ్చినతెఱఁగుల నెల్లప్రొద్దు
లిటిగవుంగిలి సర్వంబు మఱవవచ్చు॥ ౯౮

కం॥ అనివలుకు తులసిదాసుఁడు
తన దాసుండగుటెఱింగి ధవళేక్షణ యా
తని మనమునఁ బెనగొను భయ
మునుఁ బాపఁగ నిట్టులనియె మోహానలీలన్॥ ౯౯

గీ॥ ప్రాజ్ఞులైనట్టి మీవంటివారె యిటులు
వెఱపుఁజెందుటకన్నను వింతగలదె
సానినుంచిన గౌరవహానియున్నె
యదియు మంత్రిత్వలక్షణమగునుగాదె॥ ౧౦౦

గీ॥ నిజకులోచిత ధర్మంబె ఋజుపథంబు
పలలమమ్మియు వ్యాధుండు బ్రహ్మతత్త్వ
విదులతలమానికంబయి వెలయలేదొ
వేశ్యకులవృత్తి జారత్వవిధము కాదు॥ ౧౦౧

గీ॥ ఎవనినామాక్షరంబుల నవనియందు
వాసికెక్కినదీభూమి భరతవర్ష

మనఁగ; నారాజు తల్లినిగనిన తల్లి
వారభామినిగాక యెవర్తె చెపుమ॥ ౯౮

గీ॥ కస్తురియుఁ బుట్టు నాయామృగమ్ములందుఁ
బేరుకొనరాని నెలవులఁ బేరుకొనిన
గర్హ సేయుట రసికుల కర్హమగునె
గుణగణముగల్గుచోఁ గులగణనమేల? ౯౯

గీ॥ బ్రహ్మజాతికి నాల్గువర్ణములకన్య
కలను గ్రహియింపఁదగునంచుఁ బలుకఁబడదె
సంశయంబేల విధ్యుక్త సరణినన్నుఁ
బరిణయము సేసికొనఁదగు భవ్యచరిత॥ ౧౦౦

గీ॥ జాణతనమున నిట్టులాసానిమిన్న
వెఱపువాయఁగఁ బలుక మైమఱచి యతఁడు
గేహచింతనుబాసి దాసోఽహమనుచు
వేశ్యయింటను నివసించె వెగటుదక్కి॥ ౧౦౧

కం॥ నడివేఁపు తడియుదనుకనె
గడగడ చలియించు వడఁకుఁగాకటుపై నో
గడి దేరి నిర్భయంబుగ
గడువెఱుఁగక తానమాడఁగడఁగుంగాదే॥ ౧౦౨

గీ॥ సాని కుచగౌరవంబెంచి సచివవరుఁడు
కమ్మకస్తురిఁ బులుకంగఁ గడఁగుఁగాని
యాత్మకులగౌరవంబింతయైన దలఁపఁ
డదిర! మోహప్రభావమేమనఁగవచ్చు॥ ౧౦౩

కం॥ తరుణీదరహాసమునన్
బరవశతంబొంది మంత్రి పరికింపఁడుతన్

బరిపరివిలతముల లోకులు
పరిహాసము సేయుచుంట పన్నగశయనా! ౧౦౪

గీ॥ సర్వశాస్త్రంబులను నేర్చి ఛాత్రకోటి
సంశయగ్రంథులను విప్పఁజాలి గణిక
కంచుకగ్రంథి విప్పటకన్న వేఱు
గలదె పురుషార్థమునకు తండులుకులేక॥ ౧౦౫

గీ॥ ఇట్లు వ్యామోహవశుఁడై మహీసురేశుఁ
డఖిలవిశ్వంబు మఱచి వేశ్యాంతికమునఁ
దిరుగు క్రీడామృగమ్ములసరణి ననుస
రించి తమకించి యెపుడుఁ జరించుచుండు॥ ౧౦౬

కం॥ ఒకనాఁడక్కుటిలాలక
భ్రుకుటిం ఘుటియించి ప్రియుని పొందొల్లక తా
వికలాత్మవోలె నుండఁగఁ
దికమకఁగొని యతఁడు దానిఁ దేర్పఁగనంతన్॥ ౧౦౭

కం॥ ఎదియేకతమున నేర్పున
మదిరాక్షినిఁ బలుకరించి మానఁపుబిగి క్ర
క్కదలఁగఁజేయఁగ నెంచుచు
మృదువుగదరిఁజేరి విడియమిమ్మని యడుగన్॥ ౧౦౮

కం॥ విడియాకులొసఁగఁ దరుణీ!
విడాకు లింతటనె యీయ వేడుదె యనినన్
విడి పోకలందియిచ్చిన
గడిదేఱిన విటుఁడు నర్మగర్భితఫణితిన్॥ ౧౦౯

గీ॥ పొలఁతి నీపోఁకముడి విడిపోకవలతు
గాక వలతునె విడిపోఁక పోకలాఁడి

ఖాండవ బ్రాహ్మణున కిచ్చు చందమునను
వక్క లాకులు మొగమునఁ వై తె యనిన॥ ౧౧౦

గీ॥ చాలు సరసాలు నీజాలు తేలెనింక
నేలిమాటలు చాలవు బేలుపరుపఁ
బ్రీతిమొదలిన విడుచుట నీతిగాని
కల్లకూరిమిఁ బ్రకటింపఁ జెల్లునొక్కొ॥ ౧౧౧

ఉ॥ ఇంతటి మోసగాఁడవగు దీవని యెంచక నిన్నుఁ గోరినా
స్వాంతముసాంతమిచ్చితి, నిశాంతముదాటిక్షణంబయేనియే
సంతసుఁబోక సంతతము శ్రాంతి యెఱుంగక నీదుసేవల
త్యంత ముదమ్మునన్ సలుపనక్కట యీగతిఁజిన్నఁబుచ్చు వే

కం॥ నీవంటి వారిఁ బెనఁగుచు
భావజసమరంబునందు బడలుటకన్నన్
భావజజనకుని చరితలు
వే విధములఁ బాడియాడి వేసరుటతగున్॥ ౧౧౩

కం॥ అని యిటు నిష్ఠురమాడిన
వనితాదాసుండు మిగుల వగఁజెందుచు నీ
కినుకకుఁ గారణమేమే
మనసిజ సామ్రాజ్యలక్ష్మి! మనుపుము కరుణన్॥ ౧౧౪

శా॥ రోలంబాలక! నీకు నెయ్యమొదవ నారూఢంబుగా నిల్వనా
యాలిం బాసితి నిల్లువీడితినిఁ హ్రీత్యాగంబు గావించితిన్
కేళీలోలుఁడనాచు నీకెలన నక్షీణానురాగోర్ములు
ద్వేలంబై పొరలంగఁ దన్మయత నుత్సేకించి వర్తిల్లుదున్

సీ॥ కందొవల్ నీమోము చందురుంగాక యొం
డేమి చూడఁగ లేవు భూమిలోన

సామజయాన నీ సామవాక్సంపత్తి
ప్రసుతు లెల్లవేళలఁ శోభఁగాంచు
రసనున్నవన్ని నీరసమంచు రసననీ
యధరామృతంబాన నాసఁజెందు
వుడమిఁ ద్వాదన్యంబు ముట్టఁగానోడి నీ
కౌఁగిలి కోరునా కాయమెపుడు

గీ॥ జాగరంబున నిదురలో స్వప్నమందు
చిత్తమందిరమున నీవు చిందులాడ
నఖిలము భవన్మయంబుగా నాత్మఁదలతుఁ
బ్రాణసఖ పల్కు నాయపరాధమేమొ॥ ౧౧౬

గీ॥ అనిన వనజాక్షి బొటబొట నశ్రులొలుక
వట్టి నయగారములఁ గనుఁబ్రామఁ దగున
నన్నుఁ గన్నెత్తి చూచుటె యెన్ననీకు
నకట వెక్కసమయ్యె నేమందు నింక॥ ౧౧౭

ఉ॥ పాటవినంగ వేడ్కయగుఁ బాటలగంధి! యటన్న వీణియ,
న్మీటుచు భావరాగముల నీ ప్రణయార్ద్రినినై వెలార్ప మో
మాటయు లేక నీకనులు మూయుదె పాడినయంతవట్టువే
యేటికి నేటికిట్లు వెగటెక్కెనె యక్కట నాదుకూరుముల్

కం॥ అనినం దరహాసము మో
మున నొలయఁగ విటవరుండు ముగ్ధా! యిది నీ
కినుకకుఁ గారణమగు నా
కనుమూయుట పాటవినుటకై చూవెయనన్॥ ౧౧౮

గీ॥ కనులు మూయంగనలయును వినుటకొఱకుఁ
బాపజాతి కటంచును బలుకఁబడును

మనుజుల కదేల మాయలుమానుమనిన
సకియ! నినుఁగూడఁ గలిగె భుజంగపదవి॥ ౧౨౦

కం॥ కనుదెఱచి యుండువేళల
గనకాంగీ! నీదు నంగకంబులపైనే
కనులున్మనమున్నిలుచుట
వినరాదీవేమిపాట వినిచితివేనిన్॥ ౧౨౧

కం॥ వినఁగోరి నీదుపాటం
గనులారఁగ నీదుచెల్వు గాంచనితప్పున్
మనమునఁ గొనకిడె నన్నున్
ఘనస్తనీ! కౌఁగిలింపఁగదవే యనియెన్॥ ౧౨౨

కం॥ మధుసూదన! మాధవ! నర
రథచోదక! సర్వసాక్షీ! రఘురామ! మనో
రథచోదక! నారాయణ!
రథాంగపాణి! విజితారి! రాజీవాక్షా!॥ ౧౨౩

మా॥ సకల సుకవిగేయా! సద్గురుస్వామికాయా!
వికలహృదయదూరా! వీతరాగాత్మసారా!
శుకముఖనుత కీర్తీ! సూరిబృందాప్తమూర్తీ
సుకృతి కృతచరిత్రా! శుద్ధ చిత్తాబ్జమిత్రా!॥ ౧౨౪

## గ ద్య ము .

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహా విద్యాపీఠ స్థాపనా
చార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతోపాసనాసాదిత సరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీదాస చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
ద్వి తీ యా శ్వా స ము
ఓ మితి శివమ్.

శ్రీ

# శ్రీతులసీదాస చరిత్రము

## తృతీయాశ్వాసము



పత్త్రార్చితపాదా!
పాపధ్వాంతాబ్జమిత్ర! భక్తనిచయుని
క్షేపా! తాపత్రయహర!
రూపరహిత! నిఖిలలోకరూప! మురారీ॥

గీ॥ ఇల్లుఁబట్టక యారీతి నెల్లవేళ
లల్లవారాంగనా లోలుఁడైనవిధము
నల్లనల్లనదాసుని తల్లి తెలిసి
భోజనపువేళ నొకనాఁడు పొంతఁజేరి॥ ౨

ఉ॥ ఉల్లముపల్లవింప సరసోక్తులఁ గొల్వునఁబుట్టు వింతలన్
దెల్లముగాఁగఁ జెల్పుచు సతీమణితో నెకసక్కెమాడుచు
న్మెల్లన మృష్టభోజ్యములనేఁ బ్రియమారఁగఁబెట్ట తిండువీ
తల్లడపాటిదేలర సుతా! భుజియింపఁగఁ దీరకున్నదే॥ ౩

గీ॥ ఎన్నినాళ్లాయెరా నన్నుఁగన్నతండ్రి
తనివిదీరఁగ నీవు భోజనముసేసి

యొట్టి పురుషార్థసాధనకేని గాత్ర
పోషణము ముఖ్యమౌఁగాదె బుద్ధిఁదలఁప॥ ౪

గీ॥ బొట్టువెట్టంగఁ దగియెడు నట్టి క్షీర
మునను బ్రజాయామృతరసంబు నొనరఁగలిపి
నీకుఁగాఁజేసె నేర్పున నీదుపత్ని
యారగింపరతండ్రి! పాయసమొకింత॥ ౫

గీ॥ పాకనైపుణి మ్రదస్రవకరమునను
నవరసంబులు దొలుకాడ నలిననయన
మమతగావించె భక్ష్యభోజ్యములు నీకు
మారువడ్డించుకొని తృప్తినారగింపు॥ ౬

గీ॥ నవశిరీషసుమంబుల నవకమొప్ప
మమత మేనికి నెనవచ్చు మార్దవంబు
గలిగి హైయంగ వీనంబు నొలుకుచున్న
యీయపూపంబు నొక్కింత యెత్తిచూడు॥ ౭

కం॥ అని తరిమితరిమి వడ్డిం
చిన జననికి మారువల్క సిగ్గిలుచును వం
చినతల యెత్తకయే భో
జనమును నెట్లో చేసి చనఁజూచు నెడన్॥ ౮

గీ॥ ఆఁగుమొక్కింత తాంబూలరాగమేని
తోఁచు నీమోముఁజూచు కౌతుకముతోడ
వక్కలాకులుచేఁబూని ప్రణయమూర్తి
మమతవచ్చెదు నిదిగో విడ్యమునొసంగ॥ ౯

గీ॥ పండుటాకులమీఁద నీ స్వచ్ఛమైన
ముత్తియపు సున్నపుంబూఁత పొలుపు తలఁప

విరహాద్రోదూయమానయా వెలందిమేనఁ
పర్వుపాండిమమట్టుల వరలుఁజూమ॥ ౧౦

గీ॥ ముక్తసంగుఁడు మీతండ్రి పుణ్యతీర్థ
సేవఁజరియింపఁ గపిలుండు దేవహూతి
కటులు తెల్పుదు నీవు నాకన్న, నీకె
నేను చెప్పంగవలసె నింకేమియంట॥ ౧౧

గీ॥ కులము మర్యాద లెన్నక కులటనొకతెఁ
దగిలి కులకాంత నిరసింపఁదగునె తండ్రి
పావనంబైన తులసిని నేవగించి
లలిఁగలంజముఁ బోషించులాగు నకట॥ ౧౨

గీ॥ కుడుచునప్పుడు చవిఁజూపి చెడుగుదిండి
పిదపఁ బరిణామశూలఁ దోపించునటులు
సానితగులంబు పర్యవసానమందు
దుఃఖకరమంచు నీమదిఁదోఁపదేటులు? ౧౩

మ॥ విరహార్తిన్ నయనాబ్జయుగ్మమున నుద్వేలంబుగా బాష్పముల్
దొరఁగన్ నీకు నమంగళంబనుచుఁ దద్దుఃఖాబ్ధినింకించి, ని
ద్దురయుంగూడునరోసి నిద్దలఁచునీతోరంపుటిల్లాలిపైఁ
గరుణాపాంగములొక్కమారు పరగంగాఁజేయుమీ పుత్రకా॥ ౧౪

కం॥ అనిజనని హితముఁ దెలుపఁగ
వినయముఁబోనాడి యతఁడు వికవికనగుచున్
చనుఁబాలు ద్రావు బిడ్డకు
వినిపించినరీతి నీతి వివరించెదవే॥ ౧౫

మ॥ నను నేమన్న సహింతుఁగాని జననీ! నానాకళాచాతురీ
ఖనియౌ దానిని సానియంచును దిరస్కారంబు సేయంగ నో
ర్వను జూ దానికిఁ గల్గు నమ్రతయు విశ్వాసంబు సౌజన్యమే
ననితారత్నములందుఁ గల్గవు వృథావాగ్వాదమిం కేటికిన్॥

గీ॥ సానులందు నరుంధతీసతినిఁ బోలు
శీలవతులును గలుగరె? సిగ్గు లేక
కులము కాంతలు దిరుగరే కులటవృత్తి
యార్జవంబున్నె యభిజాతలైన మాత్ర॥ ౧౭

కం॥ అనికనలిపలికి యవినయ
మున జననిఁ దృణీకరించి పోయెను వారాం
గనఁ గనఁ దనతడయుటకది
మనమునఁ గోపించునంచు మనికితమెనఁగన్॥ ౧౮

కం॥ ఈరీతి నతడుడు ధర్మా
చారమునకు దూరుఁడగుచు సానులవాడన్
జేరిన దూరెడు నత్తను
వారించుచు మమత మృదులభాషనిటులనున్॥ ౧౯

ఉ॥ అత్త! యిటాడన్యాయమగునమ్మ! మహామహునీదు
సూను స
ర్వోత్తము ధర్మసూక్ష్మవిదు, నూరకె నాపతి జారకాంతలన్
హత్తెడునట్టివాఁడె? యలయంగనయం దెదియే ననన్యమా
నత్తఁగనంగఁబోలు గుణసాగరలుండరె వారకాంతలన్॥

కం॥ గండకియను వారస్త్రీ
మిండఁడెపతియన్న వ్రతము మొయికొని విమలా

ఖండయశంబుం గొని యా
ఖండలుపదమందె నట్టిగాథల్ వినమే॥ ౨౧

గీ॥ అనినఁ బక్కున నవ్వి రత్నాంబయంతఁ
బడుపుఁగత్తె పతివ్రతాత్వమును నెఱపు
వింతకతయేడ నేర్చితి వెఱ్ఱిపిల్ల!
ప్రొద్దుగడవను చెవుమ యాసుద్ది యనుడు
మమతయిట్లని వినిపించె మధురఫణితి॥ ౨౨

గీ॥ మచ్చరంబున నచ్చరమచ్చెకంటి
చెలువమును గెల్వఁజాలిన కలికితనము
గలిగి విటశేఖరుల కల్పకంబనంగఁ
గలదు గండకి యన్వారకాంత యొకతె॥ ౨౩

చం॥ తనుమదిఁ గోరి చేరెడు నతండు దరిద్రుఁడొ, భాగ్యవంతుఁడో
యనునను మానమూనక శుభాంగుఁడు వీఁడు కురూపి యీతఁడం
చనక, యరోగి రోగియని యారయకుండఁగఁ బూర్ణబుద్ధితో
దినమున కొక్క పూరుషు నతీమణి సేవయొనర్చు భర్తగా॥

కం॥ వింతగు పాతివ్రత్యముఁ
గాంతామణి యిట్లు నెఱపు కాలంబున శ్రీ
కాంతభజింపఁగ హారియే
కాంతంబున నున్న వేళఁ గలహాశనుఁడున్॥ ౨౪

గీ॥ దర్శనము గోరి యేతేర దానవారి
చనవు మెఱయఁగ రప్పించి సముచితాస
నమునఁ గూర్చుండఁబనిచి యో నారదా! వి
శేషములు దెల్పుమన్న నా సిద్ధుఁడనియె॥ ౨౫

మ॥ జగముఁ జేసి భరించి త్రుంపఁగల వ్రూ సర్వేశ! నీలోన నే
జగముండుం దలపోసి చూడఁగఁ బ్రపంచం బెల్లనీరూపె వ
న్నగశాయీ! భవదీయలీలఁగనియానందింపఁగాఁ గోరిము
జ్జగమేప్రౌఢ్ధులసంచరించెదను యుష్మత్కీర్తనాసక్తిమై॥

గీ॥ అఖిల భూతంబులకు నంతరాత్మ నీవు
తెలియనట్టి యుదంతంబుగలదె జగతి
నద్భుతంబులు నీలీల లబ్జనాభ!
నేఁ వినిపింప విన వేడుకేని వినుము॥ ౨౮

కం॥ అను నంతలోన వాణీ
వనజాసన సాంబశివులు పద్మాక్షునిద
ర్శనమునకే తేరఁగనా
మునివరుఁడా మువ్వురనిట్లు పొగడెఁ భక్తిఁ ॥ ౨౯

కం॥ వెలిచూపులఁ దిలకించుచు
మలినులుమిము మువ్వురని భ్రమంపదుదురు లో
పలిచూపులఁ దెలివొందిన
యలఘులు విూరొక్కఁడౌట యరయుదురెలమిన్॥ ౩౦

గీ॥ భేదబుద్ధిని హరియింపఁగాదె మున్ను
మూడుమూర్తుల నొక్కనై పొందుపఱచి
జగతి నవతారమెత్తి తీశ్వర! తరంబె
యద్వయ బ్రహ్మమయు లీరలంచుఁ దెలియ॥ ౩౧

గీ॥ నీవసృష్టింతు జగము వాణీసనాథ
క్షేమమరయుదునీవ లక్ష్మీ సనాథ
ప్రళయ మొందింతు నీవ యంబా సనాథ
పనులు వేఱౌట నామరూపములు వేఱు॥ ౩౨

గీ॥ అనుచుస్తుతియింప వనజాక్షుఁడలఁతి నవ్వు
చిన్నివెన్నెల మోముపైఁ జిందులాడ
వింత లేమాకు నీస్తోత్రవిధములివ్వి
క్రొత్త ముచ్చటలున్నవా కొనుమనంగ

గీ॥ అవధరింపుము దేవరా! యవనియందుఁ
గలదు గండకి యన్వార కాంతయొకతె
దానికెందుఁ బతివ్రతాత్వమున నెనయు
సతుల ముజ్జగమునఁగన జాలమనిన ॥ ౩౪

గీ॥ బూతుపొగడిన యట్టులా భోగకాంత
మహిమవర్ణించెదే? లోకమాత లొద్ద
సతుల గుణశీలములు బ్రహ్మచారి వీవు
తెలియ నేరుతెయంచు వాగ్దేవి నవ్వె ॥ ౩౫

గీ॥ కాలునిలుకడ లేక జగంబులందు
నలవెఱుంగక తిరుగు కయ్యాలతిండి
మాటలోకపాటిగాఁ గొనమనకుఁదగునె
యనుచులాఘవ మొనరించెనబ్ధితనయ ॥ ౩౬

గీ॥ మగనివలనునఁజిక్కిన సగము మగువ
సతుల చరితంబులని నిజపతినిఁజూచి
యూరకుండెను బలుక కర్ధోక్తిలోనె
సిరియు, వాణియుఁ బకపక చెలఁగినవ్వ ॥ ౩౭

ఉ॥ అంతట శౌరి దేవముని యాననముందిలకించి భారతీ
కాంతవచించు వాక్యములు కంజనివాసిని పల్కుతీరునా
లింతె ఛలోక్తి కాడితొవలీముఖచిత్తలుగారె భోగపుం
గాంతలునారదా!నిజముగా వచియింపుముసానివృత్తముఁ

గీ॥ అనినఁ జేతులు జోడించి యబ్జనాభ!
లోకమాతల శీలంబుమీఁక యెఱుక
వారివర్ణింపఁగా నాకువశమె, యల్ల
సానికోనగోటిఁ బోలరే మానినులన ॥ ౩౯

కం॥ అరవిందాక్షుండంతట
దరహాసము మోముపైనఁ దాండవమాడన్
బరిహాస లీలమై యిం
దిరఁ జూచుచునిట్టులనియె దేవమునికిదా ॥ ౪౦

కం॥ మానసతిమున్నగు ముప్పూర
మానసతులని విడిచిపుచ్చి మాకఁదలఁకుం
జేసితి గౌరవమైనన్
మానసంగతి తెలియకున్నె మాలోమాకేన్ ॥ ౪౧

శా॥ నాసంసారము నీవెఱుంగవె జగన్నాధుండనన్ బేరుగా
నీసంకోచమువీడి చెప్పెదను, బల్మిచాపలత్వంబునన్
వాసింబాసి కృశించి దాఁడువయితిన్ భక్తాళినన్నెప్పుల
శ్రీమన్సంభావ్యుఁడనంచుఁ బేర్కొనమదిన్ సిగ్గయ్యె
దున్ నారదా! ॥ ౪౨

కం॥ నినుబోలు నాప్తులొద్దను
మనసువిచ్చఁగల భారముడుప మాటాడుటకేన్
వనజాసనుండు నోవఁడు
తనతలవాకిటను వాణితలఁగక యుంటన్ ॥ ౪౩

కం॥ శర్వుండాకరుఁడై మాలోఁ
బార్వతిఁ గరఁగించె నామెవశవర్తినియై

నిర్వృతినిఁ జేయువానికిఁ
బర్వతమే వంచినాఁడు పార్వతిలెక్కే ॥ ౪౪

గీ॥ అనిన గౌరీశుఁడిట్లను నబ్జనాభ!
తడవ నేమిటికయ్యె మాగోడ వయిచట
కలఁతివెట్టకు మాసహోకాళి కిప్పుడు
కొమ్మ కరుణింపదే నళకుండఁగాను ॥ ౪౫

గీ॥ అనుడుఁగటకటఁ బడివారి తనయ యంత
నకట యిల్లాండ్రనిటులాడ న్యాయమగున
వనజ దళనేత్ర! నీకనపాయిని నయి
యెపుడు భజియించుచుంట నీవెఱుఁగవొక్కో ॥ ౪౬

గీ॥ ధరణిలోపల రామావతారమందు
నకట! నను నీవుపాఁ(?) నయుట్టి పాట్లుఁ
జేసినట్టియవజ్ఞయు వాసుదేవ!
మఱవ వచ్చునె యెన్ని జన్మములకైన ॥ ౪౭

కం॥ చలనంబెంతగఁ గల్గిన
జెలియలికట్టలను మీఱు చెన్నటి తనముల్
గలుఁగవు తెలియవొకో మా
కులమున గోపాలబాల! గోపీలోలా ॥ ౪౮

ఉ॥ కోడలు మాటకారియని కోడిగమాడినఁ నాడుకొందుమీ
తోడని పార్వతీరమణి దుష్టత నాఁచిన దాఁచుకొందువా
యోడుచు మీహృదబ్జమున నొత్తిలి నే పడియుండనన్నుని
ట్లాడుట నాడుపెద్దఱిక మాఱడి వ్రానిదిమీకుఁ బాడియే॥

కం॥ పన్నగశాయికి నంతటఁ
బన్నగభూషుండు పలుకుఁ బద్మాలయ

నిల్లినప్డు గాం బాడికొంటో ద్రిజ
గన్నుత సచ్చరితయగుటం గనకుండుదు మే ॥ ౫౦

సీ॥ మును మీనయిననాఁడు మురవైరిసీకొటి
యగుటం దెల్పెడి చూడు మక్షియుగము
ఘలియాచుసీతోడ మెలఁగినందునఁ జూడు
నీగాళ్ళ చందంబు మేఘవర్ణ!
కిటవౌచు జంబాలపటలి నీవుంట చే
పంకేజమే, రాణివాసమయ్యె
మెప్పింపఁ గోరినిక్ మృగరాజమధ్య దా
నకనకంబడియెగా నారసింహ!

గీ॥ దైన్యమున నీవువడుగవై దైత్యు వేడ
నుమ్మలించెనుగాదె కృశోదరి మును
పెన్ని చేసిన విశ్వాస మింత లేక
లాఘవంబునఁ దగవె యీలాగుపలుక ॥ ౫౧

గీ॥ అనుడు మధుసూదనుఁడు మందహాస మొప్ప
మెలు శ్రీకంఠ! యొక్కింత మేలమాడఁ
గమలతోఁ బొటు నీవును గయ్యమునకుఁ
గాలుద్రవ్వుట యిది వివేకంబె చెపుమ ॥ ౫౨

గీ॥ అనుచునిందిరఁ జగరీతి నబ్జనాభుఁ
డూరడింపఁగ నంతనాసారసాక్షి
స్వామి! యెట్లైనవచ్చు నీసానిదానిఁ
బోలుసతులెందు లే-ను పోడుపు లనిన ॥ ౫౩

చం॥ అరనిముసంబయేని కమలా! భవదీయకటాక్షలేశ మే
నరుపయిఁ బర్వెనోయతఁడనంతధనంబులతోఁ జెలంగెడుక్

అర నిముసంబ యేని వెలయాలి కటాక్షము పక్వోనేనిసు
స్థిరచిర సంపదున్నతులు చేద్పడు సానికి నీకు సాటియే ॥

గీ॥ సుదతి యొరులనుగూర్చి యసూయతగు న
యల్ల యనసూయపై బోటికరిగి మున్ను
మమ్ముఁ బఱచిన పాటులు మఱచినావె?
వాసికెక్కితె యామెతోఁ బంతమాడి ॥ ౫౫

గీ॥ తగదహంభావ మెటువంటి తరుణికైనఁ
బతనమే యగునమ్మ ముద్ధతులకెందు
వారభామినితో నీకుఁ బంతమేల
యనుచు హరివల్క శ్రీకాంత కనలియనియె ॥ ౫౬

ఉ॥ ఎన్నఁడు మేరమీఱని సమిద్ధచరిత్రుని పుత్రినైననా
సన్నిధి సానిదానికినిఁ జాలరులోకములోని కాంతలం
చెన్నొడు నారదుండకట యీ వెడమాటలునైచి యిపుడే
మిన్నక యున్నలోకములు మెచ్చునె నన్నిఁక గేలి సేయవే॥

కం॥ మగవారెనిన్నుఁ గాంచిన
మగతనములు గోలుపోయి మరులు కొనంగా
మగువలఁ జెప్పగవలె నా
నగధర! చెఱుపఁగ లేవె నర్తకి వ్రతముల్॥ ౫౭

గీ॥ పలుకులిఁక నేల యిల్లాలిపరువు నిలుప
నీకు బరువయ్యెనే గద నీరజాక్ష!
అన్న! శంకర! కావుమీవైన ననఁగఁ
గమల కన్నులుదాల్చె కంకణములంత ॥ ౫౮

గీ॥ శంకరుడంత నిట్లను సరసిజాక్ష!
వింతయాగండకీ కాంత వితముకొంత

చూడనాకును నొక్కింత వేషుక య్యెఁ
బోయివత్తుమురండు సమ్మోదమొసఁగ ॥ ౬౦

గీ॥ అనినసంగీకరించిరి హరియు విధియు
నంతముమ్మూర్తులవనికి సవతరించి
వారకాంతను జూడఁగా మాఱువేస
ములు ధరించిరివారిలోఁ బురహరుండు ॥ ౬౧

సీ॥ మేనిపైఁగలయంత మేర భస్మత్రిపుం
డ్రముల రేఖలు విశారముగఁదాల్చి
మనికట్టులను కంఠమునను కర్ణములందు
రుద్రాక్షమాలికల్ పొదువఁజుట్టి
కుడిచేతితో నొక్క కడిఁది గంటవహించి
డాచేతితోఁబట్టి డమరుకంబు
జోలియనొకచంక వ్రేలంగఁగట్టి వే
ఱొకట మాసినప్రాఁత లొత్తిపట్టి!

గీ॥ తిరిపెమెత్తెడు జంగంబు దేవరవలె
వేశవాటికఁజొచ్చి యావిశ్వనాథుఁ
డల్ల నల్లన గండకి యిల్లుసేరి
జయమహాదేవయనుచు బిచ్చంబుగోరె ॥ ౬౨

గీ॥ భిక్షుకుని కేకవిని నీరజాక్షి హరుని
యర్చనకుదెచ్చె నక్షతలనఁగఁగుంద
సుమములను బోలనగు తండులములుకొన్ని
చిగురుదోయిలిఁబట్టి తాఁజేరవచ్చె ॥ ౬౩

చం॥ తనదెసవచ్చువారవనితామణి గన్గొని యాదిభిక్షుకుం
డనుననఁబోఁడి! నిన్గనినయంతఁబురాంతకుకంటిమంటలన్

జనినమనోజహాంతకుఁడు చయ్యన తా పెనుభూతిమాచునన్
జెనకుఁగటా! యుపాయ మెదో చెప్ప ముపాయముగల్గకుం
డఁగన్॥ ౬౪

కం॥ అక్షతలేలా నీదం
తక్షతములె ముదము గూర్చి తనియఁగఁ జేయున్
రక్షింపు దయను తామర
సాక్షీ! మరుబారినుంటినని ప్రార్థింపన్ ॥ ౬౫

కం॥ కులకాంతఁ గానునే లో
కులకెల్లను గాంతనగుదుఁ గులమున గణికన్
వలచితవ యేని నేఁటికిఁ
గొలిచెదనిను భర్తగాఁగఁ గూరిమినననిన్ ॥ ౬౬

ఉ॥ దారువనంబులోన జడదారుల పత్నుల ముద్దరాండ్రసం
సారముఁ బాపి యేలుకొనఁజాలితి మా ధనలాభమాసతుల్
గోరకయుంట. నీగణికకుం బరితుష్టి యొనర్ప నెట్లు చే
కూరుతు సొమ్ము టంచు మదిఁ గొందల మందినరీతి దీనుఁడై॥

సీ॥ పాడిపంటలు లేవు పైడిరాసులు లేవు
కలదెల్ల మాకొక్క గంగిరెద్దు
మాణిక్యఖచితమౌ మందిరంబులు లేవు
మాకున్నయదియెల్ల మంచుకొండ
మేన గట్టఁగఁ జుట్టఁ జీనాంబరము లేదు
వెలిపెమెల్లను మాకు వెల్లబూది
రాచరికము లేదు రాజాశ్రయము లేదు
వ్యాపారమదియెల్ల భైక్షవృత్తి

గీ॥ ధనవిహీనుఁడ నే నెట్టులలరుఁబోఁడి
పొందగలవాఁడ నిను నీ[illegible]ఁ గూడ
కెటులు గెల్చెద నకట! పుత్రదేహుఁ డావు
నేమియందు వృయింక నాకేమి గతియొ ॥ ౬౮

గీ॥ కాలునకుఁ బాఱి మును మృకండు సుతుఁడు
హరుని వెనఁగిన చందాన నలరుఁబోఁడి
యసమసాయకు వలని భయంబు పేర్మి
శరణమీవంచు నమ్మితిఁ గరుణఁజూడు ॥ ౬౯

కం॥ నిరుపేదతనముఁ దోఁపఁగ
హరుఁ డిట్టులు పలుక జంగమయ్యా! యేలా
యరమరిక నిన్ను నేటికి
వరియించెద భర్తగాఁగ వ్రతమిది నాకున్ ॥ ౭౦

చం॥ చనువున నన్నుఁ జేరెడు భుజంగుఁడు పేదయొ భాగ్యవంతుఁడో
యని యనుమానమూనను శుభాంగుఁడు వీఁడు కురూపి యాతఁడం
చనన యరోగి రోగి యని యారయనే వినుపూర్ణబుద్ధితో
దినమున కొక్క పూరుషు నతిప్రమదంబునఁ గొల్తు భర్తగా॥

సీ॥ అనిపల్కఁ గండకియతనిఁ దోడ్కొనిపోయి
యర్ఘ్యపాద్యములిచ్చి యాదరించి
బడలిక తీఱంగఁ బాదంబులను బట్టి
వింజామరముతోడ విసరియంతఁ
గమ్మనూనియఁ దెచ్చి కరకంకణక్వాణ
ములు సెలంగఁ దలంటి నలుగు వెట్టి

గమకించునంతఁ, న్నా కాంత విస్మయ మొంద
విట వేష ధారుఁడౌ విపు నేత్రుఁ

గీ॥ డొడలి నిండను దుర్గంధ యుతములగుచు
నంటఁజేరఁగఁ జూడఁగా నలవిగాని
వ్రణశతంబులఁ గాన్పించె వారవనిత
ప్రతిపటుత్వము నొక్కింత పట్టిచూడ ॥ ౮౨

ఉ॥ ఏవ మొకింత లేక నలినేక్షణ వాని వ్రణాంబులన్ని నే
ర్పావహిలంగఁ గడ్గి వినయంబెసఁగన్ మృదుశయ్యఁ జేర్చి సం
భావన మొప్పవానికి సపర్య యొనర్చుచుచు నిదకొల్పగా
భావజతుల్యసుందరుఁడు బ్రాహ్మణుఁడొక్కఁడువచ్చె నంతలో॥

గీ॥ బ్రహ్మ తేజంబు రూపొంది వచ్చెననఁగఁ
బొలుచు విప్రున కంతనాముద్దుగుమ్మ
యతిథి సత్కార మొనరింప నల్లనగుచుఁ
దేనెలొలికెడు భంగి ధాత్రీసురుండు ౮౩

సీ॥ అళికులంబునకన్న నలుపెక్కఁగాకనీ
యలక లెల్లప్పుడుఁ గులుకులాడి
అబ్జవైరికిఁ గల్గుహానివృద్ధులు లేక
నీ మోము పెంపొప్పు నిలుచఁగాక
పతనంబు లేక యుద్ధతి నెసంగెడుఁగాక
జక్కవకవ మించిచన్నుఁదోయి
అడుసుఁ ద్రొక్కక ధర్మహార్మ్యం తరమ్ముల
నడుగు దామర లెప్డు డలరుఁగాక

గీ॥ లలిత కళలకు నెల్లను నిలయమగుచు
ధరణివిటులకు మేలిచింతామణివయి

యాయురారోగ్యములు గలిగియనవరతంబున్
వరలుచుపుగాక నిత్యసౌభాగ్యగరిష్ఠన్.

కం॥ అన్నులమిన్నా! నీసాగ
సెన్నగ నావాణి చాలదేలా మాటల్
తిన్నగఁ గౌగిటఁజేర్చి ప్ర
సన్నతనన్నేలుమింక సఖ! యను నాలోన్ ॥ ౭౬

కం॥ అబ్బబ్బ! యితఁడు మన్మథు
నబ్బసుమీ రూపమెన్ననసఁదగునొకఁడా
బిబ్బోకవతినిఁ జేరినఁ
దబ్బిబ్బై యదియుభక్తిదళుకొత్తంగన్ ॥ ౭౭

కం॥ వినయమున లేచి మ్రొక్కఁగఁ
బ్రణయము దీపించు చూడ్కి రాజీవాక్షిన్
గనుఁగొని వనితాజనతా
మనోహరుండతఁడు మృదుల మధురోక్తులతోన్ ॥ ౭౮

కం॥ సిరిలెక్కఁ గొననుజూ నీ
పరిరంభ సుఖంబు గలుగవసుధన్ నీమం
దిరమే వైకుంఠంబని
కరిగమనా! యుగము క్షణముగా నెంతు పదిన్ ॥ ౭౯

చం॥ అనవుఁడు వారకాంత వినయంబున సిగ్గునుధన్యనైతినే
ననఘచరిత్ర నీవిటుల యాచితరీతిని నాదు మందిరం
బునకరుదెంచి ప్రీతిననుఁ బొందఁగఁగోరుటఁ జేసియైననా
మనవిని చిత్తగింపు నియమంబొకఁడున్న దలంఘునీయమై॥

కం॥ దినమున మునుముందెవ్వఁడు
మనమునననుఁగోరినాడు మందిరమునకున్

జనుదెంచు నతఁ డేనాఁటికి
నను నేలఁగఁ దగినయట్టి నాథుండనఘా ౮౧

గీ॥ మొదట నుదయంబున నెనన్నువాఁడిసెఁ గోర
యల్లజంగంబు దేవర యరుగుదెంచె
వెనుక నరుదెంచె నంత నీవిప్రవరుఁడు
వ్రతము నేఱవేర్పనలయు నెబ్భంగినైన ॥ ౮౨

కం॥ తడయఁగ రాదిట నాతని
యొడలెల్లను వ్రణములయ్యె నుచితవిధిన్నె
బడలక సేవయొనర్పఁగ
వడి నేఁగఁ గవలయుఁ బోయివచ్చెదనింకన్ ॥ ౮౩

కం॥ వారాంగన యిట్లనఁగా
నారాయణుఁడా పెఁగాంచి నవ్వుచుఁబలికెన్
ఔరా! జాణతనంబున
నీరీతిఁ నుండ వలదె యింతులకిలలో ॥ ౮౪

కం॥ లంజెకుఁ బాతివ్రత్యము
వంజకుఁ జనుబాలు కటికవానికి దయయున్
గంజాక్షి కలవె నీకీ
జంజాటంబేల వినిన సరసులు నగరే ॥ ౮౫

కం॥ సిరిగలవాఁడనునిన్నుఁ గ
వరియించినవాఁడ రసిక వర్యుఁడవలతే
నఱచేతన్ వైకుంఠముఁ
దరుణీ చూపంగఁజాలు దక్షుఁడనగుదున్ ॥ ౮౬

కం॥ అదిరా! వెలయాండ్రిల సం
పదరా నెదురేగి పొదివిపట్టక యిటున

మ్మదురా యీాము దిజంగము
మదిరాక్షీ చెదరెనేమొ? మానసమిపుడున్ ॥ ౮౭

ఉ॥ ముద్దులగుమ్మ జంగము విభూతికిమెచ్చితొ కాకవాని గం
గెద్దునుజూచిమేలు పడితే, చెడఁబుట్టితి సానులందునీ
సుద్దులమాని పంచశరసుందరులై నినుఁగోరియున్నవా
యిద్దరిలోన నొక్కని యభీష్టము నేటికిఁదీర్పఁ గాఁదగున్॥

కం॥ అనగా నిట్లనెవారాం
గనయనఘా! నీకుఁ దెల్పఁగాఁ జాలుదునే
మనమునఁగినియకనీదా
సినినన్నున్ సైఁచుపురుషసింహామ! వినుమా ॥

కం॥ నాలుఁగు పురుషార్థంబులఁ
జాలఁగఁగామంబునందె సహజముగ నరుల్
లోలత మెలఁగుటఁ గులసతి
శీలముఁగాపాడ ధాతసృష్టించెమమున్ ॥ ౯౦

ఉ॥ రూపమురూపహ్యమా యనికిరూపులఁ బేదలనొల్లమనివా
రాపఁగరాని కామవశులై కులకాంతబలాత్కరించినన్
బాపము లేపుచెంది యనవద్యకులంబులు సంకులంబులై
లోపముఁ జెందవే? వసుధలో సకలంబగు ధర్మపద్ధతుల్॥

కం॥ ఒకనికి నొడఁబడి పైవే
ఱొకఁడా తనికన్న భాగ్యయుతుఁడని ప్రథమున్
గికురించి నఁ బేరీసునఁ
బ్రకటముగాఁ బోరుగాదె వారిద్దఱకున్ ॥ ౯౨

కం॥ అన్నల మిన్నకున్నైమును
పన్నకుఁ దమ్ములకుఁ గలహమగు ననికాదే

పన్నను వార్షిక నియమం
బన్నారదమౌని పాండవాగ్రమహిషికిన్ ॥ ౯౩

కం॥ బృందారకబృందమ్ములఁ
జిందర వందరలు గాఁగఁ జెనకిన శూరుల్
సుందోపసుంద దైత్యులు
సుందరినొక్కర్తు వలచి చూచెడుటరయన్ ॥ ౯౪

కం॥ ఉల్లము మధురిపు పదముల
నిల్లడఁ గావించి నియతవృత్తినిమదిలో
నొల్లమియు వలపులేకే
నెల్లరకును దాసినగుచు నిష్టముఁ దీర్తున్ ॥ ౯౫

గీ॥ ఈయఁజాలిన విటవర్యుఁడిచ్చ నేని
భక్తిఁ గైకొందుఁ గనకంబు శక్తిలేని
విటుని లేమిడిఁ గనిపెట్టి విసుగుకొనక
వలయుధనమిచ్చి పంపెదనలఘుచరిత ॥ ౯౬

కం॥ మోమోటమేల చెప్పెద
నామనమున కెక్కవింకనయ గారంబుల్
సామీ! మ్రొక్కెద నేఁటికి
నామనవిని చిత్తగించి నయమునఁ బొండీ ॥ ౯౭

గీ॥ ఇట్లు నిష్కర్షగాఁ బల్కి యింతియంతఁ
గినియ వలదంచు భక్తివందనముసలిపి
వారివీడ్కొని యింటిలోపలికి నేగి
జంగమట్టులు దోఁచుభుజంగుఁ జేర ॥ ౯౮

గీ॥ కపట విటవేషధారి యాగణికఁ గాంచి
యంతరుగ్మత కల్గినట్లార్తుఁడగుచు

మూల్గియిటునటు పొరలి వాపోయి జన్ని
గొన్నరీతిని నేమేమొగోణగు కొనుచుఁ
దుదకు మృతిని నటించె మృత్యుంజయుండు ! ౯౯

గీ॥ అంతఁగలవరపడివారకాంతయిరుగు
పొరుగువారల రప్పించి ముసలివిటునిఁ
జూపనెల్లరుఁ జచ్చెను జమియితఁడని
తెలుప మదిలోన సామె చింతించెనిట్లు ! ౧౦౦

కం॥ నాపొందున నానందము
చేపడునని ప్రీతియొసఁగఁ జేరినయతఁడి
ట్లాపదను జెందెనక్కట
నాపాపమె కారణంబనంగావలయున్ ॥ ౧౦౧

కం॥ ఏయూరో యేపేరో
యీయనదకు బంధులెవరో యెవ్వారిఁ బిల్తున్
నాయింట నొక్కఁడిట్టులు
కాయము బాయంగ జనులు కాఋలఅవరే ౧౦౨

కం॥ ధృతిఁదూలక సహగమన
వ్రతమునఁ జితి నెక్కితనువుఁ బాయన యేనిన్
బతియగు నాకున్ విటుఁడను
కతలెల్లను వితథమగునుగా యీనాటన్ ॥ ౧౦౩

కం॥ పురుష శతసంగమంబునఁ
బరిభూతంబైన తనువు వహ్నిని వేల్వన్
బరువును బరిభవమెఋఁగని
పరిశుద్ధంబైన యాత్మ బ్రహ్మము గలియున్ ॥ ౧౦౪

గీ॥ అట్ల యభిమన్యుకోడుకునకు టులునాకు
శౌరిపదవియఁ గలిగె భుజంగమరణ
మనుచుఁదలఁచెద వగచి యబ్జనాభ
చింతనంబునఁ జితిపైనఁ జేర్చుమేను ॥ ౧౦౫

గీ॥ ఇట్లు దృఢముగ మదనిశ్చయించి యంతఁ
జితిని బేర్పించి శవమందుఁ జేర్చి యంత
బ్రాహ్మణోత్తములకును సువాసినులకు
నర్థి నొసఁగెను దనకున్న యర్థమెల్ల ॥ ౧౦౬

గీ॥ తరుణి ముమ్మారు చితికిఁ బ్రదక్షిణంబు
సలిపి నిశ్చలభక్తిమై శౌరిఁదలఁచి
యగ్గిదగిలించి శాంతాత్మయగుచుఁ దాను
నధివసించెను జితిని దా నద్భుతముగ ॥ ౧౦౭

గీ॥ చుట్టుమూగిన జనులెల్లఁ జూచుచుండ
మృతకళేబరమంతట మింటికెగసి
యంతలో మాయమైపోయెఁ నచ్చరలును
బూలఁగురిసిరి సానిపూఁబోఁడిపైన ॥ ౧౦౮

గీ॥ అనలకీలల మాఱుగా, సనలసోన
లతివమైపోక నొదవిన యబ్బురంబు
విటశవంబట్లు మాయ మావితము కతన
నినుమడింపగ నిదిస్వప్నమే మొయనుచు ॥ ౧౦౯

కం॥ వెలవెలఁ బోవుచునప్పుడా
వెలవెలఁదుక భ్రాంతయైన వేఃనునెదుటన్
వెలసిరి, హరియుంజదువుల
తెలఁది మగండును శివుండు వినువీధిపయిన్ ॥ ౧౧౦

గీ॥ అట్లుసాక్షాత్కరించిన హరిహరాది
లోకనాథులఁ బ్రీతినాలోకనంబు
చేసియానందమునఁ జొక్కి చేడెఁగాంచి
వెన్నుఁడిట్లనెఁ జెలునవ్వు వెన్నెలోలయ ॥ ౧౧౧

కం॥ ముదితా! నీవరియించిన
ముదిజంగంబీ హరుండె భూసురుఁడై నిన్
గదిసినవాఁడీ నలువయె
పిదపన్నినుఁ జేరువిటుఁడ వెన్నుఁడనేనే ౧౧౨

కం॥ నీచరతి శీలమయ్యెను
నీచరితంబనఘమయ్యె నిష్కపటంబై
తోఁచుట మేచకకుంతల
వేచనవునఁ గోరునీయభీష్టంబిత్తున్ ॥ ౧౧౩

చం॥ అనుచుమురాంతకుండు కరుణాతిశయంబునబల్కఁ గండకీ
వనితవినమ్రమై పలుకుఁ బద్మదళేక్షణ! దాసురాలనౌ,
ననుఁగృపనెంచిసంయమిజనంబులకున్ సులభంబుగాని మీ
యనుపమదివ్య దర్శనమహా! దయచేసితి కేమికావలెన్ ॥

కం॥ సిరియును రూపము విద్యయు
సరసతయును గొఱఁత లేక సరసిజనయనా
వర లెదునీయురు కరుణను
బురినెల్లెడ రసికవరులు పొగడ నెగడుదున్ ॥ ౧౧౪

కం॥ వెలిచవులఁ దవులు తలఁపులు
కులకాంతకె కల్గు మదినిఁగూడని వగుటన్
వెలయాల నైననాకో
జలజాక్షా! వలపివెక్కసంబై తోఁచున్ ॥ ౧౧౫

కం॥ ఆశాలేశం బొక్కఁడు
దాశరథీ! నాకుఁజాల తడవుగ మదినా
వేశించినిన్నుఁ జూడఁబ్ర
కాశసిద్ధిఁ బొందెఁదీర్పఁగాఁదగు దానిన్ ॥ ౧౧౭

కం॥ తనయుల నయమున యదుసుత
కనిపెంచని లోపమొకఁడు గలఁచుఁ మదినీ
చనవునకుఁ దగుదు నేనిఁ
దనయుఁడ వగుమయ్య నాకుఁదామరసాక్షా॥ ౧౧౮

గీ॥ మారజనకుండె రహినాకుమారుఁడైన
మారపరతంత్రతను బాసి మమతఁ గోసి
నందసతి పోల్కి యనుపమానందమునను
దేలిసంసారవార్నిధి లీలఁగడతు ॥ ౧౧౯

గీ॥ తనదుకులవృత్తికిని విరుద్ధంబుగాఁగఁ
గొడుకవగు మంచు వెలయాలుగోరనిటులు
నొక్కత్రుటి విస్మితుండౌచు నూరకున్న
శౌరిఁగనుగొనియిట్లనె సాంబశివుఁడు ॥ ౧౨౦

కం॥ ఆడుది వేడినఁ బాడియె
వేడబమొనరింప నీకుఁబృథ్వీస్థలిపైఁ
గ్రోడంబవగుట కన్నన్
గూడని పనియానె లంజ కొడుకగుట హరీ॥ ౧౨౧

కం॥ అనిపలుక శౌరి మదిలో
గినిసిన చందంబుఁదోప గిరిజాపతికి
ట్లను నాదుతత్త్వ మెఱిఁగియు
చనునే మేలంబులాడ సమయంబిదియే ॥ ౧౨౨

ఉ॥ శంకర! చాలునింక నెకసక్కెము నాకవతార లౌల్యముల్?
కింకరులౌచు నిండుమది కేవల భక్తిని గొల్చువారి కే
యంకిలి సెప్పకే దయిన నర్థిని గాంచుట నా స్వభావమీ
పంకజనేత్రకోరిక నవశ్యము దీర్తునపూర్వవైఖరిన్ ॥ ౧౨౩

కం॥ అనినిండు ప్రీతి గండకి
గనుగొని హరియిట్టులనియెఁ గమలదళాక్షీ
ననుఁగొల్చు భక్తులకుఁగా
దనఁజాలను వారలెద్ది యడిగిరయేనిన్ ॥ ౧౨౪

కం॥ కొమ్మా! చిరకాలముసౌ
ఖ్యమ్ములనోలాడి పిదపగండకియనఁగా
నిమ్మహి వాహినివై నీ
విమ్మల జీవనమునిమ్మ యెల్లరకెపుడున్ ॥ ౧౨౫

కం॥ సాల గ్రామమునైనే
గ్రాలుదునీ గర్భమందుఁ గంజానన! యీ
లీలన్ నీపుత్రుఁడనై
చాలఁగ నీసచ్చరిత్రఁ జాటెద మహిలో ॥ ౧౨౬

గీ॥ వేశ్యకిట్టులు వరమిచ్చి వీడుకొలిపి
వెలవెలంబోవు కలుముల వెలఁదిఁ గమల
గర్భసతిఁ జూచివారల గర్వముడువఁ
బలికె మురవైరి గంభీర భాషణముల ॥ ౧౨౭

చం॥ జగడము తిండిపోతనుచు సారెకు నారదుదూరుచుండుటీ
జగతిని పామరత్వమున సత్యమెఱుంగఁ గనేరిశక్యమా
జగడములేలకల్గు నరిషట్కము గీటునఁబుచ్చి దృశ్యమా
జగమిది యెల్లనేననుచు శాంతివహించిన వారికెన్నఁగన్ ॥

కం॥ మమతా హంకృతులను వెన
వమనము సేయించి శుద్ధభావులఁ జేయున్
జుమి యీనారద మునియీ
వమూతోఁ గర్యాలఁ బెట్టువాఁడను నేనే ॥ ౧౨౯

కం॥ తనుమించిన గుణవంతులు
కనరారే యెడనటంచు గర్వముతోడన్
మినుమన్నుఁ గానకుండిన
వనజేక్షణ లార! పరిభవంబగు రూఢిన్ ॥ ౧౩౦

ఆ॥ ఇట్లు హితముఁ దెల్పియింతుల బోధించి
కమలజునకు గరళకంఠునకును
సెలవొసంగి పంపి సిరితోడ నేతేర
తనదులోకమునకుఁ జనెమురారి॥ ౧౩౧

కం॥ అత్తా! యీకథ వింటివె
యుత్తములెందైననుందు రూరక యేలా
యుత్తలపాటున దూఱఁగఁ
జొత్తువు నీసుతుని పరమశోభన చరితున్ ॥ ౧౩౨

కం॥ సృష్టిస్థితిలయ కారణ!
శిష్టావననిపుణ! దుష్టశిక్షాదక్షా!
అష్టాంగయోగ సులభా!
అష్టైశ్వర్య ప్రదాన! అఖిలనిదానా! ౧౩౩

మా॥ శమదమయుతవశ్యా! సత్త్వసంక్లేశనస్యా!
కమలదళ నిభాక్షా! ఖండితారాతిపక్షా!

శమితసుజన పాపా! సాధుచిత్తప్రదీపా!
రమితసకల గోపీ! రమ్యగోపాలరూపీ! ౧౩౪

గద్యము.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహా విద్యాపీఠ స్థాపనా
చార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతో పాసనాసాదిత సరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీదాస చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
తృతీయాశ్వాసము
ఓమితి శివమ్.

శ్రీ

# శ్రీతులసీదాస చరిత్రము

## చతుర్థాశ్వాసము



శ్రీ రాధావదనాబ్జ చ
కోరా! యజ్ఞాన మత్తకుంజరగణకం
ఠీరవ! యోగీంద్ర మన
స్సారసరోలంబ! నిఖిలజగదాలంబా!

కం॥ ఈలీల మారలీలల
లోలుండై వేశ్యయింటిలో లోగకదు
శ్శీలుఁడు దులసీదాసుఁడు
కాలముగడుపంగఁ దండ్రి గాశీపురిలోన్ ॥ ౨

కం॥ నశ్వరము దుఃఖమూలము
విశ్వంబనిరూఢిఁ దెలిసి విగతస్పృహుఁడై
విశ్వేశుచరణసన్నిధి
శాశ్వతమౌపదముఁ గోరి శ్రద్ధాయుతుఁడై ॥ ౩

కం॥ వసియించి యహరహంబును
విసువక రుద్రాభిషేకవిధినాతండ

య్యానమూంబకు నర్చించుచు
నసమానపుభక్తి నంతరంగమున పొంగన్ ॥ ౪

కం॥ కైలాసవాస! నాకీ
కైలాటఁపు బ్రదుకురోఁతగాఁ దోఁచెను నీ
కైలాస్యమాడుఁ జిత్తము
కైలాగున నుద్ధరించి కరుణింపఁగదే ॥ ౫

కం॥ సర్వము సిద్ధంబనియం
తర్వాణులచాయఁ బలికిదంభము నేర్మిన్
గర్వించుఁ బనులుపండిన
నిర్వేదముఁ జెందునరుఁడు నిష్ఫలమైనన్ ॥ ౬

కం॥ ఆపదలును సంపదలును
మాపతి! నీలీలఁగల్గు మర్మముదీనిం
బాపియగునరు నమ్మక
తాపముదర్పంబుఁ జెంది తత్త్వముమఱచున్ ॥ ౭

కం॥ గంగాధర! నీకరుణా
పాంగముఁ బడయంగలేని భ్రాంతాత్ములు దు
స్సంగముఁబెంచుచు సతతము
గాంగేయము కొఱకుగడ్డి కఱచెదరకటా ॥ ౮

కం॥ హైమవతీధవ! తలఁపఁగ
హేమంబున సుఖముగల్గునే? ధీరుండై
కామము గెల్చిననరుఁడిల
భూమానందంబుఁ జిత్తముననే కాంచున్ ॥ ౯

ఉ॥ త్రుంచినఁ గ్రమ్మరన్ మొలచురోమములట్లులుకోర్కెలేమిగా
వించినమోసులెత్తుచును విభ్రమమందఁగఁ జేసి చిత్తమం

దించుకయేని శాంతిఁగన నీయుపాయముఁగాన నేమొడన్
బంచశరారి! నీదుగుడిపంచనకించనవృత్తినుండుదున్॥ ౧౦

కం॥ లోకాతీతుల చరితల
నే, కాలుష్యంబుఁ జూపనెంచెడియాడు
ర్లోకముఁ జేర్పకకరుణా
లోకనముల సాఁకుకునీలలోహిత! నన్నున్ ॥ ౧౧

కం॥ చెడఁగొట్టెడివాఁడొకఁడును
జెడిపోదువాఁడొక్కరుండె శివశివ! తలఁపన్
జెడఁగొట్టినఁ బడగొట్టినఁ
గడ తేర్చిన నఖిలమునకుఁ గర్తవునీవే॥ ౧౨

గీ॥ శోకహామనఁజూలు నద్వైతమమరియున్న
లోకనిందకు నేలఁ జీకాకుపడఁగఁ
జేతినిఁ దనంత తలగడఁ జేసికొనగఁ
దిమ్మరెత్తిన నేరితోఁ దొమ్ములాడు॥ ౧౩

కం॥ చంచలచిత్తుల పంచవ
పించినఁ బేజంబు దఱుఁగు సిద్ధులకైనన్
గాంచనమైనను బారద
మించుకతగులంగఁ గాంతిహీనత నొందున్॥ ౧౪

కం॥ సరస గతిఁగాను పించియు జహ్నుతనయ
నీచగతిఁబర్వు నొకవేళ నిన్నువిడక
శైలసుతయయ్యు నుమ, మేనునగమొనంగ
శివశివా! యిదిప్రకృతివైచిత్ర్యమహిమ॥ ౧౫

కం॥ మంత్రిత్వమబ్బినంతస్వ
తంత్రుఁడనని విఱ్ఱవీఁగి తలపేదిభవ

త్రంత్రతముఁదెలియక తెలియను
దంత్రుల నాడించునీస్వతంత్రతతసాంబా! ॥ ౧౬

క॥ దిక్కుల నన్నిఁటిగెల్చిన
నుక్కువులకుఁ జిక్కకెవ్వఁడుందువు సాంబా!
దిక్కాలంబుల నెన్నక
దృక్కోశేషించినిల్చు ధీరులదిక్కై ॥ ౧౭

క॥ అధికారలౌల్యము మనో
వ్యథఁజెంచును నీచజనుల యాశ్రయమొనఁగున్
మధువైరి మఱవఁ జేయును
విధిచోదితపథముఁ బావు వెంగలిఁ జేయున్ ॥ ౧౮

క॥ చేరెడు నేలకు దొరతన
మారా! యింతటికెయెంత యౌద్ధత్యముదు
ర్వారుండవీవు దలఁచినఁ
గారాకులుదుల్లి నట్లుఁగాఁబడిచెడరే ॥ ౧౯

క॥ వ్యాపారా పారమహా
కూపారమునందు మున్గిక్రుంగక యుండన్
దేపై తరి మించకమున్
గాపాడుము దరినిఁ జేర్చిగౌరీనాథా! ౨౦

క॥ కూలికి జేజేయనియెడు
కూళలసభలోన నదియె గొప్పనుకొనుచుం
బ్రేలెడి శుంఠలు నేఁటికి
నేలికలై వెలసిరకట! యేలిఁక చదువుల్ ॥ ౨౧

క॥ కూలికి లీలఁగ నేడ్చెడు
పోలికరొక్కంబునానఁ బొగడుదురంతే

కీలి ది తెలిసియుఁ దెలియకు
బాలేందుకలాప! మోహాపద పరవశులై ॥ ౧౨

గీ॥ విశ్వనాథుల నీరీతి వినుతిసేసి
యన్నపూర్ణకు భక్తి సాష్టాంగ మెఱఁగి
కాలభైరవునర్చించి గణపతికిని
ప్రణతిఁగావించి కాశీపురంబు వెడలి ॥ ౧3

గీ॥ గయను బితరుల నర్చించి కరముభక్తి
ప్రీతినంతట నతఁడు త్రివేణిమునఁగి
యుచితరీతిని రాముననయోధ్యఁగొలిచి
మధురకుంజని పార్థసారథి భజంచె ॥ ౧౪

గీ॥ ఇట్టులుత్తరమునఁ గలయట్టిమేటి
క్షేత్రముల నెల్లభక్తిఁ జేరికొలిచి
దక్షిణాపథీదేశ పథంబువట్టి
యచటి క్షేత్రంబులనుజూడ నాసఁ జేసి ॥ ౧౫

గీ॥ పూరికింజని యచట సమ్మోదముననుదారుమూర్తిని గొలిచి వందారు వగుచుఁ
బ్రార్థనముఁ జేసెనంతి సింహాచలమున
వైరి భీకరుఁడైనట్టి నారసింహు ॥ ౧౬

కం॥ తమిఁగాంచె నంతటను గౌ
తమినాతఁడు రాణ్మహేంద్ర ధామమునందు
త్తములైన బుధుల గోష్ఠిన్
దమమెల్లను బాఱద్రోలి ధన్యాత్ముండై ॥ ౧౭

గీ॥ విజయవాడకు నంతట వెడలియచటఁ
కృష్ణవేణి మునుంగుచు నింద్రకీల

శైలమధిరోహణముసేసి చాలభక్తి
కనకదుర్గాంబనిట్టులు వినుతి సేసె ॥ ౨౮

కం॥ నతిసేసిన నుతిసేసిన
సతతము నీమంత్రజపము సల్పిన నాయు
న్నతి కొఱకుఁగాకనీకై
హితమేమి యొనర్పఁగలను హిమశైలసుతా ॥ ౨౯

గీ॥ కనకదుర్గాంబ! నీపదకమల యుగముఁ
గనక, సంసారవహ్నిలోఁ గమలుచును న
కనకఁబడుచుండు పామరజనులనీవు
కనికరించకయున్నను గతియిఁకెవరు ॥ ౩౦

ఉ॥ అంతయునీదు లీలయిసుమంతయెఱుంగను మోహవార్ధిలో
మింతువు యుద్ధరించిభవ మోచనమిచ్చి సుమేరుశృంగమం
దుంతువు నాకదేమిటికి యోగమొభోగమొ నీదెభారమ
త్యంతమునిన్నె నమ్మితిని యార్చిదాతీర్చిదవో వరాంబికా॥

మ॥ దయ సేయంగదె దివ్యసేవ్య! త్రిజగద్భద్రాను సంధాయినీ!
దయ సేయంగదె విశ్వనాథహృదయాంతః కర్ణికావాసినీ!
దయసేయంగదెయాశ్రితావనమహోదారవ్రతా! శాంకరీ!
కయిసేయంగదెభోగిభూషణుని యంకంబందునీబాలునిన్॥

చం॥ తిరిగితి నీరుఁగోరి మృగతృష్ణల వెంబడినింత కాలము
మ్మరో! కడుడస్సినాఁడను ప్రమాదములింకను గల్గకుండసా
దరమతి నన్నుఁగాచి వితథంబగు కోర్కెలనార్చి నీపదాం
బురుహామరంద పానసుఖమున్ దయసేయవె తృష్ణఁదీర్పవే॥

కం॥ ఉదుటుననా యీరచ్చల
వదరుచు నీపాదభక్తివదలుదునేమో

పదిలము సేయుమునామది
నెదిసేసిన నీదు సేవ యే యానటులన్ ॥ 34

కం॥ పఱిగడలమే యనలవడి
మొఱకడమున నింటిజాడఁ బోవక యున్నన్
మఱచు నె గొల్లండఱవల
నెఱఁదప్పిన విడువకమ్మ నీవాఁడఁజుమీ ॥ 35

కం॥ కేరుచు నినువిడి తిరుగన్
నేరిచె నీతఱపిదూడ నిశ్చింత మెయిన్
గేరడము సేసి యంబా!
దూరము పో నీకు మిద్ది దుష్టజగము నూ! 36

కం॥ నీవాఁడఁ జుమ్ము జననీ
నీవాడనె యెపుడునిల్తు నిశ్చింత మెయిన్
నీవాడించినఁ బలుకుదు
నీవాడించిన విధమున నెగడుదు జగతిన్ ॥ 37

గీ॥ కనకదుర్గను సేవించి చనియుతండు
గాళహస్తియుఁ దిరుమలఁ గాంచిపురము
వ్యాఘ్రపురమును దర్శించి భక్తవరుఁడు
రంగనాథునిఁ గొల్చె శ్రీరంగమేగి ॥ 38

కం॥ మధురిపు పీఠోర్వినియంతన్
మధురాపురి కేగియట సమాహితుఁడై య
వ్యధుఁడై మీనాక్షిపద
మధువానెన్ భక్తవరుఁడమంద ప్రీతిన్ ॥ 39

కం॥ చని యాత్మారాముఁడు బా
ననంతశయనమున కంత నధిక ప్రీతిన్

గనుగొని వినుతించెను ప
ద్మనాభునత్యంతభక్తి దైవారంగన్ ॥ ౮౦

ఆ॥ తిరువనంతపురినిఁ దిరువీథులందునఁ
బైట లేకఁ బట్టబయలుగాఁగ
తిరుగు తరుణుల, దేసదృష్టుల ని గుడింప
కజ్జనాభుఁ గొల్చునతఁడె ఘనుడు ॥ ౮౧

కం॥ అన్యాలోచన మెల్లన్
సన్యాసముఁ జేసియతఁడు శాంతాత్ముండై
కన్యాకుమారికిం జని
ధన్యాత్ముఁడు దేవి నీవిధంబునఁ బొగడెన్ ॥ ౮౨

చ॥ ఇదియగుదూర్పుసంద్రమిది యేయగుఁబశ్చిమవార్ధియంచు నే
దుద మొదలెన్న లేక భ్రమతోఁ జరియించితిఁ గన్యకాంబ! నీ
సదనముఁ జేరఁ జూచు నెడ సాగరమొక్కఁడెయయ్యె నట్లనీ
పదభజనంబునన్ జగము బ్రహ్మమె జీవుఁడునొక్కఁడె గదా!

ఉ॥ నన్నెఱుఁగంగ లేక జననంబు మొదల్కొని దుష్టసంగతిన్
మిన్నును మన్నునుంగనని నీచుఁడటంచుఁ దృణీకరించుటో
తెన్నున కిప్పుడైన నరుదెంచెనుఁ వీఁడనిసంతసించుటో
కన్నెకుమారి! నీవదన కంజమునందలి మందహాసముల్ ॥

శా॥ భేదజ్ఞానము పెంచి మూఢులిలఁగా పేయంబుతో గ్రాసవా
సోదైన్యంబులు గల్గునంచు మదిసంక్షోభించియోయంబ! నీ
పాదద్వంద్వముఁ గొల్వనేరరుగదా భావింపగాఁ బ్రేతకున్
రాదే వస్త్రముబియ్యమిన్నియిడ రేరాకున్నె నిన్ గొల్చుచోఁ ॥

ఉ॥ మాత! భవత్పదాబ్జమహిమంబది యేమని చెప్పవచ్చుఁ జం
ద్రాతపమట్లుఁ దిగ్మకరుఁడై ననుజల్లని పొందగాయు, నా

గా తపనీయమూర్తి! నినుఁగన్నులఁగాంచినయంతదాసుఁడై
చేతులు మోడ్చినీచరణ సేవకుఁడౌఁగదె యెట్టిదుష్టుఁడేన్॥
ఉ॥ హద్దులు మీఱిదుష్టమును వ్యర్థమునౌజగమందుదూరివల్
సుద్దులు వల్కుకూటికయి స్రుక్కుతిఁ జిక్కుతి దానఁగల్గునా
పద్దశయుంగణింపక భవాని! ననున్ గృపఁజూడుమమ్మనీ
ముద్దులు మూటగట్టునగు మోముస్మరించెదనాత్మశాంతికై ॥
ఉ॥ విద్దెలనేర్తుఁ గూటికయి వేసరకుండఁ గఁగూర్తు విత్తమున్
బద్దెములల్లనేర్తుఁ బ్రతివాదులఁ గెల్వఁగ నేర్తునైననా
కెద్దియుశాంతి నీదుపరమేశ్వరి! నన్ గృపఁజూడుమింకనీ
ముద్దులుమూటగట్టునగు మోముస్మరించెద నాత్మశాంతికై ॥
ఉ॥ పెద్దలయొద్దఁ జేర్చియవివేకపుఁ గోర్కుల నెల్లనార్చి నా
బుద్ధులజాలుమార్చిగురువుల్ గనిపించిన త్రోవఁగూర్చియా
పద్దశలన్నితీర్చిననుఁ బాలన సేయుమదంబ! యింకనీ
ముద్దులుమూటగట్టు నగుమోముస్మరించెదనాత్మశాంతికై ॥
ఉ॥ తద్దయునంబ! నీయడుగుదామరలన్ భజియింప దుర్లభం
బెద్దియునైననుంగలదె?యింత యెఱుంగ, కహంతతోనరుం
డెద్దియునైనఁ జేయును నిజేచ్ఛలఁ బొందగఁబందయాచునీ
ముద్దులుమూటగట్టు నగుమోముస్మరించెదనాత్మశాంతికై ॥
ఉ॥ నిద్దుఁగాంచి మేల్కొనుట నిశ్చయమెట్టులు ప్రాణమెంతలో
నద్దిర దేహమున్ విడచు నారయుజ్ఞానము దుఃఖమూలమై
బుద్ధిఁగలంచు నీదువదముల్ మదినిల్పని నాస్తిశాలి నీ
ముద్దులుమూటగట్టునగు మోముస్మరించెదనాత్మశాంతికై ॥
కం॥ తనివోవ దెంతచూచిన
జననీ! భవదీయసృష్టి శబలత యెన్నేఁ

గనిసన్ ఘనమగు దృశ్యము
లనయముఁ గల్పించుచుందువద్భుత లీలన్॥ ౫౨.

కం॥ వెలిఁజూడఁ దరమె? నాలో
వలనే చూపింపు జగదుపాదానంబై
లలితంబగు నీరూపము
లలితా నీకన్న వేరిలంగలదె కనన్॥ ౫౩

కం॥ కలయనినఁ గల్లయనినను
గలదెల్లను నీవెసుమి జగంబుననందున్
బలువితములగుచు మెలఁగుట
కలదే నదిమెల్లనీదుకల యె మదంబా॥ ౫౪

గీ॥ అర్ధినీరీతి నతఁడు గన్యాకుమారి
వినుతిగావించి యచ్చోటు వీడియవల
సేతువునకేగి స్నానంబుసేసి యంతఁ
గదలెఁదనపురికేగు సంకల్పముననుు॥ ౫౫

సీ॥ దివ్యస్థలంబుల దేవతాళినుతించి
వాగ్దోషముల నెల్లఁబరిహరించి
సోమరసముఁ జేర్చి హేమరజము తేర్చు
గాంగవారినిఁ గాయకలుష ముడిపి
పరమోపరమమునఁ బరమేశ్వరధ్యాన
మునఁజిత్తమాలిన్యమును దోలంచి
సాధుసజ్జన బృందసంసేవనంబునఁ
గలుషకర్మములెల్లఁ గడకుఁద్రోచి

గీ॥ మోహలోభాది సంసారమూలములను
బలిమిఁ గూకటివేళ్ళతో నులిమివైచి

మోక్షలక్ష్మీ సనాథుఁడై పుణ్యుఁతఁడు
మగిడి నిజపురికరుదెంచె మధువిరోధి॥ ౫౬

గీ॥ ఇట్లు క్షేమంబుగా నతఁడిల్లు సేర
సంతసంబును భక్తియు సందడింప
దనదు కాంతయుఁ గోడలు వినతిసేయ
వారిదీవించి సుతుఁజూడఁ గోరునంత॥ ౫౭

కం॥ ఆగడమునఁ దనకొమరుఁడు
బోగపు టాగలకులోఁగి పోయినవితము
ద్వేగమున భార్య తెలుపఁగ
సాగరగంభీరుఁడతఁడు శాంతాత్ముండై॥ ౫౮

కం॥ తనసతిని నేర్పుతో సాం
త్వనవాక్కులబుజ్జగించి వలుకకలోలో
మనమునఁ గుమిలెదు కోడలి
మనికితమును మాన్చితన కుమారునిఁ దెలుపన్॥ ౫౯

కం॥ తరుణముఁగని యొకనాఁడా
తురతన్ భజియించి పెరటిత్రోవనతఁడు ప్రా
నరసిజతనమున నిల్పుచుఁ
గరుణాసాగరుఁడు దండ్రిగారాబమునన్॥ ౬౦

శా॥ ఈ యాదేశము నాక యెల్లెడల నెంతేసాహసంబొప్పఁగా
గాయక్లేశమునోర్చినిన్ గనెదు కాంక్షన్ ప్రాణముల్ నిల్పియు
ట్లోయాత్రల్ నెఱవేర్చి యాత్రమున రానోయన్న! యొక్కప్పుడున్
డాయంజేరవు సేమమారయ విటెన్నాళ్లైనను బుత్రకా!॥ ౬౧

ఆ॥ నదులువచ్చికూడినను గూడకున్నను
పెరిగిపోఁడోకింత తఱిఁగిపోఁడు
కొడుకుఁగాంచి వార్ధికొండంత గాఁబొంగుఁ
బుత్రమోహమెంత ముమ్మరంబో ॥ ౬౨

కం॥ ఈ మాయావిషయములం గల
యాయద్భుతవిషయములను నడుగవు పోసీ
నాయంత నేనుబిలిచిన
నోయనియేఁ బలుకవకట యుక్తమె తండ్రీ । ౬౩

కం॥ మనమునఁదోఁచిన శంకలఁ
జనవుననాతోడఁబల్కి శ్రద్ధమెయిఁగా
వినిచినదెల్లను నేర్తువు
మునుపటి తెఱఁగెల్ల మాఱెఁబూర్ణుఁడవైతే ॥ ౬౪

కం॥ నాతో భుజియింపక నీ
వేతఱినోయిన్ని మెతుకు లెట్టులొతినిరో
హా! తహతహఁబడి యడుగుదు
నీతీరిది యేమినాకు నెఱుఁగం దగదే ౬౫

కం॥ వచ్చితివింటికఁటన్నన్
ముచ్చట నేబిల్చినంతఁ బారుగుననిలకే
ప్రముచ్చువితంబునఁ దోడిఁబడి
చెచ్చెరఁబోవంగ నేల చెపుమ కుమారా ॥ ౬౬

కం॥ ఓజలయోజలుమీఱవ
యో! జడునటులక్క టకట! యున్మత్తునియ
ట్లోజచెడియేల తిరుగుదు
యోజనమింతైనఁగలదె యోగ్యతవలదే ॥ ౬౭

కం॥ రాజద్రోహము సేసితొ
భూజనులను హింససేసి పొక్కుదువొ మదిన్?
మాజీవగత్రుదీవను
నిజనమికినాకుఁ దెల్పనేగులెమిటికిన్ ॥ ౧౮

కం॥ చేసిన దేమే గాని
దోసము రాకుండునె విబుధుల కేని భువిన్
చేసినపాపము చెప్పుట
తోసరియను మాటవినవె దుఃఖంబేలా ॥ ౧౯

కం॥ పశ్చాత్తాపము గల్గి వి
పశ్చితులగు నాప్తులొద్దఁ బల్కుట యే ప్రా
యశ్చిత్తమనుచు నెఱుఁగుము
నిశ్చయముగ ధర్మసూక్ష్మనిర్ణయ మిదియే ॥ ౨౦

చం॥ అపరిమితానురాగమున నాత్మజునీగతిబుజ్జగించినన్
గపటము వీడి, వాఁడు తనకల్మష వృత్తము జెప్పకోకమూ
గపగిది మారుమాటఁబలుకంగనుజాలకయున్నఁజూచియా
చపలుని మార్దవంబున వశంవదు జేయఁగ రాదటంచనే॥

శా॥ ఓరీమూర్ఖుఁడ! యింత చెప్పినన దేకో దాఁచి, లోక్రమింగి, నే
ధీరుండౌదునటంచు నెంచకుము, యుద్వేగంబునం గక్కఁగా
నారోగ్యంబగుఁగాక హాలాహలత్ల్యంబైన యప్పాపమున్
గౌరీనాథుఁడుమింగెఁగా కోరులక కార్యంబుసాధ్యంబొకో

కం॥ నీవెంత దాఁచి పుచ్చిన
నీవంకర నడతయెల్లనే దెలియనౌకో!
నీవే త్రపవిడి చెప్పిన
భావము పరిశుద్ధమై ప్రభావముకలుగున్ ॥ ౨౩

కం॥ నాయధికారము ౯బోవఁగ
నీయఘముల్ దెల్పుమనను నీమదినియుపా
దేయంబెదియో చూడుము
హేయంబగు తెరువు విడుపు మెఱుఁగ వెప్ప ౯తా॥ ౭౪

కం॥ జంకంగొ-ను ఏడ్చిని
రంకుశముగ పాని సరస నహములురా౯తుల్
కింకరవృత్తి మెలంగుదు
వంకేమహాగర్వ్యా౯వాత బలు మెట్టిదియో॥ ౭౫

కం॥ సంసారాంబుధిలోన రి
ర సకుఫలమైతిపు౯తరత్నంబవు ని
స్సంశ యమనుకొనఁగాఁగుల
పాంసన! యిటు తేలె నీ౯ప్రవర్తన మెల్లన్॥ ౭౬

గీ॥ దక్షిణావర్తశంఖ సంతానమందు
క్షుద్రమైనట్టి యూనత్తగుల్లపోల్కి
పరమపావనమైనట్టి వంశమందుఁ
బుట్టినాఁడవు ౯బ్రాహ్మణ౯బువుఁడవీవు॥ ౭౭

ఉ॥ సోమరసంబుల భ్యమగుచోనదియెంగిలిదయ్యె నేనియుఁ
గామన నేయుటొప్పగునుగాక యొకింత జుగుప్స లేక, యు
య్యో! మహిపాదిసత్త్వశవముద్ధతిఁజొచ్చి కలంచుగుంటనీ
రేమని౯ తాగఁబోవునువినీ మది నెంచవె యుచ్చనీచముల్॥

కం॥ ఆకలియయ్యెంగానీ
మేకొని తిననౌనెయేయ మేధ్యంబైనన్
మైకము౯గమ్మె నె తం౯డ్రీ!
నీకెక్కడ దొఱకెఁ గామినీ౯గహమకటా॥ ౭౮

కం॥ కూడిన వీడిన స్వేచ్ఛం
 గ్రీడించుట పౌరుషంబు రీతియగునుగా
 క్రీడామృగముల వగిదిని
 నాడించినయట్టు లాటలాడెద వేలా॥ ౧౦

కం॥ వలిచిన వలపులవలనను
 గలుగు నెయానంద మకట! కాంతనిజముగా
 వలచిన వలయకయలుగక
 కలిగిన లేకున్నఁ గొలుచుఁగా నిజనాథున్॥ ౧౧

కం॥ ఒడలప్పగింప నేమగు
 నెడమీయ దొకింతయేని యింగితమరయన్
 బెడదారికీడ్చి విటునిన్
 బడుగుంగావించి వారభామిని విడచున్॥ ౧౨

కం॥ నమ్మదు ధనమేమిచ్చిన
 నమ్మకమమ్మకఁపునరకె! నమ్మిసయటు లే
 నమ్మించు విటులవీథుల
 నమ్మించును వారిపశుగృహారామములన్॥ ౧౩

కం॥ అజుఁడైనఁగాని యీా కా
 యజుఁడైననుగాని సానికంటినమైనన్
 గజభుక్త కపిత్థంబటు
 నిజసారముగోలుపోవు నిజముకుమారా॥ ౧౪

మ॥ సదసద్వస్తు వివేకయుక్తమగు ప్రజ్ఞానంబునన్ భూరిశాం
 తిద మానందనిదానమూ నుపరతిన్ ధీరుండవైమించి పెం
 చుదునాకీర్తినిఁబెంతుమోదమును శుశ్రూషావిధిన్నాకునే
 రెదురీలోకము నందనంగనకటాయిట్లితివే పుత్రకా॥ ౧౫

కం॥ తలకొఱిఁ బెట్టఁగాఁదన
యు లెవ్వేలర, రాజపురుషులుండరె శవమున్
వెలికీడ్వ నక్కటకటా!
పలువలుకులి కేలవంశపాంసన! నీతోన్॥ ౧౬

కం॥ అయయో! శిష్యభ్రాంతిత
నయు నెడలంచవచ్చుగాదె నా కేమిటికీ
స్మయమింక స్వేచ్ఛనందే
నయమూరా! విడెబంధనంబిఁ కఁబోదున్॥ ౧౭

కం॥ రామపదభక్తుఁడా త్మా
రాముఁడు తినకొమరు కొమరుఁబాయఁపుఁ జేఁతల్
రామావ్యాసోహంబును
నేనెయి మరలింపలేక యుట్లనుఁ మదకున్॥ ౧౮

కం॥ తలతిక్క దీం మోహా
త్కలికకుఁ దగుకలికమిడఁగ కాలంబిదెరాఁ
గలదింక నంతదనుకన్
మెలఁగుమునీ యిచ్చవచ్చుమేరకుఁ బుత్రా ౧౯

శా॥ నాసర్వస్వము మున్నె నీకొసఁగితిన్; నాచిత్తమందింక నే
యాసల్ లే వొక గవ్యయున్ నలను భిక్షాహారిణ్ శాశి దీ
గ్వాసున్ గారిమనోజ్ఞహాసు కరుణావ్యాసున్ మదిన్నిల్పియా
యాసంబూన్చెదు నెల్ల కర్మముల సన్యాసఁబుగావించెదన్।

కం॥ ఎన్నగఁ నాకడనింక ను
న్నన్న దినవరత్నహార మొక్కఁడునాకున్
మున్నొసఁగెదానిజనకుం
డన్నా! నీకిత్తునదియుననుర క్తిమెయిన్॥ ౨౧

· కం॥ జరయునురుజయును బొరయక
నిరంతరముఁ గంతసీమ నెమ్మినిదీనిన్
ధరియించువారు నవభా
సురకాంతిని వెలయు చంద్రు సురలోయనఁగన్॥ ౯౨

కం॥ అని యాహారము తనతన
యునకప్పనసేసి నిస్పృహాండై యరిగెన్
జనితాపాపహామాజీ
వనమున నానందవనని వాసము సేయన్॥ ౯౩

కం॥ వైరాగ్యంబున జనకుఁడు
వారాణసికేగు నంచు వగవక మదిలోఁ
దీరెను ముసలి యాతని
పోరని యత్తులసిదాసు మోదంబెసఁగన్॥ ౯౪

కం॥ ఎప్పటి చొప్పునఁ దప్పక
కప్పిన మోహంపుమబ్బు కతననతండా
రొప్పాలకుప్పకు వశుఁడై
తప్పొప్పుల నరయ లేక తన్మయుఁడయ్యెన్॥ ౯౫

కం॥ వారస్త్రీవ్యామోహము
నారసమటు హృదయమందు నాటుకొనంగా
నీరసమొదవ్వటఁ దెలిపియుఁ
బౌరుషమున నూడఁబెరుక భయపడునకటా॥ ౯౬

కం॥ సుడిఁబడి విడివడఁ గడఁగియు
సుడివడు హతభాగ్యునటులు సోలియు నతఁడా
వడపుంబడఁ తుకబంధము
నడలింప మనోబలంబుచాలక యుండెన్॥ ౯౭

గీ॥ జనకుని హితోపదేశంబు సరకుసేయ
కల్లవారాంగనను దొంటియట్టులెనసి
యుండెనేకాని కుడిచిన తిండితావి
త్రేపునకు వచ్చినటులుపదేశమద్ది ॥ ౯౮

గీ॥ తేప తేపకుమదిలోనఁ దెల్లి తెల్లి
కలఁత వెట్టఁగఁదొలుతటి వలపు దరిగె
నేమొ? మణి హారవృత్తాంతమింతయైన
వేశ్య కెఱిఁగింపడయ్యె నావిటవరుండు ॥ ౯౯

గీ॥ కొన్నివాటం బులిరీతి చన్నపిదపఁ
జేటియొక్కతె యవ్వేశ్య చెంతఁ జేరి
మంతనంబున హారవృత్తాంత మెల్లఁ
దెలియఁజెప్పెచుఁ బలికె నాకలికికిటులు ౧౦౦

కం॥ ఆహారము ముచ్చట నీ
కాహా! రవ్వంతయైన నతఁడు దెలుపఁడే
యాహారముడిగియేనీ
వాహారముఁగొనుము నిత్యయౌవనమందన్ ॥ ౧౦౧

ఆ॥ ఇట్లు ప్రోత్సహింపనిస్సిరో! హారంబుఁ
గొనని నాదు జాణతన మదేల
యనుచునొక్కనాఁడు కినుకను నటియించి
విటునకిట్టులనియె వెలవెలంది ॥ ౧౦౨

కం॥ కన్నెత్తియొరునిఁ జూడక
నిన్నే నెఱ నమ్మికొల్తు నిష్కపటముగాఁ
బున్నముపురుషార్థంబని
యెన్నఁ జేసితిని మెప్పొకింతయుఁ గలదే ॥ ౧౦౩

ఉ॥ అయ్యయొ! యెంతకాలమిటులర్థిభజించిననొక్కనాటికే
నెయ్యము లేక పోయెనవనీస్థలిమంచికి మంచియున్నమీ
యయ్యయొసంగినట్టి మణిహారముముచ్చటలుంగనోచుకో
దయ్యెనుదాసురాలిది యహా! ప్రణయంబన నిట్టిదేకదో॥

కం॥ ఆమణిహారము కతన ని
రామయనవయౌవనంబనంతంబై తే
జోమయసుందరగాత్రుఁడ
వై మెఱసిన నాకుఁగాక హర్షమెవరికో ౧౦౫

గీ॥ నిత్యయౌవనసంపద నీవుఁడవగుచు
మధుకరం బట్లువరుససమ్మద మెసంగ
బూవుఁబోఁడుల నెందఱిఁబొందిరేని
జింతయేటికి నినుఁజూచుసిరియచాలు ౧౦౬

కం॥ ముదుసలినైనను నీదగు
వదనాబ్జముఁ జూడఁగల్గు భాగ్యమొదవెనే
నదియేపదివేలనుకొ
ముదమందెదనెక్కు ... ౧౦౭

కం॥ తనగుట్టుఁ దెలిసి గడుసా
దనమున నిటులాడదొంగతనము బయలుగా
మనమునఁ గలఁగెడుచోరుని
యనువున నత్తులసిదాసుఁడనియెఁదరుణికిన్ ॥ ౧౦౮

కం॥ చనునే నీకిటులాడఁగ
మనోహారినినున్ ద్యజించిమఱియొకతెను గై
కొనసేర్తునె కనిసైతునె
తనుశోభ యొకింతనీకుఁ దఱఁగిననైనన్ ॥ ౧౦౯

గీ॥ ఎద్ది ప్రియమగు మనుజున కెపుడు దాని
సర్వవిధములఁ జెడకుండఁ జక్కఁ దిద్ది
రక్షసేయుట యొప్పుగా రాజవదన!
కలదె నీకన్నఁ బ్రియమైన దిల నొకండు ॥ ౧౧౦

కం॥ ఓయమృతాంశునిభానన
నాయావన భాగ్యమునకు నష్టము గలదే
నీయధరామృతపానం
బీయదె త్రిదశత్వసిద్ధి నెప్పుడి నాకున్ ॥

శా॥ నీలావణ్యపయోధిలో సతత మోనీ రేజపత్రాక్షి! కే
ళీలోలుండనుగాఁగ శీర్షమగు నే లేఁ బ్రాయమిం తైన నెం
దే లావణ్యసుసంగతిం జెడవుగా దే వస్తువుల్ ధాత్రిలో;
నేలా సంశయ మింక హారమిది నీ వేకొమ్ము ప్రాణేశ్వరీ! ౧౧౨

కం॥ ఏమఱకుండ నిరంతర
మీ మణిహారము ధరింపు మీనాక్షీ!
క్షేమంబయ్యెడు నీకే
రామామణి సాటియింక రసలో నన్నన్ ॥ ౧౧౩

మ॥ తన సర్వస్వము హారవోసి యిటు భృత్యప్రాయుఁడై కొల్చినన్
వనజాతేక్షణ వానికన్నొ మఱఁగి విశ్వాసంబు లే కొక్కఁడుం
డెన కానిన్ వరియించి గూఢగతిఁ గ్రీడించున్ గటా! దాని నే
మన నా భోగినిపోక తిన్న సగు డెందైనం గనన్ వచ్చునే॥ ౧౧౪

గీ॥ అబ్జబాంధవు సాహచర్యంబు నెఱపి
మహిఁ బతివ్రతలకు నుపమానమైన
ఛాయ యే నాథుఁ గనుఁ బ్రాణమి సంజవడిన
క్షుద్రదీపంబులను దగఁ లొక్కను నయారె! ౧౧౫

గీ॥ అంతనొకనాఁటి మధ్యాహ్నమందుఁ దులసి
తనగృహంబునకేగి భోజనము సేసి
శరజవంబునఁ గ్రమ్మర సానిఁ గూడ
నరిగి పడుకటియింటిలో నడుగు వెట్ట ॥ ౧౧౬

కం॥ అడుగుల యలుకుడు విని తుం
డుడుకొప్పఁగ నెవఁడొ పెరటి త్రోవం జనఁజో
రుఁడొయను శంక నతని వెం
బడించి పట్టుకొనెఁ దులసి బంటుతనమునన్ ॥ ౧౧౭

చం॥ ఎదితన తాతకూర్మి మెయి నిచ్చెను దండ్రికి మేలుఁగోరి; యె
య్యది తనకిచ్చెఁ దండ్రియు; ననర్ఘము దివ్యమటంచు చెఱింగిఁ యె
య్యది పయికొన్న మోహనము గాన రాజకుమారికిచ్చి తాఁ
త్రిదశపదంబునందిన గతిన్ గడునుబ్బునొ యట్టిహారమున్ ॥ ౧౧౮

గీ॥ వాని మెడలోనఁ జూచి సంభ్రమముఁ బొంది
యక్కటక్కట యీ దుష్టుఁ డాహరించె
సంచుఁ గింకను ముష్టిప్రహారమిచ్చి
తనదు హారంబుఁ గైకొనఁగినుక వాఁడు ॥ ౧౧౯

కం॥ హా నీ పోనీవి పుల
తో నేలయుఁ దంచు నేను దొలఁగి చనంగాఁ
బై నెత్తి వత్తు వీఁక నే
పూనిన నా యెదుట నిలువఁబోలు నెనీకున్ ॥ ౧౨౦

ఆ॥ నన్నుఁ గొట్టనేల నాకంఠమున వ్రేలు
సరముఁ గొనఁగ నేల చలముఁ బూని
దొంగిలింపలేదు తొంగలింపఁగఁ గూర్మి
హారమిచ్చె రాజయాచితముగ ॥ ౧౨౧

ఉ॥ అనవిని కిన్కమై కనులనగ్గిఁ బుల్గొనఁబల్కె దాసుఁడా
మనుజునిఁజూచి యోతులువ! మాయలుసాగవు చౌర్య
విద్యలన్
ఘనుఁడవఁటంచుఁ జెల్పుటకుఁగా సభ సేసిరె హారమిద్దియే
మనుజవిభుండు నీకుబహుమానముగానిడెఁబశ్యతోహరా!॥

గీ॥ అనిన వెడనవ్వునవ్వుచు నతఁడుపల్కె
చౌర్యకౌశల్యమును జాల సభ యొనర్ప
రవనిపతి యొసఁగెను నాకుహారమీఁడు
వెఱ్ఱిబావఁడ! నిజముఁ జెప్పెదను వినుము ॥ ౧౨౩

చం॥ ఎవతెను రాజు గాఁజనుచు నెప్పుడు ముద్దుగఁ బిల్చు మందువే;
యువతికి బానిసీని యటు లోర్పున సేవలు సేయు మందు వే
ప్రవిమలపూర్ణచంద్రముఖి రాజయి దాస్యమునీకు నిచ్చివా
స్తవముగ నాదు రాణి యయి దాసియు నైభజయించు నాత్మ
లోన్॥ ౧౨౪

కం॥ ఆనగ రాజకుమారి య
నూనంబగు ప్రీతి నాసమున్నతిమదిలో
నూనుచు నీహారంబున్
దానై నామెడను వైచె దాపనిఁ కేలా ॥ ౧౨౫

కం॥ సలసలఁ గ్రాగెడు సీసము
బలిమిని చెవులందుఁ బోయు వైఖరినపుడా
పలుకులుచురచురఁగాల్పఁగఁ
దులసీదాసుండు క్రోధధూమ్రాక్షుండై ॥ ౧౨౬

ఆ॥ వాతవాఁతఁ బెట్టి పండ్లూడఁ బెఱికించి
చీలికలుగఁ నాల్కఁజీల్తు నోరి!

పట్టువడియుఁ గాళ్లపైఁబడకీరీశఁ
బ్రల్లనంబులాడి బ్రతుఖివఁబడె ॥ ౧౨౭

కం॥ అనితన పాదుకతోనా
తనిశిరమునమూఁతినిందఁ దవుడలపైనం
దినయెల్ల నెలవులను మో
దెను రోసము నీసుమదినిఁ దెక తెకలాడన్ ॥ ౧౨౮

గీ॥ దాసుఁడిట్టులు తనుఁగొట్టవానిఁజెడక
యాతఁడిట్లను నీగర్వమడఁచివైతు
నేనుదొంగనో దొరనో యానీరజాక్షి
నడిగినఁ దెల్లమౌఁగాదెయనుచు నంత ॥ ౧౨౯

గీ॥ తులసిదాసుని చెయివట్టి బలిమినీడ్చి
సాక్ష్యమిప్పింతురమ్మని సాగినడువఁ
బొంచియవ్వారికలహంబుఁగాంచుచున్న
లంజెఁగాంచిరివారొక కుంజమందు ॥ ౧౩౦

గీ॥ వారిఁజూచినయంత నవ్వాఁగకాంత
పారిపోవంగ [illegible]
యుఱికెదగుల్లో [illegible] ఏదు పారిపోవగిది
దీనయైయంతలోనన [illegible] యగుచు ॥ ౧౩౧

గీ॥ రానిచిరునవ్వు మోముపైఁగానుపించి
తులసి కేలునుదన కేల మెలఁచియెత్తి
యాసతలమున నిడుకొని హంసగమన
యల్లనల్లన నడుగిడుచనియె నిల్లు ॥ ౧౩౨

కం॥ భరియింపరానివిరహా
జ్వర తాపము నపనయింపఁజాలునొకొమనో

హా! పొదరిండ్ల విహారం
బరయుగదగదీరునొక్కొ యాజ్యము ద్రావన్ ॥ ౧౩౪

మ॥ కినుకన్ దర్పకుఁడేయుసాయకమదా గ్నేయాస్త్రమై కాల్పనీ
ప్రణయాపాంగమువారుణాస్త్రముగతిన్ బైఁబర్వెన వ్రేళ్ళఁజ
ల్లనిదై బాణమెసూనమైమదికి నాహ్లాదంబుసధించునిన్
గనకేనొక్కక్షణంబునిల్వఁగలనా! కందర్పదర్పాపహా ॥

గీ॥ తులసినీగతివంచించు వెలవెలందిఁ
గినిసిఁకొంపెనకాఁడిట్టులనియెనంతఁ
గపటవిరహావ్రసంగంబుఁగట్టిపెట్టు
మింతియవమతినే భరియింపఁజాల ॥ ౧౩౫

కం॥ మానసఫలములు రసపుత్తులు
మానసఫలయ్యె ముసలుమాసునృపులకున్
మానినుల నజరులిడ నవ
మానమెనేసానిదానిమంతికి నీయన్ ॥ ౧౩౬

గీ॥ అనుచుపన్నాళ్లు నీనేస్త మతసితోడ
సైచితినిగాని నన్నుఁదస్కరునిఁజేసి
తిట్టికొట్టుట యెల్లనుదెలి తెలిసి
నీవుపేక్షింపసైరింప నేర్తునెట్లు ॥ ౧౩౭

గీ॥ అనుచుఁదనగుట్టు బట్టబయలుఁగఁజేయు
వానివారింపఁబోయి యవ్వారకాంత
యొడలుగంపింప నాలుకముడుతపడఁగఁ
బలుకనేరకయున్నంతఁ దులసియనియె ॥ ౧౩౮

ఏలమాటాడవే చెలి! యేలభయము?
యెవ్వఁడీప్రల్లదుఁడు వీనినెట్లుసైతు

నిక్కమెఱిఁగింపు మనఁగ నానీచుఁడంత
నట్టహాసంబు సేయుచు నిట్టులనియె ॥ ౧౩౯

ఉ॥ ఈతఁడెవండొ మున్నపుడు నేఁ గనలేదని చెప్పుచుందొ? దు
ర్నీతినిహో· మీఁతఁడు హరించెనటంచని చెప్పుచుందువో?
చేఁతలచేతఁ బల్కులను జిత్తమునం బరదైవతంబవీ
వే తులసీ! యటంచు భజియింతును నేనని చెప్పుచుందువో॥

ఉ॥ కొంకనుజంకు లేకిటులు కుంటెనకాఁడు వచింప వానికే
యంకిలి సెప్పలేక నమితాననయై చలితాఖిలాంగయై
పంకిలచిత్తయై తులసి వంచన సేయఁగ[illegible] నెవ్విధిన్
బొంకఁగవచ్చునంచుఁ దలపోయుచునుండఁగ సాని వైఖరిన్॥

గీ॥ చూచి వాస్తవమెఱిఁగి సంక్షుభితుఁడగుచుఁ
జలము పైపట్టి యప్పుడె యాకులతఁ జంప
నెంచి యాలోన నిర్విణ్ణహృదయుఁడగుచు
తులసి మరుమాటఁ బలుకక తొలఁగి చనియె ॥ ౧౪౨

కం॥ అంభోజాక్షా! మమతా
హంభావ స్తంభ సంభవాద్భుతరూపా!
శంభుసురేశవినుత! దు
గ్ధాంభోనిధిశయన! దానవాంతక! నృహరీ ॥ ౧౪౩

మా॥ తిరుమల వరశైలాధీశ! యో శ్రీనివాసా
హరిహరగురురూపా! అగమోక్తప్రతాపా!
సురచిరమణిభూషా! స్తుత్యమత్స్యాదివేషా!
పరమపదవిఖ్యాతా! భక్తిమార్గప్రదాతా!

గద్యము.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహా విద్యాపీఠ స్థాపనా
చార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతో పాసనాసాదిత సరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీదాస చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
చతుర్థాశ్వాసము
ఓమితి శివమ్.



శ్రీ

# శ్రీతులసీదాస చరిత్రము

## పంచమాశ్వాసము



వత్సాంకితవక్షా!
గోవర్ధనధారి! శౌరి! గోపరిపాలా!
కైవల్యదాననిపుణా!
రావణదనుజేంద్రకంధర!పథనచణా!

ఆ॥ వారకాంతచేత వంచితుండై యిట్టు
లింటికేగనోడి యెచటనేని
తిరిగితిరిగి ముందు తెరువునుగన లేక
కలఁతఁజెంది తులసియంతఁజెంది ॥ ౨

కం॥ పెడచెవిఁబెట్టితి గురువుల
నుడువుల నిల్లాలియెడఁద నొగిలించితి ని
చెడిపకులోనై పడితిన్
జెడితినే రెంట నకట! చింతింపంగన్ ॥ ౩

గీ॥ నన్నె దైవమ్ముగా మదినమ్మికొనిన
ముద్దరాలిని నిరసించి బుద్ధిమాలి

నన్నుఁ గన్నప్పి కపటవిన్యాసమునను
నీచరతిఁ దేలు దుశ్శీల నిక్కమంటి ॥ ౪

కం॥ ఏ మొగముతోడ నకటా!
ప్రేమార్ద్రిగ నగుచు మమత వీక్షింతును ని
ప్రేమని పలుకుదు నామెకు
నేమొయి నిష్కృతి నొనర్తు నీయఘమునకున్ ॥ ౫

గీ॥ గణిక గాదది బంగారుకణిక గాని
సానిగాఁదది చదువులసానిగాని
యనుచు స్తుతియించువాఁడ నేజనని కెట్లు
చెప్పుకొందును నాతప్పు నొప్పుకొందు ॥ ౬

సీ॥ నామూలమునఁగదా నన్నుఁగన్నతండ్రి దా
భిక్షాశియై కాశి వెతలఁగుడుచు
నామూలమునఁగదా నారీలలామంబు
మమత జీవితమందె మమతఁబాయు
నామూలమునఁగదా నామాత తనభ్రాంత
మోముఁజూడఁగను మోమోటపడును
నామూలమునఁగదా నాసాటి భూసురుల్
దలలెత్తి నృపునొద్ద మెలఁగకుండు

గీ॥ రెండుమనియెద నెవ్వరినేమనియెద
సిగ్గువ్రానాడి మదిఁగలచింతయెల్ల
నున్నదున్నట్లు చెప్పుకోనొప్పుకొన్నఁ
దప్పుక్షమియింపఁగల మహోదారుఁడేడి ॥ ౭

కం॥ క్షమియింపుమనుచు నే దీ
నముగా నొడువేడ నేల? నయమొప్పంగా

క్షమియింపుము రమియింపుము
మమతా! నీవాఁడనన్న మానినివినదే॥ ౮

ఉ॥ చెంతకుఁ జేరినంతటనె చీదరఁ జీత్కృతులం బొనర్చి ని
ర్భ్రాంతియొనర్చుచుందుఁ దనుఁ గాంచిన నామదినొచ్చునోయటం
చెంతయు నుల్కి నా యెదుట నింతి కనంబడమానె నిప్పుడే
కాంతము రమ్మటంచు నెటు కాంతను బిల్తును సిగ్గుమాలుచున్ ॥ ౯

కం॥ నలుగురిలో కెలఁగెడుతఱిఁ
గలికిని రమ్మంచుఁ బిలువఁగా ధృతినాకుం
గలుగదు నిద్దురతఱిఁ జని
మెలమెల్లను దెలిపి పలుక మేలగు నెన్నన్ ॥ ౧౦

కం॥ అనినిశ్చయించి యొకరే
యిని నింటికిఁ బోయి పంకజేక్షణ శ్రాంతిన్
గనుమూసి యుండుతఱిఁ గని
వినయమునం జేరి ప్రీతి భీతియుఁ బెనఁగన్ ॥ ౧౧

కం॥ మునుచేసిన యపరాధం
బునకిదె నిష్కృతియటన్న పోడిమినంతన్
దనహస్తపద్మముల న
వ్వనితామణి పాదపల్లవంబులఁ బట్టెన్ ॥ ౧౨

గీ॥ వట్టివేళ్లకుమించి యావట్టివేళ్ల
సోఁకుడతివకు చల్లనై సుఖమొసంగి
విరహతాపంబు నార్చి యుబ్బురముఁ గూర్చి
మేలుకొలుపంగఁ గనువిచ్చి మేలు తెలిసి ॥ ౧౩

కం॥ సంబరము సంభ్రమంబు మ
నంబును గలఁగంగఁజేయ నాథుని శ్రీపా
దాంబురుహాయుగ్మమును సయ
నంబులఁ దానద్దుకొనుచునయమున బలుకున్ ॥ ౧౪

గీ॥ పెద్దకాలంబునకు గనుపించితనుచు
సంతసింతునో శోక కార్శ్యంబునొంది
తేజమేదిన నీమోమునోజ జూచి
దుఃఖమొందుదునో నాథ! తోఁపదయ్యె ॥ ౧౫

కం॥ ఎంతైనగానసీదగు
డెందంబానందమందు తేవగలుగునం
చుందలఁచి మదిని నీయా
నందమె నాదనుచు నిన్నినాళ్లు శమింతున్ ॥ ౧౬

గీ॥ నీరసంబైన సరసులో సారసంబు
వగిది వైవర్ణ్యమునుబొంది వాడువారె
నామనోనాథ! నీమోమిదేమి యకట!
చకితమయ్యెను నామదివికలమయ్యె ॥ ౧౭

ఆ॥ పూర్వవృత్తమెంచి పురుషులదూషించి
కనులనీరునించి కంటగించి
యూసువెంచి తన్నునీసడింపక యిట్లు
జాలిదలఁచు బేలఁ జాలవలచి॥ ౧౮

కం॥ అమలంబు స్వార్థహీనం
బమాయిక మనూయలేనిదై యెప్పుడు ప్రే
మము భూమానందప్రద
ము మోక్షదము నగును బుణ్యపురుషులకనుచున్ ॥ ౧౯

గీ॥ పలుకులకుమించి యేమేమొ తలఁపుగములు
మొలకలెత్తఁగఁ దులసి వ్యాకులతఁజెంది
తలఁచి తలవంచి యెటొ మమతాయటంచు
సాధ్వియొడిలోన వ్రాలి విసంజ్ఞఁడయ్యె ॥ ౨౦

కం॥ ఇరువురు పరవశులగుచుం
బరిరంభ సుఖాబ్ధిఁ జాలవడిఁదోఁగుచుఁదా
రరయరు తూరుపుదెస న
య్యరవిందాప్తుండు తోఁచుటైన నయారే! ౨౧

గీ॥ విరహావహ్ని నిన్నాళ్లు వేఁగివేఁగి
వేగుటెఱుఁగరు దంపతుల్ వివశులగుచు
ఒండొరులఁ గూర్చు సతియునాథుండుఁగలియు
జగముతోఁచునె కైవల్యమగునిజంబు ॥ ౨౨

గీ॥ తృషితుఁడగువాఁడు చలువపందిరిని తనివి
సనక కొసరుచు శీతలజలముఁ ద్రావు
చొప్పునం గాంత సౌందర్యసుధను గ్రోలి
యెట్టకేలకు దులసి దానిట్టులనియె ॥ ౨౩

చం॥ కడచినరాత్రి నేఁదొలుతఁగాంచినయప్పుడునీదుగాత్రమున్
వడలి కృశించియుండె దెలవారినపిమ్మటఁ జూడఁజూడ నే
వడరఁగ నీదు నంగకములన్నియు నూతనశోభఁదోఁచు నో
పడఁతిరో! యింతలోన నెటువచ్చెనె యీ సుషమాతి
రేకముల్ ॥ ౨౪

కం॥ అనితననాథుండన సి
గ్గును సంతోషంబు మదిని గూడి పెనంగన్

వినయమున మమతపలికె వ
దనాబ్జమున లేనగవులు తాండవమాడన్ ॥ ౨౫

గీ॥ నిన్న రాతిరివఱకు నాయున్న తెఱఁగు
నేమడిగెదది నేటికినిట్లు లవణు
నీకృపావృష్టి పైపోక నెట్టుదీరి
నట్టులయ్యెను నీదృష్టికట్టులెతి ॥ ౨౬

చం॥ వెలవెలఁబోవు నీమొగము భీతిజనించినరీతిఁదోఁప సం
చలితములౌను జూడ్కు; లవశంబుగఁదత్తరమందు జిత్త
ముళ్

గళవళమేల మద్హృదయ కైరవ కైరవమిత్ర! దివ్యమం
గళమహనీయరూప! రసికప్రవరా! కవిరాజశేఖరా॥ ౨౭

గీ॥ భూతకాలంబు మదిఁ దలపోయఁ గాల
భుజగభూతంబె యై చుట్టుముట్టుకొనును
ముందు వెన్కల దలఁపక పొందుటొప్పు
వర్తమానంబుతో నైక్యవర్తనంబు ॥ ౨౮

కం॥ అని శ్రుతిహితమగు వితమున
తనుఁబల్కిన సతి యుదారతకు సంతోషం
బునుఁబొంది తులసిదాసుఁడు
వనజేక్షణకిట్టులనియె బంధురఫణితిన్ ॥ ౨౯

ఉ॥ నీతలఁపాత్మలో దెలియనేరక యక్కట! యింతదాఁక నా
చేతము తల్లడిల్లెను గృశించి శరీరము వెల్లనయ్యె నో
నాతి! హరిద్రకాంతులను నవ్వెడు నీతనుశోభఁగూడ నా
హా! తెలుపెలయింక జెలియా! యనురాగమె తోఁచునె
ల్లడన్ ॥ ౩౦

కం॥ అల్లుఁడిటు పాని విడి, తన
యిల్లాలికిఁ జూర్చెనని ప్రహృష్టహృదయయై
మొల్లమగు గూర్మిని మమత
తల్లి సుతను జూడవచ్చి తగనిట్లనియెన్ ॥ ౩౧

గీ॥ కన్నతల్లిరో! నీవెఱుంగనివి లేవు
సతులధర్మంబులును సదాచారములును
ననుభవంబున నే గనినంతవట్టుఁ
దెలుపుదానను వినుమని పలికెనిటులు ॥ ౩౨

గీ॥ ఏకచారిణియై యున్న యిందువదన
పతియెనిజదైవతంబని మతిని దలఁచి
సత్యవర్తనమంది నిష్కపటభక్తి
గాఢవిస్రంభయై నాథుఁగొల్వవలయు ॥ ౩౩

గీ॥ సోదెఁజెప్పెడు ప్రశ్నకారిసతులు
వేరువెల్లంకులిడు మూలకారికలును
క్షపణకాదులు భిక్షుకీశ్రమణగణము
చెలిమిసేయంగఁదగరెప్డు కులసతులకు ॥ ౩౪

కం॥ పతికిం బథ్య మపథ్యము
హిత మహితము గుర్తెఱింగి యింపగునవి స
న్మతితోడ వంటకంబులఁ
దతిబుంచక చేయవలయుఁ దరుణీమణికిన్ ॥ ౩౫

గీ॥ ఇంటికేతెంచు పెన్మిటియెలుఁగుఁ దెలిసి
భవనమధ్యంబునకువచ్చి స్వయముగానె
పాదములుగడ్గి కింకరీభావమొప్పఁ
దరుణినిలువంగవలె సావధానయగుచు ॥ ౩౬

క౦॥ పతికింగూరుచు బంధు
ప్రతతిని మిత్రాళి నుచితవైఖరి నెపుడు
న్నతి నేసి ప్రీతిఁ గొల్వుము
పతివశ్యం డగుటకిదె యుపాయము తల్లీ ॥ 36

గీ॥ ఎంతకలిగియున్నఁ గాంతునకెడ జెడింప
కీయరాదుదాన మేరిమైన
భోగ్యవస్తుచయము పూర్ణమైయుండనీ
భోగలౌల్యబుద్ధి బోలదెపుడు ॥ 37

గీ॥ తల్లి యీరీతిఁ దనకు హితంబుఁ దెలుప
భక్తిఁ గహియించి యాసాధ్వి పతిని గొల్చి
మోదమునఁ గూడెనల పోకబోదెనెనసి
యల్లుకొనియెడు నానాగవల్లి వోలె ॥ 38

క౦॥ ఇరువురు విద్యావంతులు
నిరువురు సౌందర్యఖనులు నిరువురు రసికులు
ఇరిగాఁగిల్లన్ జగమే
మరు టరుదేమరుని కేళి మఱగుట యరుదే ॥ 40

సీ॥ రాగవిస్ఫూర్తిమై రాజీవదళనేత్ర
వీణవాయించుచో వీనులొగ్గు
భావగర్భితభంగిఁ బైదలి పాండగఁ
దతవాద్య నైపుణిఁ దాను నెఱపు
తన్మయత్వంబునందన్వి నృత్యము సేయ
ననురూపమౌ గీతమును నయించు
నృత్యగానక్లాంతినింతి సోలఁగఁ గూర్మి
విరిపాన్పుపైఁ జేర్చి విరతిఁ గూర్చు

గీ॥ పాడిపాడించి యాడించి యాడియాడి
తోడునీడగఁ దన్వితో డ్తోడ మెలఁగి
నిర్భరానందవార్ధి మునింగి తేలి
విశ్వమెల్లనుదులసీ దా విస్మరించు ॥ ౪౧

కం॥ చతురంగమాడు సతితో
చతురవచోరచనలీల సరసములాడున్
మతిఁదలఁప కాగ తానా
గతముల విహరించు సుదతికౌఁగిలి నెపుడున్ ॥ ౪౨

గీ॥ అంతనొకనాఁడు చదరంగమాడు తఱిని
రొండొరులగెల్చు పూనికినుత్సహించి
యెత్తుకెదు రెత్తులెత్తుచు నింతిమిన్న
నర్మగర్భంబుగాఁ బల్కె నాథుఁజూచి ॥ ౪౩

గీ॥ ఇంకఁదా వేడి నీకునాయోటుఁగిదిగొ
నడచెఁగట్టెను నీయాటనాథ! యనఁగఁ
గట్టెనెన్నఁడొ నీగజగమనమునను
గల్కి! నాయాటలనినగెఁ దులసియంతఁ ౪౪

గీ॥ మాధవసమాగంబును మదినిఁగోరి
తఱినిరీక్షించు వనలక్ష్మి సరణినీయ
నుగ్రహంబునకై వేచినోచుటొకఁడె
మరులుకొనఁజేయు నేర్పు లమరునెన్నాకు॥ ౪౫

గీ॥ కవివతంసమ! నీనుడికార మెల్ల
నీయమాయికురాలిపై నేలచూప

నాశుకవనంబుపై నాకునాసమెందు
పల్కుమే దైనఁ బద్యరూపమునననిన॥ ౪౬

గీ॥ కలికిఁగన్గొని యిట్లనుఁదులసి యపుడు
తీసిపోదు వెనాకు నిందీవరాక్షి
మదనసంప్రీతికై ప్రతిమాలలీలఁ
బద్యరత్నంబులనుగూర్చు వారమనుచు ॥ ౪౭

గీ॥ పద్యమొక్కఁడుదాఁ బల్కపడఁతిదాని
యంతిమంబగు నక్కరమాదిగాగ
మారుపద్యంబుఁ జెప్పఁగ్రమ్మఱఁదులసియు
నందుకొనెనిట్లుక్రీడించి రాలుమగలు ॥ ౪౮

తులసి:—

కం॥ శుకవితతిపల్కు నటు లా
శుకవిత్వంబెన్న భావశూన్యంబగునా
శుకవిదళితఫలమాధురము
సుకవిత్వంబధరమట్లు సుధయెయొనంగున్ ॥ ౪౯

మమత:—

కం॥ గానముఁగవితయుఁ గలిగినఁ ...
గానన మే నాకమా జగాన వికేదియుం
గానముగా నలినాక్షునిఁ
గాన, మునీంద్రులకు సులభగతి యగునవియే ॥ ౫౦

తులసి:—

కం॥ ఎన్నమనోహారిణియగు
నన్నులమిన్న దన వెంట నమరినఁగాదే

వన్నెయొసంగును గవితకుఁ
దిన్నని సంగీతమునకుఁ దెన్నుఘటించున్ ॥ ౫౧

మమత:—

కం॥ చానలుకోనలు తేనెలు
సూనాస్త్రివిలీలలన్ని శుభములెవనిచే
గానుంగల్గును వాని ర
మానాథుంజిక్కఁ బట్టుమార్గమువరమా ॥ ౫౨

తులసి:—

కం॥ బోఁగాక జగమిదెల్లను
భోగీంద్రశయానుఁడనెడు బుద్ధినిలిచినన్
బాగోగులెన్న నేటికి
యోగముభోగంబునరయ నొక్కఁడెయాఁగా ॥ ౫౩

మమత:—

కం॥ కాకేమివిశ్వమెల్ల ర
మాకాంతుఁడయన్నమాట మదినినిజముగా
మేకొన్న హాలహాలముం
గైకొనవలె నమృతమట్లుగా సమబుద్ధిన్ ॥ ౫౪

తులసి:—

కం॥ ధీరత్రబకటింపఁగ వా
క్చారులువేదాంత తత్త్వగోష్ఠులలో సం
సారమసారంబని మమ
కారమువిడువంగ లేరుగామెప్పట్టన్ ॥ ౫౫

మమత:—

కం॥ టక్కరి టంకులమాటలు
లెక్కకుఁగొననేల భువినిలేరానసువుశై
దిక్కాలంబుల నెన్నక
దృక్కై శేషించినిల్చు ధీరవతంసుల్ ॥ ౫౭

తులసి:—

కం॥ సోలుచునీ కౌఁగిటిలో
గాలముదిక్కులను నాత్మఁగానను నాకిం
కేలా? యోగము యాగం
బేలా? స్వర్లోకభోగమేలా? బేలా ॥ ౫౮

గీ: అంగజుని నిట్లుతనియింప నంగవించి
యతనిజనకుని తులసిదామతిఁదలఁపఁడు
తం[డికొడుకుల సమముగాఁ దనియఁజేసి
యతిశయించెదరే యుపరతులాకృతులు ॥ ౫౯

కం లలనాలోలుండగుచున్
తులసీదాసుండు మెలఁగు తోయముధరణీ
తలనాథుఁడెఱిఁగి తో ల్తటి
చెలిమినినవ్వానిఁ దెలుపఁజింతించి తగన్ ॥ ౫౧

కం॥ తనుఁజూడ రమ్మటంచును
జననాథుం డెన్నోమార్లు చనవునఁబిలిపిం
చిన వాఁడు సరకుసేయక
మునుపట్టివైఖరి నెయఁతిపురిలోనున్నన్ ॥ ౬౦

కం। విస్మయముఁజెంది మనముని
విస్మయమొకయింత లేక పృథ్వీపతి దా

సస్మితుఁడౌచున్ వెస నత
తస్మగలీలావిలోలు దర్శింపంగన్॥ ౯౧

గీ॥ తులసిదాసునియింటి కయ్యలఘుచరితుఁ
డెలమి నేతెంచి తనరాక యెఱుఁగఁజేసె
వ్యాజమెఱుఁగని స్నేహసంబంధమున్న
స్వామిసేవక భేదమెంచంగఁబడునె॥ ౯౨

కం॥ నరపతి దనకై తనమం
దిరమున కేవచ్చెనంచుఁ దెలిసియునంతః
పురివెడలిరాఁడు దామొ
మ్మరముగ మోహాంధమగ్నమానసుఁడగుటన్॥ ౯3

చం॥ అరమర లేని కూర్మిమనుజాధిపుఁడేతనుఁజూడవచ్చినన్
విరసముఁదోఁపగాసుతుఁడు వెంగలియైయెదు రేగఁడయ్యె;నా
నరపతి కోపగించునొ మనంబున నేగతిశిక్ష సేయునో
హరహర! యేమిచేయుదునటంచునుదాసునితల్లిపొక్కుచున్॥

కం॥ శయనాగారములోనికి
రయమునఁజొరఁబాఱియేర! ప్రాజ్ఞత తెఱఁగే
ప్రియమున రాజే స్వీకై
దయసేయఁగ దోషిభంగి దాగదవకటా! ౯౫

గీ॥ రాజునెఱుఁగవా? యెఱుఁగవా రాజసభల?
రాజమర్యాద లెఱుఁగవేరా? జడుండ
నిన్నుఁదనయంతవానిఁగ నెన్నుకొన్న
యధిపుమైత్రికి విశ్వాసమైనవలదె॥ ౯౬

కం॥ మితిలేదే? తతిలేదే?
మతిలేదే? యిది గృహస్థమార్గంబే? భూ

పతి పడిగా పైయున్నన్
సతికౌఁగిలివిడిచి రావసంగతశీలా॥ ౬౭

గీ॥ తల్లి యీరీతిఁదనకు హితంబుఁదెలుప
సరకుసేయక తులసి కసరుకొనంగ
నాథునవివేకమునఁగడునాధిఁజెంది
యతనిబోధింపనెంచి మమతయునంత॥ ౬౮

కం॥ తలపంకింపులచేఁ జూ
పులయదలింపులను సతియుఁబొమ్మని తెలుపన్
వెల వెలఁబోవుచు శాపము
బలిమిని నిల కవతరించు వాసవువరుసన్॥ ౬౯

గీ॥ మేడదిగివచ్చి మెలమెల్లమేదినీశుఁ
జేరబోవఁగ నతఁడు సుస్మేరవదన
కమలుఁడై వానినెదఁగ్రుచ్చికౌఁగిలించి
మఱచిపోయితిగాఁబోలు మమ్ము సఖుఁడ॥ ౭౦

గీ॥ సర్వమతములసారంబుసంగ్రహించి
నూత్నమతమును నెలకొల్పుయత్నమునను
సకలసకలాళిఁబిలిపించి సభయొనర్తు
సరభసంబుననిన్ను నాసభకుఁబిల్వ॥ ౭౧

గీ॥ అరుగుఁదెంచితి నీవు లేనట్టిసభలు
శోభగాంచునె? యెందరేసూరులున్నఁ
జుక్కలెన్నైని నభమునఁ బిక్కటిలినఁ
బండువెన్నెలతేని సౌభాగ్యమున్నె॥ ౭౨

కం॥ ఈ సాయంకాలము మొద
లా సభ పదునేనుదినములయ్యెడు వినుమీ

భూసుర! యిప్పటినుండియు
నానరసవసింపవలె ననారతమీావున్॥ ౭౩

సీ॥ అనుచుఁ బియమొప్ప నీరీతిమనుజవిభుఁడు
పలికి చేయూతయొసఁగి యంబారిలోని
కతని నెక్కించుకొని చనె నతిరయమునఁ
బలుకఁడయ్యేను దులసిదిగ్భ్రమముఁ జెంది॥ ౭౪

కం॥ జనవిభునితోడ నిట్టులు
తనతనయుఁడు రాజసభకుఁ దరలిన మనమం
దున సంతసించి, కోడలిఁ
గనుఁగొని రత్నాంబపల్కెఁ గాఁదోడఁ గెనిటుల్॥ ౭౫

కం॥ వారాంగనవిడిచి సదా
చారుండయినాఁడటంచు సంతోషింపన్
వారకమారవశుండై
నీరమణుఁడు బేలయయ్యె నీవెఱుఁగవకే॥ ౭౬

కం॥ యుక్తమయు క్తంబనకా
సక్తిన్ నినువిడువవిభుఁడశక్తుండై నన్
రక్తిచెడకుండ నాతని
యుక్తిన్ బోధింపకుంట యోగ్యతతెఱఁగే॥ ౭౭

కం॥ వెంగలియగుచో నాథుం
డంగనయేహితముఁదెలుపనగు వినయమునన్
అంగీకరించినాఁడని
కొంగునముడివైచుకొంటె కోడలమగనిన్॥ ౭౮

సీ॥ సిగ్గుపెంపునసొంపుగాజేవురించు
వదనవనజంబు నించుకవంచి మమత

యత్తకిట్లనె నయము వినయముఁదోఁప
విభుని చిత్తంబుచొప్పునఁ బ్రీతిగూర్తు ౭౯

కం॥ సూచనగానపుడప్పుడు
తోఁచిన చందమున విభునితోఁబల్కిన నె
ట్లోచాతుర్యంబునఁదాఁ
ద్రోచున్ నామాటనర్మ్మధోరణి నగుచున్॥ ౮౦

గీ॥ ఆయనకు నెట్లోయట్ల విధేయురాల
నత్త! నీకును; బలుమాటలాడ నేల?
పతికి హితమెద్దియో నీవుపనిచినట్లు
చేయుదానను నీమదిచింతవలదు॥ ౮౧

గీ॥ అనిన రత్నాంబయిట్లను నకట! నాకు
మచ్చరంబొకో మీవయి మగఁడు నీవుఁ
గూడియాడుచు సుఖియింపఁజూడ లేనె
యైనఁ గొన్నాళ్లు పుట్టింటికరుగుమీవు॥ ౮౨

గీ॥ దప్పిలేనట్టి పానంబు ధవళనయన!
యాకలియె లేని భోజనంబరసిచూడ
విరహమెఱుఁగని భోగంబు వెక్కసమగు
విరహమేసుమ్మ ప్రణయాభివృద్ధికరము॥ ౮౩

కం॥ అనపాయినియై విభునిం
బెనఁగియు జగదంబ దాను విశ్వంబగుచున్
గనరాని విభునికై కను
ఘనవిరహముఁదిరిగి పడయఁగైవల్యంబున్॥ ౮౪

గీ॥ ఇట్లు కోడలినొప్పించి హితము నెంచి
యంపెనాపెను పుట్టింటికతిరయమునఁ
బుత్రుఁడెప్పుడు వచ్చునోపాలఁతినరుగ
వలదనునోయంచు రత్నసంభ్రమముఁజెందె॥ ౭౪

కం॥ అట రాజసభను దాసుఁడు
కటకటఁబడి రాజుపైనఁ గనలుచు నకటా!
యటమటముఁజేసె మమతా
కటాక్షములు లేకఁ బ్రతుకఁగలనాయనుచున్॥ ౭౫

కం॥ మమతందల పోయును గా
ని మతవిషయములను మదినినిల్పఁడు దాస
ర్వామతగురువులుండిన భూ
రమణునిసభలో నదెట్టి రాగంబౌ కదా॥ ౭౬

సీ॥ యోగశాస్త్రప్రశ్న లుర్వీశుఁడడుగ స్త్రీ
సంయోగసౌఖ్యంబు స్మరణసేయు
నక్షి పూరుషు నెంచు ననుచుఁదెల్పుమటన్న
కాంతాకటాక్షంబు జ్ఞప్తిఁదెచ్చుఁ
గుంభకాభ్యాసంబు గుఱినిదెల్పుమటన్నఁ
దలపోయుఁ గుచకుంభముల బెడంగుఁ
బ్రణవమాహాత్మ్యంబుఁ బ్రశ్న సేయఁగఁదాను
బ్రణయమహిమ మెంచు భావమందుఁ

గీ॥ దెల్పు పురుషార్థముల నుపాదేయమనిన
నుడిగి పురుషాయితక్రీడకొప్పుటనును
బ్రహ్మసూత్రార్థమడుగ విభ్రాంతుఁడగుచు
నాతికటిసూత్రఘంటికానాద మెంచు॥ ౭౭

కం॥ పరునకువిష్ణుపదంబే
శరీరమని బుధులువల్క సరసముగఁబొరిం
బొరివిష్ణుపదవలగ్నా
పరిరంభమె కృత్యమనును బ్రహ్మము నెఱుఁగన్॥ ౮౯

కం॥ కామోత్కంఠతమనమునఁ
గామేశ్వరునిల్పి కొలువఁగాఁజాలక యా
భూమిసురుఁడార్తుఁడగుచున్
భూమీశునిఁగన్న మొఱఁగిపోయెరయమునన్॥ ౯౦

గీ॥ వేటకానికి మిగులంగ వెఱచిపఱచు
లేడిచందముఁదోపనవ్వాఁడు గృహము
దెసకుఁబర తెంచె సంభ్రమంబెసఁగ మదిని
విరహతాపంబు కరముదుర్భరముగాఁగ॥ ౯౧

కం॥ ఆ లింగని, యంతటివాఁ
డాలిం, గనకుండ లేక యరమొయినిడె ని
ల్లాలిం గని, యాలింగన
లీలం, గనకింకనుండ లేనని యతఁడున్॥ ౯౨

కం॥ ఇల్లంత వెదకిచూచియు
నిల్లాలింగనక ధైర్యహీనుండగుచున్
మెల్లనడగ్గుత్తికతో
తల్లీ! నీకోడ లేడ? దాపక చెపుమా!॥ ౯౩

గీ॥ అనినరత్నాంబయిట్లనుఁ దనయుఁజూచి
రెండుదినములలోనె యాపంకితసభ
ముగిసెనెట్టులు చెపుమ యాముచ్చటలను
బ్రమదమొనంగంగఁ గోడలువచ్చుదనుక ॥ ౯౪

గీ॥ పాదుషావారు నిష్పక్షపాతబుద్ధిఁ
జర్చజరుగంగనిచ్చిరే సర్వమతము
లందు నెయ్యదియుత్తమంబనిరివారు
నిన్నుసభలోని బుధులుమన్నించినారె ॥ ౯౫

గీ॥ అనినవినిపించుకొనక యామనసిజార్తుఁ
డంబకునుమారు వల్కకయుచటువాసీ
పరిజనంబులనడుగ నొక్కరితె తెలిపెఁ
బుట్టినింటికిఁ మమతదాఁబోయెననుచు ॥ ౯౬

గీ॥ అప్రియంబైనయవ్వార్తయుతనికపుడు
పిడుగువడినట్లుగాఁ గనిర్విణ్ణుఁడగుచుఁ
గూలఁబడిపోయి స్తబ్ధుఁడై కొంతవడికి
నల్లనల్లనదెలివొంది యార్తుఁడగుచుఁ
బొలఁతిస్మరియించుకొని తలపోసెనిట్లు ॥ ౯౭

కం॥ నీయెడఁజేసిన దోసము
పాయఁగఁబాయదె నీదుబాహాందువులం
దే యడఁగియెపుడునీకు వి
ధేయుఁడనౌనన్నునిట్లు తెగడందగునే ॥ ౯౮

కం॥ ఆమతచర్చలు మతకరి
ఖామియలాగొడవలేల పోనిమ్మనుచున్
నామమతయె నాకభిమత
మేమన్నను సరియెయంచు నేనరుదేరన్ ॥ ౯౯

ఆ॥ మొదటితప్పునెంచి మదిలోనశంకించి
కూర్మికోలఁదిఁ జూడఁగోరినావె

త్రికరణముల నిన్ను దేవతగా నెంచి
కొలుచువా నికూర్మిఁ గొలువనేల॥ ౧౦౦

కం॥ నినువిడిచి యొక్కక్షణమై
ననుమనఁగను వశమెనాకు నళినదళాక్షీ
ననునుమతవిడిచి పోయినఁ
బనిలేదిఁక నేనెలేన భావమెఱగమున్ ॥ ౧౦౧

సీ॥ పరువులెత్తుచుఁ దడఁబడి పడుచు లేచి
నురుగులురలంగ వాహినీతరుణి విభుని
నంబునిధిఁజేరితన్మయ త్వంబునొందుఁ
దిరిగిచూచునెపుట్టింటి తెరువునేని ॥ ౧౦౨

ఉ॥ ఏమనువాఁడనిన్ సరసిజేక్షణ? నిన్ గనకుండనెవ్విధి
న్నేమనువాఁడనీవెఱుఁగవే? తలిదండ్రులఁజూడ వేడితే
నేమనివీడినన్ని చటనేగితి నాకెఱిఁగింపకొంటివై
నేమనిపిల్పులేకయివుడేఁ జనుదెంతును మామయింటికిన్॥

కం॥ మామకు లోకువయైనన్
మా, మా, యని యాజ్ఞవెట్టి మానముఁబీయున్
మామను లాఘువపఱపం
గా మమతయెనంగుమదినిఁగాంతామణిపై॥ ౧౦౪

కం॥ దక్షుఁడనంచని మును పా
దక్షుఁడుగనుగాన కతులదర్పము వెంచెన్
ద్ర్యక్షుని యవమతియే యువ
లక్షణమగుశ్వశురవసతిలాలసులకిలన్॥ ౧౦౫

కం॥ అత్తింటియల్లుఁడగు నే
నత్తమిలుం బరువుమురువునధికారంబున్

మె త్తవడియరయకొప్పినఁ
బె త్తనమిఁక సాఁగనీదు పెండ్లామయినన్॥ ౧౦౭ [?]

కం॥ సతిఁగూడఁబోవు సీతా
పతికడ్డుగనిలిచినట్టివారిధివరుసన్
మతిమాలిమామయేయిల
సతీపతులనడుమఁబొరువు సంకల్పించున్॥ ౧౦౮ [?]

ఉ॥ కీరము లేమెఱుంగుఁగలికీ! యనువాదమె కాక నేఁడు నా
కీరములోననుండి హృదయేశ్వర! రమ్మనుస్వాగతోక్తులం
గూరిమినీవెయన్నటులు కొంకకపల్కెను దొంటిరీతి నా
కీ రవళించుచిల్కలివి యేలనె? బేలన? వ్యాసమానినే?

చం॥ పికములు రామచిల్కలరవిందమరందమిళిందయోగముల్
వికచలతాంతసంతతులు వెన్నెలలున్ నినుసీదుకూటముల్
సకియరొ! మాటిమాటికిని జ్ఞప్తికిఁదెచ్చుచుశంబరారిసా
యకములనైనగాయములనక్కట! రేఁపుచుహింససేసెడిన్॥

గీ॥ చెలియ! నీచనుదోయిపసిండికొండ
నె త్తములపైన విహరించునెఱియలవడు
సమయమందు వినీతుఁడై చలువఁగూర్చు
చందమామయె వెచ్చనిచందమొందె॥ ౧౧౦ [?]

కం॥ శిరమున జహ్నునితనయయు
శరీరమున హైమవతియు సతతముఁగొలువన్
భరియించెహరుఁడునిన్నెటొ
తరమా! హరిణాంక! యొరులుదరిఁజేర్పంగన్॥ ౧౧౧ [?]

గీ॥ సుదతి? నీమోముచందురుఁజూచుతమిని
సరకుసేయనుదన్నంచుఁజంకరుండు

వేఁచుఁదఱి వేఁచి, పగదీర్ప వేఁడి వేఁడి
కిరణముల నిప్పుకణములనురలఁజేసి॥ ౧౧౨

గీ॥ నీ ప్రతాపంబుఁగాల్పనే నీరజారి!
వెన్న కన్నను మెత్తనౌ వెలఁదిమనము
నించుకేనియునటఁగరగించ లేవు
ఱాళ్ళ గరగింతునంచనిత్రుళ్ళదేల॥ ౧౧౩

కం॥ మిటకుమినుక్కని మింటం
గునుకుచుని న్నొప్పుఁ జుట్టుకొనునింతటి చ
క్కనిచుక్కలను గని మురిసి
కొని మిడిసెదు మమత కాలిగోటికవెనయే॥ ౧౧౪

కం॥ నీకింత గర్వమే దో
షాకర! నాకాంత యాననాబ్జమొకింతే
పైకెత్తిచూచెనేనియుఁ
బోకుందువెయగారుఁజేరుఁబోడిమి లేకే॥ ౧౧౫

కం॥ ఓ కాంత నన్ను నీవిటు
లేకాకినిఁజేసిపాసియేగిన నకటా!
రేకెత్తిమరునిసేనలు
మూకలుగానెత్తివచ్చి ముసరిమసఁగెడున్॥ ౧౧౬

కం॥ నాయపరాధము సైపవ
ప్రేయసి! నామెడఁదఁజీల్చి వీక్షింపుమటన్
ధ్యేయమగురూపుఁదాలిచి
యేయువతి వసించి నన్ను నేలునొయెపుడున్॥ ౧౧౭

కం॥ ఏమియొనర్పఁగ నేర్తును
భామిని! నీ మోముకంటబడకుండినయే

నీమహిమెల్లను శూన్యం
బై మునిగినయట్లు తోఁచు నంభోనిధిలోన్॥ ౧౧౮

ఆ॥ కావ్యపఠనమందుఁ గాలంబుగడపంగఁ
దివిరి గ్రంథములను దెఱచిచూడఁ
గనులఁగట్టినట్లు కాంత! నీమూర్తియే
తోఁచునక్షరంబు తోఁపదొకఁడు॥ ౧౧౯

కం॥ అనియిటులార్తిని దనకాం
తనుదలఁచుచుఁ దద్వియోగతప్తుండై యా
ఘనుఁడర్ధరాత్ర మగుటం
గని, దిగ్గన నిల్లువిడిచి కనుకనియెసఁగన్॥ ౧౨౦

సీ॥ బేలలీలను గుఱ్ఱాలసాలఁజొచ్చి
జీనిఁబూన్పక యొక్క తేజికి నెఱిగి
వెంటఁదరిమెడురిపుసైన్యభీతిఁబాఱు
పాఱుఁబోతట్లులతఁ డత్తవారియూరి
దారిఁబడి వాయువేగానస్వారిసేసె॥ ౧౨౧

కం॥ అలదమయంతీవిరహా
నలతప్తుండైన నలుఁడునాఁడును నేఁడీ
తులసియె యశ్వహృదయమును
దెలిసిన నెఱరౌతు లీపృథివిలో నెన్నన్॥ ౧౨౨

కం॥ హరిదశ్వుని యశ్వంబుల
హరివాహము నవఘళించి హర్యుత్తమ మా
విరహానలతప్తునిఁగని
కరముమదిని గనికరించుకరణిం బర్వెన్॥ ౧౨౩

కం॥ కంచెలమంచెల యడ్డము
  లెంచక లంఘించి వాగులేపులు గుట్టల్
  మించుచుఁదులసీదాసు వ
  హించితురంగమము యమున నేత్రైజఁక్రేరెన్ ॥ ౧౨౫

ఉ॥ ఆయము వాతరంగిణీ భయావహమా పెదనల్ల ౖతాచురూ
  పై యెదుటంగనంబడగ నశ్వమువిభ్రమమంది హేషలన్
  జేయుచు నెంతగాఁ జబుకు సేసియదల్చినఁగాళ్ళఁ గ్రుమ్మినన్
  వేయకుముందు నొక్కఁడుగు వేయివిధంబులబుజ్జగించినన్॥

కం॥ ముంగాళ్ళఁ బైకి నెత్తిత
  రంగిణిఁజొరఁబార జంకిరాన్పడి పిడపం
  జెంగుచు వెనకడుగిడెడుతు
  రంగముఁగని తులసిదాసు త్రస్తాత్ముండై ॥ ౧౨౬

కం॥ అయయో! యెట్లుతరింతును
  హాయమిది వెనుదీయు, బోయఁ బైమరుఁడేచున్
  ప్రియురాలిఁ జేరనీయ క
  దయమైయము చెలియరిచట దానరిక్కట్టెన్ ॥ ౧౨౭

కం॥ అత్తవిధింపఁగఁదానో
  రెత్తఁగభయమంది పుట్టినింటికి నటులో
  యుత్తలపాటునఁ జనెఁగా
  కెత్తిఋనవన్ను విడుచునింతినిముస మేన్ ॥ ౧౨౮

కం॥ విరిశరములబారికి నా
  పురుషత్వమెవమ్మొగాగముగ్ధయెటోర్చున్
  గరుణించివిడువు మీా మ
  ద్విరహంబునఁగుందు సతి నధీరసుమారా ॥ ౧౨౯

గీ॥ మమతనీనాదికిఁ దండెత్తుమరుఁడు నిజము
యమునయరికట్టఁగలదెతద్దమనమకట
మారు తేజీకిఁ ద్రొక్కు లమరినకతన
నడ్డమాకయు లేక మిన్నంటియెగయు ॥ ౧౩౦

గీ॥ పొంగిపోయెదు విభుఁ జేరనంగవించి
'ఆత్మవత్సర్వభూతాని' యనుటవినవె
యాలుమగలకు నడుమనీలీలనిలువ
యమున! నీవంటి యిల్లాండ్రకగునెనీతి ॥ ౧౩౧

ఆ॥ సవతు లేని సవతిసహవాస సౌజన్య
గరిమఁ గాక నీకుఁగలదెయమున
స్వామిఁ బొందునట్టి స్వాతంత్ర్యమింత కే
యింతపొంగిపోవనేల చెప్పుమ ॥ ౧౩౨

గీ॥ వల్లవాంగన లలనాఁడువాసుదేవ
విరహమునఁగుంద నవ్వారిఁగరుణఁజూచి
కాంతుఁగూరిచి పుణ్యంబుగట్టుకొంటి
వనుటద్వాపర విషయంబె యమున తలఁప ౧౩౩

గీ॥ యమునచేఁగల్గునంత రాయమునినిటులు
తులసిదాసుఁడు మదననిస్తులశితాంబ
కములసంవిద్ధగాత్రుఁడై కమలికమిలి
బెట్టిదంబగు సాహసముట్టిపడఁగ
నిట్లుతర్కించిమది నిశ్చయించెఁదుదకు ॥ ౧౩౪

కం॥ విరహాబ్ధియు యమునయుదు
స్తరములతలపోయనైన ధైర్యమునయమా

వరజల నరియించఁగనే
దొరకొన దొరకొనుచు విఃహతోయధి దాటన్ ॥ ౧౩౫

కం॥ మారుఁడుతెలపోయ మహా
మారి యెయవ్వానిచేత భ్రమందుటకన్నన్
ధీరతనీదుచు నవ్వాలి
తీరముఁ జేరుటయొయందె తీరుటొ మేలొ ॥ ౧౩౬

ఉత్సాహ:—
దేహ మెప్పుడైన విడక తీరునొక్కొయింకనం
దేహమేలయనుచుఁ దులసిధీరభావుఁడగుచును
త్సాహ మోహసాహసాతిశయములావహిల్లఁగా
గేహినిన్స్మరించుకొనుచుఁగీడు మేల్దలంపకే ॥ ౧౩౭

కం॥ వాహమును విడిచిరయమున
వాహినిఁజొరఁ బాఱిగంధవాహరయమునన్
బాహాబలమునఁ గినుకఁబ్ర
వాహముఁజీల్చినటులీదఁ బ్రారంభించెన్ ॥ ౧౩౮

ఆ॥ ఏది, యేది, యేదియిల్లాలి పెంకూర్మి
నీద, నీద, నీద, నేదెబలము
ఈదవడకి వడకి యేది దిక్కగునంచుఁ
బేదవడిమది విలపించుతటిని ॥ ౧౩౯

గీ॥ తెప్పచందమునోపంగఁ దేలియెదియొ
వడిగఁగొట్టుకపోవంగ నొడిసిపట్టి
దానియాధారమున నెట్లొ దాటి తులసి
దాసుఁడవ్వలిదరిఁజేరి తత్తరమున ॥ ౧౪౦

గీ॥ అనతిదూరంబుగానున్న యత్తవారి
నిలయమున కేగి యేరికిఁ దెలియకుండ
లోవలికి నేగి ప్రియురాలి లేపియామె
నపుడె యింటికిఁ గొంపోదునంచు నెంచి ॥ ౧౮౧

ఉ॥ శోణగండ్లమార్గమునఁ జోరునిలీలను దూరెనింటిలో
మారశిలీముఖవ్యథితమానసుఁడై పెరవారుచూచినన్
గారవహానియంచనక కాముని పాదుని బాఱికోడుచున్
బారుమృగమ్ము లే తెరవుఁ బట్టఁగనైనను సంశయించునే॥

గీ॥ క్రొంతమార్గాననిటు లర్ధరాత్రమందుఁ
దులసికడుకష్టమున నెట్లొదూరిదూకి
కాంత వెదకుచుఁ జేరి తానంతిపురిని
నింతులనుగాంచె నిద్దర నేకశయ్య ॥ ౧౮౩

గీ॥ చూచినంతనె నిమరించుసుదతులందు
నొక్కరితయత్తయనియు వేఱొకతమమత
యగుటదెలిసెనుగాని మార్గ్మగముగాఁగఁ
బండుకొనియుంట నేర్పరుపంగ లేక ॥ ౧౮౪

కం॥ పరికించిచూచి దాసుం
డరుంధతియటులతి సూక్ష్మమా దీపమునన్
దరుణిన్ గుఱితించిశివని
దరిఁజేరఁగఁబోవునట్టి తరుణమునందున్ ॥ ౧౮౫

గీ॥ దైవవశమున నొకగాలి తాకువలన
వీగుదివ్వియతోడ వివేకమూఱఁ
దడవులాడుచుఁదమి మమతయనితలఁచి
యత్తచెయిపట్టితిగిచెఁ గామాంధుఁడతఁడు॥ ౧౮౬

గీ॥ ఉలికిపాటున మేల్కాంచి కలికియంతఁ
చోరులన్న భ్రాంతి నార్వంగ సుతయు లేచి
బొబ్బవెట్టంగఁ దలఁచి సమ్మూఢచిత్తుఁ
డగుచు మంచము క్రిందికి దూఁగెను బిరాన ॥ ౧౪౮

ఉ॥ దొంగలుదొంగలంచుసుదతుల్ భయవిహ్వలచిత్తలౌచు నా
ర్వంగ, గృహంబులోనిమగవారును మేల్కొనియెల్లఁ గత్తిడా
లుంగయిఁబూని వెన్దివియలుంబవలట్లు వెలుంగ నార్పుఁగా
జెంగునవచ్చిముచ్చులనుజెట్టుఁబడుకొట్టి కట్టుఁడంచునున్॥

కం॥ కోలాహలంబుతోనా
భీలంబుగ బొబ్బలిడుచు వెదకియిటునటుల్
మూలను మోకాళ్ళఁదలన్
వ్రాలిచిమంచంబుక్రిందవడకెడు నొకనిన్ ॥ ౧౪౯

ఆ॥ బల్మి వెలికినీడ్చి బంధింపఁగాఁబోయి
మోముఁజూచి యొకరిమోమునొకరు
చూచుకొంచుమానినీచిత్తచోరుండు
గానిదొంగగామి వానివిడిచి ॥ ౧౫౦

గీ॥ మమత దెసఁజూచి యంతనామనుజులెల్ల
నర్మగర్భంగాఁ జిరునవ్వునవ్వి
యమ్మ! యీదొంగఁబట్ట మాకలవిగాదు
మెటులుశిక్షింతొ నీవది యేలమాకు॥ ౧౫౧

గీ॥ అనుచు వచ్చినవారెల్ల నరిగిరంత
నల్లునవివేకమునకెంతొ యాత్మవగచి
పెదవిగదలింపవారోడి వెడలెనాత్మ
జాత జామాతఁదావీడిమాతయంత॥ ౧౫౨

కం॥ కాంతునితోడను దానే
కాంతముగానుంటఁదెలిసి కాంత జుగుప్సా
క్రాంతాత్మయగుచు నాథుని
చెంతకుఁబోనోడిబాష్పసిక్తాననయై॥ ౧౫౩

ఉ॥ కూరిమిపేరిమిన్ సతులఁగోరుగృహస్థులులేరె? యెల్లరీ
తీరుననాత్మగౌరవము, ధీరత, బీరువడంగ నాలికై
చోరునిలీలనింటఁజోరఁజూతురె? యయ్యొయొయంతఁ
బోక రొ
వ్వారిటులత్తఁబట్టి తలవంపులపాలయి బేలలై రిలన్॥ ౧౫౪

కం॥ ఓరిమిరోటుఁగక నీవీ
తీరున వర్తింతువకట తీఱనితమిఁదా
నారయక నీదుతల్లియె
నేరమునాపైనమోపి నిందించుఁగదా!॥ ౧౫౫

కం॥ విశ్వముమఱచి సతినెనయ
విశ్వేశ్వరునైన జగముపేక్షింపదు ప్రా
ణేశ్వర! మనుజులమగుటకుఁ
బశ్వాదులమించఁగల్గు ప్రతిభవలవదే॥ ౧౫౬

గీ॥ చక్రవర్తుల నెయ్యంబునరకుఁగొనక
బుధజనంబులమన్ననల్ బుగ్గిఁగలిపి
యిటకువచ్చితి వవమతినెన్నవకట!
యాడుదానను నే నీఁకేమాడుదాన॥ ౧౫౭

కం॥ అనిపెనిమిటియవమతిఁగని
మనమునఁగడుఁజింతఁజెంది మానినిపలుకన్

వినిపించుకొనక దాసుఁడు
పిననవ్వొకయింతతోఁప వెలఁదికిటులనున్॥ ౧౫౮

గీ॥ చక్రవర్తులకుచ! నీవుసరసనున్నఁ
జక్రవర్తులఁదలపోయ సరసమగునె
రాజబింబాస్య! నాకు నీప్రాపుగలుగ
రాజమర్యాదలకునేల ప్రాకులాడ॥ ౧౫౯

గీ॥ పిల్పులేక నిన్ను వెన్నంటియిచ్చటి
కరుగుదెంచుటద్దె యవమతియని
యితరులెరుగకుండనింటిలోపలఁజొచ్చి
దొంగనైతి నీకు గొంగనైతి॥ ౧౬౦

గీ॥ నిన్నుగుఱితింపనేరక నీదుతల్లి
చేయిఁబట్టినతప్పదిచీకటిదియె
కాని చీకటితప్పదికాదునమ్ము
మేటికీచింత యొకపొరపాటుపనికి॥ ౧౬౧

ఉ॥ నిక్కముఁదెల్పువాఁడ నళినీదళలోచన నాకు నీపయిన్
మక్కువయెంతమిక్కుటమొ మామమొదల్గొని యెల్లవారున
నిక్కరణింబరాభవము నెంతగఁజేసినఁజింత లేదు ని
న్నక్కునఁజేర్చి కూర్చి యధరామృతపానముసేయఁగల్గినన్॥

ఆ॥ ఎవ్వరేమియన్న నింటాతఁడేపట్టి
కత్తికొక్క కండగానఱికిన
వెరవకభిసరించుఁ బ్రియుఁగూడఁబరకీయ
వలపుతోఁపనీదు పరిభవంబు॥ ౧౬౩

కం॥ పరిభవమొంతైన భవ
త్పరిరంభానందపారవశ్యంబునఁ దా

విరియున్ విరిఁబోఁడి! యింకన్
విరిశరములకాఁగలేను వినతియొనర్తున్। ౧౬౪

కం॥ అని యార్తుండై యాలిం
గనమున సతిఁబల్మిఁ జేర్పఁగాఁదివురంగాఁ
బెనిమిటి కామాంధతకున్
మనమునఁగడు వెగటుఁజెంది మానినిపలుకున్॥ ౧౬౫

ఆ॥ కాకిచేతనాకుఁ గబురంపినట్లైన
వచ్చిపడనె నీదుపాదయుగళి
నీదుసొమ్ముకాదె యీదేహమయ్యయో
తనదిగానఁగదొంగతనమదేల॥ ౧౬౬

ఆ॥ మానహానిభయముమానినమానెఁగా
కకట! ప్రాణహానికైన వెఱవ
వలదెయిట్టివేళఁ బ్రాణేశ్వరా! యేల
యమునసీఁదు సాహసమునొనర్ప॥ ౧౬౭

కం॥ మనుటకుఁ దినఁగావలయున్
మనఁదగునే తినుటకొఱకె మన్మథయిఁకే
మనఁదగునిస్పిరో! మనదగు
జననమునకుఁ గృత్యమెల్ల స్మరకేళియొకో। ౧౬౮

ఆ॥ పరహితంబుపొందెఁ బశువులుకసవైన
మెసవివసుధలోన విసువకెపుడుఁ
గాఁడిపంటఁగూర్చువానికి సాటియే
మనముచూడు నీవెమనమునందు। ౧౬౯

ఆ॥ కన్నుముక్కుతీరుఁగాంచి మోహించెదు
వయసుతిరమె, తిరమె, ప్రాణములును

ముందుగడియ కేమి ముంచుక వచ్చునో
తెలియవశమెయింత తెలియవలదె॥ ౧౭౦

చం॥ పునుఁగుజవాదిఁజందనముఁ బూసిరహిన్ విరిపాన్పుపైననే
తనువునుఁజేర్చి పేర్చుమమతన్ బరిరంభముసేయుచుండ్రదోడా
నినెత్తుదికట్టిమోసికొని విర్గయులై చితిఁజేర్చి యక్కటా
గనగనమండునిప్పులనుగాల్పరె! కాయముహేయమేకదా॥

ఆ॥ ఎద్దిగలుగ దేహమింపారునెయ్యది
పాసిపోవనపుడెపాసిపోవు
నెద్ది దిరమొ యెవియతీంద్రియమోదాని
తత్త్వమరయుకడఁ కతగదెనాథ॥ ౧౭౨

గీ॥ అనుచుబోధించు నిజపత్నినపహసించి
పలుకు నెడనవ్వదోఁపఁగఁదులసియంతఁ
బ్రణయకలహంబు సతులకుఁబాడిగాని
వెఱ్ఱివేదాంతమేలనే ప్రియునిచెంత॥ ౧౭౩

క॥ తరుణులు స్తనజఘనములన్
గురుత్వమువహించుటొప్పగునుగానియిటుల్
వరునకుఁగురువరు తెఱఁగునఁ
బరతత్త్వముబోధసేతభావ్యమె చెలియా॥ ౧౭౪

క॥ వినసొంపౌ మృదుభాషలుఁ
గనసొంపౌ మధురమూర్తికౌఁగిలికనువౌ
నునుమేనుఁ గమ్మవాతెర
వనజాననకన్న భోగ్యవస్తువుగలదే॥ ౧౭౫

గీ॥ సరసశృంగారరస సుధాసరసిఁదేల్చి
భేదభావన హరియించి విశ్వమెల్ల

మఱవఁ జేయుచు వెతలెల్ల మాపనోపు
తరుణి లేకున్న నరునకీశ్వరుఁడుగలఁడె॥ ౧౭౬

గీ॥ పటముఁగ పటంబుఁ బోద్రోచి బంధురమగు
బాహుబంధంబునను సర్వబంధముక్తి
నసదృశంబగులీలమై పొసఁగఁ జేయు
తరుణి లేకున్న నరునకీశ్వరుఁడుగలఁడె ॥ ౧౭౭

గీ॥ ఆరురుష్ణుండుదిగఁ జారక్రమమున
నున్నతంబగు స్థానంబునొందుపొంకెఁ
గాలిబందంబుగా నోపుఁగాంతయరయఁ
దరుణిలేకున్న నరునకీశ్వరుఁడుగలఁడె ॥ ౧౭౮

గీ॥ పాలలీలను జిత్తంబు భవమహాగ్ని
నుడుకఁ గైవల్యనవనీత మొందభువిని
ఆదుదియెతోడువా స్తవమరసిచూడఁ
దరుణిలేకున్న నరునకీశ్వరుఁడుగలఁడె ॥ ౧౭౯

గీ॥ మిథునమునఁగాక సాధ్యమే మీననయన
దృశ్యవిలయము సేసి నిర్వృతినిఁ జెంద
రెండుచేతులు గలియక యుండె నేని
గలుగునే చెలియ! లయసుఖంబు భువిని ॥ ౧౮౦

గీ॥ ప్రణయమహిమము నిట్టు లుపన్యసించు
ప్రియునిగన్గొని పల్కె వివేకధుర్య
యజ్ఞులకుబోధ సేయంగనగునుగాని
తెలిసిపెడదారిఁబోయినఁ దెలుపవశమె ॥ ౧౮౧

కం॥ మనుజుఁడు గృహియై యిల్లా
లినననసియుండియును దేహాళీదీపవిధిన్ ॥

గనవలె నిహపరముల రెం
టినిసమఁడగుచును నొకమ్మడిన్ నిర్మముఁడై ॥ ౧౫౨

మ॥ అనఘా! యెంతటి జ్ఞాననిన్ దెలుప స్థూలాద్యుంధతిన్యాయమై
వనితా చందనమాల్యలేశములు సంభావింప భావ్యంబగున్
ఘనమైనిర్భయమైయఖండమయినిష్కామంబునైశాంతమై
చనునా బ్రహ్మసుఖానుభూతి మనుజుల్ సాధించు యత్నం
బునన్॥ ౧౫౩

క॥ స్తంభమున భక్తుఁగావఁగ
సంభవమును జెందెననుట సత్యము నృపయో
యంభోజాక్షుఁడుమమతా
హంభావ స్తంభమందునగపడు నెపుడున్ ॥ ౧౫౪

క॥ చెకుముకిఱాతనుగల్గు శి
ఖికణముల వెలుఁగు తిరంబె కృతియుఁనతఁడా
చెకుముకి సాయమునను దీ
పిక వెలిగించిసుఖముంచు పీతతముఁడౌ ॥ ౧౫౫

గీ॥ ఆతురుతోనుపకరయు నీవన్న యట్లు
కాలిబందంబెయగు నుపకారినిజము
బందమిమకొని క్రింద నేప్రాకులాడ
నడుగుసాగునె వడఁడె యూజమఁడుచెడఁడె॥ ౧౫౬

గీ॥ తోడుబెట్టినమాత్రాన దుగ్ధమంను
వెన్నబడయంగవచ్చునె యెన్నఁడైన
నిశ్చలంబుగక్షీరంబు నిలుపవలయు
నాథ! యటుపైని గురుమథనంబువలయు॥ ౧౫౭

కం॥ క్షేమమహీంధరవాస! య
 క్షేమజగన్నాథ! సర్వశేషీ! భవసం
 శోషణ! నిఖిలవిశేష్య వి
 శేషణపదలక్ష్య భూత! శేషాహిశయా!॥ ౧౮౬

మా॥ భవకలుషవిదారీ! భక్తదుఃఖౌఘహారీ!
 కవివినుతవిలాసా! కామినీహృద్వికాసా!
 భువనభరణదక్షా! భూసురామ్నాయపక్షా!
 శ్రవణమననసాధ్యా! సద్గురుస్వామిబోధ్యా! ౧౮౭

గద్యము.

ఇది శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలిఙ్గ మహా విద్యాపీఠ స్థాపనా
చార్య శ్రీ నాగభూషణ గురువర్య కృపాకటాక్షలబ్ధ
సారస్వతోపాసనాసాదిత సరస కవితావిలాస
శ్రీనివాస కవికృత తులసీదాస చరిత్రం
బను మహా ప్రబంధంబునందు
పంచమాశ్వాసము
ఓమితి శివమ్.

# తప్పొప్పుల పట్టిక.

| పద్యము | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 75 | 2 | మేలాఘ్రాలించి | మేలాఘ్రాంచి |
| 79 | 3 | బలతేజ | బలదీప్తి |
| 84 | 2 | మేలాఘ్రాలించి | మేలాఘ్రాంచి |
| 88 | 1 | అనుమానింపకుమయ్య | అనుమానింపకుమయ్యో |
| 100 | 4 | తోఁద్రవ | తోఁప |
| 111 | 2 | క్రాంద్రుఁడగుచు | క్రాంతుఁడగుదు |
| 111 | 3 | సచిపవరుఁడు | సచివవరుఁడు |
| 120 | 4 | జేసెగ్రమ్మర | గ్రమ్మరఁజేసె |
| 61 | 2 | కండ్లు | కనుల్ |
| 11 | 2 | సీవ | సేవ |
| 63 | 1 | భిక్షకు | భిక్షుకు |
| 105 | 1 | అల్లయభి | అల్లయభ్రి |
| 7 | 3 | నరునమ్మక | నరుఁడునమ్మక |
| 13 | 1 | సోకహామపజాలు | సోహామనజాలు |
| 38 | 1 | మృగతుష్ణ | మృగతృష్ణ |
| 120 | 1 | విపుల | విప్రుల |
| 5 | 2 | ప్రేమార్థిగ | ప్రేమార్థిని |
| 16 | 1 | ఎండైనగాన | ఎండైనగాని |

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము,
విద్యాశాఖ.

# కవితిలక గ్రంథమాల

లాయిడ్సు రోడ్డు, కెథీడ్రల్ పోస్టు, మద్రాసు.

---

బ్రాంచి— బెజవాడ.



శ్రీమతి, కవితిలక, కవితా విశారద, విద్వాన్.
కంచనపల్లి కనకమ్మగారు రచించిన

## పద్యగ్రంథములు

1 శ్రీ జీవయాత్ర—
ఇది వేదాంత ప్రతిపాదకమగు పద్యకావ్యము  రు 2—8—0

2 హంసవిజయము—
ఇది మనోహరమగు వేదాంతనాటకము.  రు 1—8—0

3 అమృతసారము— (పద్యకావ్యము)
శ్రవణపేయమగు తత్వబోధ మిందుగలదు.  రు 1—0—0

4 ఆనందసారము—
తత్వశాస్త్రము-పద్యకావ్యము  రు 1—4—0

5 అభిజ్ఞాన శాకుంతలము—
ఇయ్యది మహాకవి కాళిదాసుని సంస్కృత
నాటకమునకు మనోహరమగు సాంధ్రానువాదము రు 1—0—0

6 శ్రీమద్రామాయణ కథాసంగ్రహము—
వాల్మీకీయ బాలరామాయణమున కాంధ్రీకరించిన
పద్యములు  రు 0—4—0

## ధర్మవాది, దంటుశ్రీనివాసశర్మశ్రీకృతులు

1 శ్రీ తులసీదాసనాటకము.

భక్తిశృంగార రసభరితమైన స్వతంత్ర కల్పనా సంకలిత మనోహరము, శ్రవణపేయమునగు నాటకము (అచ్చులో నున్నది.)

2 నాగభూషణ శతకము—

భక్తి, జ్ఞాన, వైరాగ్యబోధకము. ముముక్షు జనాశ్రయము [అచ్చులోనున్నది]

3 శ్రీ తులసీదాస చరిత్రము— (ప్రబంధము)

[ఉత్తరభాగము] అచ్చులోనున్నది

---

# కవికల్పలత.

(తెలుఁగు వివరణముతో)

దేవేశ్వర మహాకవి సంస్కృతముగ వ్రాసెను కలము పట్టినవానికెల్ల కవిత్వము నేర్పు గొప్ప గ్రంథము గద్య- శ్లేష- యమక- చిత్రబంధ కవిత్వములు వ్రాయుపద్ధతులు, వివిధవర్ణనము, విచిత్ర సమస్యలు, వానిపూరించుఉపాయములు మొదలగు కవిత్వ రహస్యములన్నియు తెలుపును. శతావధానులు విద్వాంసులు పలువురు మెచ్చుకొన్నారు. వెల రు. 2—4—0

విద్వాన్ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

మునిసిపల్ హైస్కూలు పండితులు

గవర్నరుపేట, బెజవాడ.